"కమ్యూనిజం" ప్రత్యేక సంచిక

# భారతదేశంలో కులవ్యవస్థ





హరప్పా పురోహితుడు

అక్టోబర్-నవంబర్ 1992 వెల రూ.10

# భారతదేశంలో కుల వ్యవస్థ

"కమ్యూనిజం"
మార్క్సిస్టు సిద్ధాంత పత్రిక ఆధ్వర్యాన

అధ్యయన సదస్సు
(విజయవాడ సెప్టెంబరు - 27, 1992)

## ప్రత్యేక సంచిక

వెల : రూ. 10/-

A

సంపాదకవర్గం :

శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావు
(సంపాదకులు)

శ్రీ ఏటుకూరు బలరామమూర్తి

శ్రీ పరకాల పట్టాభిరామారావు

'కమ్యూనిజం' పత్రికలో వెలువడుతున్న వ్యాసాలలోని భావాలతో పత్రికా సంపాదకవర్గం ఏకీభవించనవసరంలేదు. అవి రచయితల అభిప్రాయాలు మాత్రమే.

— 'కమ్యూనిజం' సంపాదకవర్గం

విడి ప్రతి : రూ. 3/-

సంవత్సర చందా : రూ. 36/-

B

" కమ్యూనిజం "

| సంపుటి : 17 | అక్టోబరు, నవంబరు 1992 | సంచిక : 6, 7 |
|---|---|---|

# విషయ సూచిక



c

D

# ముందు మాట

"కమ్యూనిజం" మార్క్సిస్టు సిద్ధాంత పత్రిక ఆధ్వర్యాన 1992 సెప్టెంబరు 27వ తేదీన విజయవాడ, హనుమంతరాయ గ్రంథాలయంలో "భారతదేశంలో కులవ్యవస్థ" పై అధ్యయన సదస్సు జరిగింది.

ఉదయం జరిగిన సభకు కమ్యూనిజం పత్రిక సంపాదక వర్గసభ్యులు శ్రీ ఏటుకూరి బలరామమూర్తిగారు అధ్యక్షత వహించారు. సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు, నాగార్జున యూనివర్శిటీ బౌద్ధ కేంద్రం మాజీ అధ్యాపకులు బి.ఎస్.ఎల్. హనుమంతరావుగారు "భారత దేశంలో కుల వ్యవస్థ-పుట్టుపుర్వోత్తరాలు" అన్న అంశంపై ప్రారంభోపన్యాసం చేశారు. ఆంధ్రా యూనివర్శిటీ రీడర్ డాక్టర్ చందు సుబ్బారావుగారు "కులాలు ఎలా పోతాయి?" అన్న అంశంపై తమ అధ్యయన పత్రాన్ని ప్రవేశపెడుతూ ప్రసంగించారు. మార్క్సిస్టు తత్వవేత్త శ్రీ ఏటుకూరి బలరామమూర్తిగారు "ఊర్ధ్వచలనం - అధోచలనం" అన్న అంశంపై తమ అధ్యయన పత్రాన్ని ప్రవేశపెడుతూ మాట్లాడారు.

భారత కమ్యూనిస్టు పార్టీ నాయకులు శ్రీ చండ్ర రాజేశ్వరరావుగారు "కాలదోషం పట్టిన కులవ్యవస్థ" అన్న అంశంపై తమ అధ్యయన పత్రాన్ని ప్రవేశపెడుతూ మాట్లాడారు. ఉస్మానియా యూనివర్శిటీ తెలుగు అధ్యాపకులు డా॥ ఎస్. వి. సత్యనారాయణ "భారతదేశంలో కుల వ్యవస్థ" అన్న అంశంపై తమ అధ్యయన పత్రాన్ని ప్రవేశపెట్టారు. స్వాతంత్ర్య సమరయోధులు, వేదాధ్యయనవేత్త డాక్టర్ మాడభూషి భావనాచార్యులు "ప్రాచీన భారతదేశంలో కులవ్యవస్థ" అన్న అంశంపై తమ అధ్యయన పత్రాన్ని ప్రవేశపెట్టారు.

మధ్యాహ్నం జరిగిన సమావేశానికి కమ్యూనిజం పత్రిక సంపాదకులు శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు. నాస్తికోద్యమ ప్రముఖులు, సంఘ సేవకురాలు శ్రీమతి హేమలతా లవణంగారు "కులం రక్కసిని కూల్చివేద్దాం" అన్న అధ్యయన పత్రాన్ని ప్రవేశపెడుతూ ప్రసంగించారు.

స్వాతంత్ర్య సమరయోధులు, సుప్రసిద్ధ నవలా రచయిత శ్రీ మహీధర రామమోహనరావుగారు "కులాల సమస్యకు పరిష్కారం ఉందా?" అన్న అంశంపై తమ అధ్యయన పత్రాన్ని ప్రవేశపెట్టారు. కరీంనగర్ జిల్లా జగిత్యాల వాస్తవ్యులు శ్రీ బి. యస్. రాములుగారు "కులాల సమస్యలో ఇమిడివున్న అంశాలు - పరిష్కారాలు" అన్న తమ అధ్యయన పత్రాన్ని ప్రవేశపెడుతూ మాట్లాడారు. శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావుగారు "మారుతున్న సమాజంలో కులం - వర్గం" అన్న అంశంపై తమ అధ్యయన పత్రాన్ని ప్రవేశపెట్టారు.

"కమ్యూనిజం" పత్రిక సంపాదక వర్గసభ్యులు శ్రీ పరకాల పట్టాభిరామారావు "కులవ్యవస్థపై స్వాతంత్ర్యోద్యమ ప్రభావం" అన్న అంశంపై తమ అధ్యయన పత్రాన్ని ప్రవేశపెట్టారు.

సుప్రసిద్ధ సాహిత్యవేత్త, పరిశోధకులు శ్రీ ఆరుద్ర, ప్రముఖ కమ్యూనిస్టు, రైతు ఉద్యమ నాయకులు శ్రీ కొల్లా వెంకయ్యగార్లు సదస్సుకు పంపిన అధ్యయన పత్రాల సారాంశాన్ని శ్రీ ఏటుకూరి బలరామమూర్తిగారు వివరించారు.

స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ గోవాడ నిరీక్షణరావుగారు "వృత్తిపరంగా మాహమ్మారి కులవ్యవస్థ" అనే అంశంపైన ఆంధ్రప్రదేశ్ దళిత మహాసభ ప్రధాన కార్యదర్శి శ్రీ కత్తి పద్మారావుగారు "కులం పునాదులు - శాస్త్రీయ అవగాహన" అనే అంశంపైన తమ అధ్యయన పత్రాలను సదస్సుకు పంపారు. అధ్యయన పత్రాలపై జరిగిన చర్చలో శ్రీ అట్లూరి పురుషోత్తం, శ్రీ ఈడ్పుగంటి లక్ష్మణరావు, శ్రీ రాధాకృష్ణమూర్తి, శ్రీ విజయకుమార్, శ్రీ చంద్రశేఖర్ ప్రభృతులు పాల్గొన్నారు. చర్చలో వీరు లేవనెత్తిన కొన్ని ప్రశ్నలకు శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావు సమాధానం యిచ్చారు.

సదస్సును కమ్యూనిజం పత్రిక సంపాదక వర్గ సభ్యులు శ్రీ పరకాల పట్టాభిరామారావు నిర్వహించారు. ప్రజా నాట్యమండలి కళాకారుడు శ్రీ ఆర్. పిచ్చయ్య దేశభక్తి గేయాలను ఆలపించారు.

సదస్సులో వివిధ రాజకీయ అభిప్రాయాలు గల్గినవారు, వివిధ ప్రజా ఉద్యమాలకు చెందిన వారు, పలువురు మేధావులు, స్వాతంత్ర్య సమరయోధులు పాల్గొన్నారు. ఇటువంటి ప్రధాన సమస్యపై సదస్సు జరిపినందుకు తమ హర్షం వెలిబుచ్చారు.

సదస్సులో పాల్గొనదలచిన హైదరాబాద్ సార్వత్రిక విశ్వవిద్యాలయం చరిత్ర అధ్యాపకులు ప్రొఫెసర్ వి. రామకృష్ణ, ఆంధ్రప్రదేశ్ మార్క్సిస్టు - లెనినిస్టు సెంటర్ కార్యదర్శి శ్రీ కె. జి. సత్యమూర్తిగార్లు అనివార్య కారణాలచే సదస్సుకు హాజరు కాలేనందుకు తమ విచారం వెలిబుచ్చుతూ వర్తమానం పంపారు.

మరో విషయం, ఈ ప్రత్యేక సంచిక అనుబంధంగా శ్రీ ఎస్. జి. సర్దేశాయి రాసిన "భారత దేశంలో కుల వ్యవస్థ సామాజిక విప్లవానికి ప్రతిబంధకం" అనే వ్యాసాన్ని, శ్రీ ఎ. బి. బర్ధన్ రాసిన "కులాలు - వర్గాలు" అనే వ్యాసాన్ని కూడా పాఠకుల సౌకర్యార్థం ప్రచురిస్తున్నాం.

# భారతదేశంలో కులవ్యవస్థ : పుట్టుపూర్వోత్తరాలు

సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు, నాగార్జున యూనివర్శిటీ బౌద్ధ కేంద్రం, మాజీ అధ్యాపకులు
శ్రీ బి.ఎన్.ఎల్. హనుమంతరావుగారి ప్రారంభోపన్యాసం

*మిత్రులారా!*

భారతదేశంలో కులతత్వం గురించి అధ్యయన సదస్సు - అంటే సెమినార్ లాంటిది- ఇక్కడ జరుపుతున్నాం మీరొక పేపరు తీసుకురావలసింది శ్రీ బలరామమూర్తిగారు వ్రాసిన ఉత్తరం నాకు సకాలానికి అందలేదు. ఈ సదస్సు గురించిన సమాచారం నాకు చాలా ఆలస్యంగా చేరటంవల్ల ఒక పేపరు తీసుకువచ్చి చదవడానికి అవకాశం లేకపోయింది. అందుచేత నేను ఆ విషయాన్ని గురించి మాట్లాడతాను. నన్ను క్షమించవలసిందిగా కోరుతున్నాను.

## కుల వ్యవస్థ : ఒక శాపం

మన దేశంలో ఈ కుల వ్యవస్థ ఈ సమాజాన్ని ఒక శాపంగా పట్టి పీడిస్తోంది. విశ్వనాథ సత్యనారాయణగారు వేయిపడగలు అని ఒక గ్రంథం వ్రాశారు. ఇంగ్లీషులో ఇది ఒక "హైడ్రాహెడెడ్ మాన్స్టర్స్" అన్నమాట. అంతూపొంతూ లేకుండా ఈ కులం విస్తరించి సమాజాన్ని పట్టిపీడిస్తోంది. దీనికి పరిష్కారం ఏదైనా ఉన్నదా? ఉంటే యెప్పట్లో ఉంది? ఎలా పరిష్కారం చేయాలి? ఈ సమస్యలు ఈ ఒక్క సదస్సులోగాని, ఒక మీటింగులోకాని తేలేటటువంటి విషయాలు కావు. ఇప్పుడే చంద్ర రాజేశ్వరరావుగారు అన్నారు. ఇక్కడ చేరిన వారిలో చాలా మంది వృద్ధులే కనిపిస్తున్నారు. యువకులు అంటే ముందు తరాలవారు, ఇటువంటి సమస్యల గురించి ఆలోచించవలసినటువంటి వాళ్ళు - పరిష్కారం కనుగొనవలసిన వాళ్ళు - వారిలో చాలా తక్కువ మంది ఈ సదస్సులో కనిపిస్తున్నారు. ఒకప్పుడు థియసాఫికల్ లాడ్జిలో సమావేశమైనప్పుడు నేను - ఒక విషయం అన్నాను. అది వారికి కోపం వచ్చే విషయమే కావచ్చు. "Theosophical Society has no future" అన్నాను. అయితే ఈ కుల వ్యవస్థకు భవిష్యత్తు లేదని చెప్పడానికి అంత ధైర్యం చాలడంలేదు. దీనికి భయంకరమైన భవిష్యత్తు ఉన్నట్లుగా కనిపిస్తోంది. కాబట్టి యువకులైనట్టివారు శ్రద్ధ తీసుకోవాలి. కాని అలా కనిపించటంలేదు.

ఇటువంటి సదస్సులు జరగటం చాలా అవసరం. పరిశోధనలు, పరిష్కారాలు కనుగొనటం కూడా అవసరమే. పరిష్కారాలను, పరిష్కార మార్గాలను ప్రజలలో వ్యాపింపజేయాలి. ప్రజలకు నచ్చజెప్పాలి. అప్పుడు కాని సమాజంలో మార్పు ప్రారంభంకాదు. ఏ మార్పు అయినా, హఠాత్తుగా సంభవించదు. అలా హఠాత్తుగా సంభవించి నటువంటి మార్పు శాశ్వతంగా ఉండదని నా నమ్మకం. క్రమంగా రావాలి మార్పు.

## కుల వ్యవస్థ గురించి అపోహలు

ముందు ఈ సమస్య గురించి ఆలోచించడానికి పూర్వం : ఈ కులాలు యెలా వచ్చాయి? నేను ప్రాయికంగా చరిత్ర విద్యార్థిని. మనలో చాలా మందికి, విద్యావంతులకు కూడా, మన సమాజాన్ని గురించి అనేక అపోహలు, అనేక దురభిప్రాయాలు ఉంటూ వున్నాయి. సాధారణంగా, ఈ కుల వ్యవస్థను ఆర్యులు మన దేశంలోకి తీసుకువచ్చారనీ, అనార్యులైన వారిని తమకు బానిసలుగా చేసుకోవడానికి ప్రయత్నించారనీ, ఈ ఆర్యులలో ఉన్న పూజారులు ఆధిపత్యం వహించి, ఈ కులవ్యవస్థకు దైవత్వం ఆపాదించి ప్రజల నోళ్ళు మూశారనీ ఒక దురభిప్రాయం ఉంది. ఇటీవల ఈ సదస్సు గురించి తెలియక ముందు ఏదో ఒక విషయం గురించి ఆలోచిస్తూండగా ఒక చరిత్ర ఉపన్యాసకుడు నా దగ్గరకు వచ్చాడు. అతనిని నేను రెండు ప్రశ్నలడిగాను. మ్లేచ్ఛుడు అంటే యెవరు? అని అడిగాను. మనం సాధారణంగా వాడుకునే మాటలే ఇవి. "ఆ మ్లేచ్ఛుడు అంటే ఏమిటి? అంటరానివాడు" అని అన్నాడు. సరే "శూద్రుడు అంటే యెవరు?" అని అడిగాను. "శూద్రుడు అంటే బానిస" (Slave) అన్నాడు. ఈ రెండింటికీ అతడు చెప్పిన సమాధానాలు సరియైనవి కావు. ఇది యెందుకు చెప్పానంటే, అతడు ఇరవై సంవత్సరాలుగా ఒక కాలేజీలో డిగ్రీ విద్యార్థులకు చరిత్ర ఉపన్యాసాలు యిస్తున్నాడు. మ్లేచ్ఛ పదానికి అతనికి సరియైన అర్థం తెలియదు. అలాగే శూద్ర అనే పదానికి కూడా అతనికి సరియైన అర్థం తెలియదు. ఈ కులాలు యెలా వచ్చాయి? ఈ వర్ణాలు యెలా వచ్చాయి? వర్ణము, కులము ఒకటి కాదు. కాని మనం వర్ణము, కులము రెంటినీ సమానార్థంలో వాడుతున్నాము. కులము, వర్ణము కాక మరొకమాట కూడా ఉంది. జాతి అన్నది. జాతి, కుల, వర్ణ అనే మూడు పదాలను మనం ఒకే అర్థం యిచ్చే విధంగా సమానార్థకాలుగా వాడుతున్నాం. అది కూడ పొరపాటే.

## సమాజ పరిణామం : పని విభజన

ప్రతి నాగరిక సమాజ పూర్వదశలోనూ (Settled Society) ఒకప్పుడు సమాజం, మానవజాతి సంచార దశలో ఉండేది. ఆహార సంపాదన నిమిత్తం ఒక ప్రాంతం నుండి మరొక ప్రాంతానికి సంచారం చేస్తూ ఉండేది. అటువంటి దశను విడిచిపెట్టి, గ్రామాలలో నివాసాలు ఏర్పాటు చేసుకున్న తరువాత, ఆర్థిక వ్యవస్థ కొంత క్లిష్టరూపాన్ని ధరించిన

తరువాత, వ్యవసాయం మున్నగు వృత్తులు వచ్చిన తరువాత వ్యవసాయంతో పాటు అనేక వృత్తులు వచ్చిన తరువాత - అందులో కమ్మరం, కుమ్మరం, వడ్రంగం ఇటువంటి వృత్తులు వస్తాయి. వ్యవసాయంతోపాటు, ఆ వృత్తులు వచ్చినపుడు, సమాజంలో వృత్తి విభజన జరగటం సర్వసాధారణమైన పరిణామం. అది, ప్రతీ నాగరిక సమాజంలోను జరుగుతుంది. ఈజిప్టులో అలాగే జరిగింది. గ్రీస్‌లో చాలా ప్రాచీనమైన నాగరికత ఉంది. అందులోను అలాగే జరిగింది. చైనాలోను అలాగే జరిగింది. వృత్తిని బట్టి సమాజ - విభజన జరుగుతుంది. అది వృత్తి విభజన. అప్పుడు కులాలు అనే ప్రసక్తిలేదు. వర్ణాలు అన్న ప్రసక్తి లేదు.

## భారతదేశ ప్రాచీన నాగరికత : హరప్ప

మానవుడికి రెండు లక్షణాలున్నాయి. ఒకటి భయం. రెండవది ఆశ. ఈ రెండు మానసిక అవస్థలవల్ల మతం అనేది పుట్టుకొనివచ్చింది. మతం ఎప్పుడైతే వచ్చిందో అప్పుడు "పూజారి" వర్ణం ఒకటి పుట్టుకొని వస్తుంది. ఈ పూజారి వర్ణం, చేసేది ఏమంటే మానవునిలోని రెండు బలహీనతలను ఒకటి ఆశ; రెండవది భయం - ఈ రెండు మానసిక పరిస్థితులను అతడు అవకాశంగా తీసుకొని మనుషులను దోచుకుంటూ వుంటాడు. ఇది సాధారణంగా ప్రతీ సమాజంలోను ఉండేదే. అది మన భారతీయ సమాజానికి ప్రత్యేకించి నటువంటి లక్షణం ఏమీ కాదు.

## ఆర్యులు రాకముందే వృత్తి విభజన

అతి ప్రాచీనమైనటువంటి నాగరికత భారతదేశములో ఉన్న సంగతి అందరికీ తెలిసిందే. అదే సింధు నాగరికత. దానిని హరప్ప సంస్కృతి అంటూ ఉంటాం. ఈ హరప్ప సంస్కృతిలోనే మనకు వృత్తిపరమైన సాంఘిక విభజన కనిపిస్తుంది. అక్కడే పూజారి వర్ణం కూడా వుంది. వీరి తరువాత ఆర్యులు మన దేశానికి వచ్చారు. ఆర్యులు ఎలా వచ్చిందీ, ఎప్పుడు వచ్చిందీ అనే విషయంలోకి మన ఇప్పుడు వెళ్ళడం సాధ్యంకాదు. మొత్తానికి వచ్చారు. వారు ఒక్కసారిగా రాలేదని చెబుతున్నారు ఇటీవల చరిత్రకారులు. తడవలు తడవలుగా వచ్చారు. ఒక తరంగం (Wave) తరువాత ఇంకొక తరంగంగా వారు వచ్చారు. ఆర్యులు అప్పుడు సంచార జీవనులు. ఇటీవల ఒక పురాతత్వవేత్త ఆల్చిన్ అనే అతడు "భారతీయ నాగరికత ఆవిర్భావం" (The birth of Indian Civilization) అనే పుస్తకంలో ఆర్యుల గురించి వ్రాస్తూ వారిని గుర్రాలపై స్వారీచేస్తూ వచ్చిన ఇండో యూరోపియన్ బర్బరులు (Horse riding Indo-European barbarians) అన్నాడు. ఆర్యులు అనే మాట చూస్తే అది చాలా గంభీరంగా, చాలా గొప్ప నాగరికత వున్న వారు అనే అభిప్రాయం మన మనస్సులలో పడిపోయింది. అతడు అన్నాడు కదా- (Horse riding of Indo-European Barbarians) అని అంటే చాలా అనాగరిక దశలో ఉన్న, వాళ్ళు సంచార దశలో ఉన్నటువంటి వాళ్ళు.

గ్రీసు చరిత్రలో ఒక సంఘటన ఉంది. ఏమిటంటే అది, రోమన్‌లకంటే గ్రీకులది ఎక్కువ నాగరికత; ఉదాత్తమైన నాగరికత. The Conquering Romans - రోమనులు గ్రీకులను జయించారు. The Conquering Romans were Conquered by the Culture of the Conquered Greeks. విజితులైన గ్రీకుల నాగరికత సంస్కృతులు, విజేతలయిన రోమనులను జయించాయి అని అర్థం. అదే విధంగా The Conquering Aryans were con-quered by the Harappa Culture of the Conquered Peoples. ఆర్యులలో, వారు సంచారక దశలో ఉన్నప్పుడు వారిలో నిర్దుష్టమైన, నిర్దిష్టమైన సంస్థలు ఏర్పడడానికి అవకాశం లేదు. అదే విధంగా ఈ పూజారి వర్గం కూడా ఆర్యులలో లేదు. పూజారులు అనే వారు మొట్టమొదటి ఆర్యులలో లేరు. అయితే వాళ్ళు యజ్ఞాలు చేసే వారు. వాళ్ళలో కవులు (Poets) ఉండేవారు కాని పురోహిత వర్గం (Priests) లేదు. సర్వసాధారణంగా చాలామంది దీనిని ఉదహరిస్తూ ఉంటారు. ఆర్యులలో ఈ కుల వ్యవస్థ లేదు అని చెప్పడానికి ఒక వాక్యాన్ని ఉదహరిస్తూ వుంటారు. ఒక వ్యక్తి చెబుతాడు: "నేను కవిని, (Poet) నా తండ్రి వైద్యుడు; నా తల్లి ధాన్యం దంచుతుంది. డబ్బుకోసం మా కుటుంబంలో సభ్యులం మేము వేర్వేరు వృత్తులు అవలంబిస్తాము" అని చెప్పాడు. అతడు తాను కవినని చెప్పాడు గాని పురోహితుణ్ణని చెప్పలేదు. అంటే కవిత్వం వ్రాసి లేక ప్రార్థనా శ్లోకాలు వ్రాసి అమ్ముకొని జీవించేవాడు.

## హరప్ప నాగరికత : పూజారి వర్గం

కున్హన్‌రాజా అని ఆంధ్రా యూనివర్శిటీలో ఒక పెద్ద సంస్కృత అధ్యాపకుడు ఉండేవాడు. ఆయన "వేద" అనే పుస్తకం వ్రాశాడు. అందులో ఆర్యులలో పూజారులు లేరు. మొదట వచ్చిన ఆర్యులలో (Early Aryans) లేరు. కాని హరప్పా ప్రజలలో పూజారులు ఉన్నారు" అని చెప్పాడు. చాలా మంది చరిత్ర పుస్తకాలు చూచి ఉంటారు. అసలు హరప్పా ప్రజలను పూజారి వర్గమే పరిపాలిస్తూ ఉండేది అని. Priestly Oligarchy was ruling over the Harappa peoples. పురోహిత పెత్తందారీ వర్గమే ప్రజలను పరిపాలిస్తూ ఉండేది.

ఇక్కడ పూజారి వర్గం ఉండేదని చెప్పడానికి మనకి పురావస్తు విశేషంగా, శాస్త్రరీత్యా ఒక ఆధారం లభించింది. (Archeological evidence) ఒక బొమ్మ దొరికింది. ఆ బొమ్మకు మీసాలు లేవు. తలమీద జుట్టులేదు. గడ్డం పెరిగి. ఉంది. మీరు కొంచెం ప్రామాణికమైన చరిత్ర పుస్తకాలు చూడండి, ఈ బొమ్మ కనిపిస్తుంది. హిందూ ధర్మంలో కూడా, ఇటీవల హిందూ ధర్మంలోకూడా ప్రతీమత కార్యం చేసేటప్పుడు "కేశ, మిశ్రు వాపయిత్వా" మీసాలు, గడ్డాలు తీసెయ్యాలి అని ఉంది. ఈ సంప్రదాయాన్ని హరప్పా ప్రజల దగ్గర నుండి ఆ తరువాత ఆర్యులు అవలంబించారు. అంతేకాకుండా ఆ బొమ్మలో మరొక విశేషం ఉంది. ఆ

పూజారి ఒక ఉత్తరీయం వేసుకుంటాడు (Upper cloth) ఆ ఉత్తరీయం, జంధ్యం ఉన్న స్థానంలో ఉంటుంది. ఆ ఉత్తరీయం మీద కళావరుచుక్కలు Tri-foil Mark Symbols వుంటాయి. మూడు ముళ్ళు యజ్ఞోపవీతానికి ఉంటాయి. వాటికి ఇవి చిహ్నాలు. వాడు ఒక విలక్షణమైన పురోహితుడు. ఈ పూజారి వ్యవస్థను ఆర్యులు హరప్పా ప్రజల దగ్గర నుండి తీసుకొని దానిని పెంపొందించారు.

## విశ్వామిత్రుడు మొదటి పూజారి

మనలో ఉన్న దురభిప్రాయాల గురించి చెప్పడానికి మరొక ఉదాహరణ కూడా చెబుతాను. మన చరిత్రలో మొట్టమొదటి పూజారి వశిష్ఠుడు కాదు. విశ్వామిత్రుడు. విశ్వామిత్రుడు మొట్టమొదట ఒక బ్రాహ్మణుడు, అతడు యెప్పటివాడు? అతి ప్రాచీన వైదిక కాలంలో సుదాసుడు అనే వాడు పదిమంది రాజకూటమిని ఓడిస్తాడు. "దాశరాజ యుద్ధము" అని చెప్పే చాలా ప్రాచీన వైదిక కాలంలో జరిగిన యుద్ధం. అతనికి విశ్వామిత్రుడు పూజారి. విశ్వామిత్రుడు ఆర్యుడా? కాదు. అతడు అసురుడు. అసురుడంటే రాక్షసుడని కాదు. అస్సీరియన్ జాతివాడు. బెనర్జీ శాస్త్రి అనే ఆయన బెనారెస్ హిందూ యూనివర్శిటీలో సంస్కృత అధ్యాపకుడున్నాడు. ఆయన "అసుర - ఇండియా" అనే పుస్తకం వ్రాశాడు. ఆ పుస్తకంలో ఈ విశ్వామిత్రుడు మొదలైన వారు "అస్సీరియన్స్-అసురులు" అని వ్రాశాడు. విశ్వామిత్రుడు ఆర్యుడు కాదు. క్షత్రియుడూ కాదు. విశ్వామిత్రుడు మన దేశంలో మొట్టమొదట తెలిసినటువంటి పూజారి. వశిష్ఠుడు తరువాత వస్తాడు. ఈ సుదాసుడే విశ్వామిత్రుణ్ణి తొలగిస్తాడు. ఎందుకంటే విశ్వామిత్రుడు అహంకారంతో వ్యవహరించి ఉంటాడు. దానికి కూడ ఒక కారణం - ఆర్థిక, రాజకీయ కారణం ఉంది. నాటి వరకు పూజారులు హరప్పా సంస్కృతిలో పరిపాలకులుగా ఉండేవారు. బహుశా అదే సంప్రదాయంలో ఈ విశ్వామిత్రుడు నేను పెద్ద అధికారిని అని చెప్పి వాదించి ఉంటాడు. రాజుకు పురోహితునకు మధ్య సంఘర్షణ, వైరుధ్యం, (The conflict between the Prince and the Priest) జరిగినట్లుగా కనిపిస్తుంది. అది వేదకాలంలోనే, సుదాసుడు కాలంలోనే ప్రారంభమైంది. కొంచెం అహంకారంగా ప్రవర్తించడంవల్ల, అధికారాన్ని కావాలని అడగడంవల్ల ఈ విశ్వామిత్రుణ్ణి తొలగించి వశిష్ఠుణ్ణి పూజారిగా చేసుకొని ఉంటారు. అదీ ఈ విశ్వామిత్రుడు - వశిష్ఠుల మధ్య కలహానికి కారణం. ఇది రెండు పురోహిత వర్గాల మధ్య సంఘర్షణ (A conflict between two Priestly classes - a conflict between the Prince and the priest.)

## వశిష్ఠుడు ఎవరు?

అంతేకాని విశ్వామిత్రుడు మొదట క్షత్రియుడై, వశిష్ఠుడు బ్రాహ్మణుడై ఇది బ్రాహ్మణ - క్షత్రియ పోరాటం కాదు. వశిష్ఠుడు ఎవరు? ఆర్యుడా? కాదు. కనీసం విశ్వామిత్రుడు అసురుడని మనకు తెలుస్తుంది. వశిష్ఠుని యొక్క పుట్టుక సంగతి మనకు తెలియదు. వశిష్ఠుని పుట్టుక గురించి రెండు సంప్రదాయాలున్నాయి. ఒకటి; ఇతడు ఊర్వశికుమారుడు అని ఉంది. కాని తండ్రి ఎవరో తెలియదు. మరి యొక సంప్రదాయం ప్రకారం ఇతనికి ఇద్దరు తండ్రులు. మిత్ర-వరుణ అనేవారు. కాని తల్లి యెవరో తెలియదు. ఒక వైపున తండ్రి యెవరో తెలియదు. మరియొక వైపున తల్లి యెవరో తెలియదు. ఈ మిత్ర -వరుణులు ఇద్దరు కూడా అసురులు. తరువాత వైదిక దేవతలు అయినారు.

ఈ విధంగా మన దేశంలో ఈ పూజారి వ్యవస్థ అనేది, ఒక రకంగా బ్రాహ్మణ క్షత్రియ వర్ణాలు లేక కులాలు ఏర్పడినాయి. ఇది వైదిక యుగంలో జరిగిన పరిణామం. క్రమంగా ఇటువంటి విశేషాలు ఇంకా చాలా ఉన్నాయి. అనార్యుల నుండి ఆర్యులు పూజారి వ్యవస్థను సంక్రమింపజేసుకున్నారు. అధర్వవేదంలో కేశి, ముని అనే వాళ్ళు ఉండేవారు. వారు కూడ అనార్యపూజారులే. వారిని "వ్రాత్య" అనేవారు. పంచవింశ బ్రాహ్మణంలో "వ్రాత్యస్తోమ" అంటే వ్రాత్యులైన వారిని, అనార్యులైన వారిని ఆ హోమంలో పవిత్రం చేసి వారిని ఆర్యులలో కలుపుకున్నారు. ఇందాక చెప్పాను. ఆల్చిన్ అనే భార్యభర్తలిద్దరు పెద్ద పురాతత్వ వేత్తలు. వారు వ్రాసిన పుస్తకంలో ఋగ్వేదం శతాబ్దాల తరబడి ఆర్యుల-అనార్యుల మధ్య సహకార ఫలితంగా ఉద్భవించింది. (It is the result of Centuries of cooperation between the Aryans and Non Arynas).

## ఆర్య-అనార్య సహకారం ఫలితమే ఋగ్వేదం

ఆర్యులు అనార్యుల మధ్య పరస్పర సహకారం వల్ల ఋగ్వేదం తయారైంది. వైదిక వాఙ్మయం అంతా అలాగే తయారైంది. ఇది ఆర్య-అనార్యుల మధ్యసహకార కృషివల్ల ఈ భావాలు, సిద్ధాంతాలు మార్చుకోవడంవల్ల ఈ వైదిక వాఙ్మయం అంతా ఏర్పడింది. దీనికి ఒక ఉదాహరణ : వైదిక వాఙ్మయాన్ని సంకలనం చేసినవాడు ఎవరని మనం చెప్పుకుంటాం? అతడు వ్యాసుడు. వ్యాసుడు ఎవరు? అతని తండ్రి ఆర్యుడు. తల్లి కైవర్త అంటే ఒక బెస్తస్త్రీ (He is of Mixed orgion) అంటే ఆర్యఅనార్య సంపర్కం వల్ల వాళ్ళ సహకారంలో వైదిక వాఙ్మయం అంతా ఏర్పడి రూపొందిందని చెప్పడానికిది సూచన.

ఈ హరప్పా సమాజంలోనే పూజారులు ఉండే వారు. అంతేకాక వర్తకులు రైతులు ఈ వర్గాలు కూడ ఉండేవి. దీని గురించి యింక చాలా తర్జన భర్జనలు జరుగుతున్నాయి. చరిత్రకారులలో చర్చలు కొనసాగుతున్నాయి. సామాజిక శాస్త్రవేత్తలలో, మానుష శాస్త్రజ్ఞులలో (ఆంథ్రోపాలజిస్టులు) ఒక నిర్ణయానికి ఇంకారాలేకుండా ఉన్నారు.

## ఆర్య–అనార్య మిశ్రమం

అప్పుడు ఉన్నటువంటివి కులాలా? వర్ణాలా? కొందరు వీటిని కులాలు అంటున్నారు. మరికొందరు వీటిని కులాలు కావు. వర్ణాలంటున్నారు. ఈ వర్ణాల పుట్టుక హరప్పా సంస్కృతిలో జరిగిందని ఒక సిద్ధాంతం. కాదు ఇవి కులాలకు మూలమైనాయి అని మరొక సిద్ధాంతం. ఏమైనప్పటికీ వృత్తిపరమైన సామాజిక విభజన, హరప్పా కాలంలో కనిపిస్తుంది. చివరకు బానిసలు కూడ హరప్పా ప్రజలలో ఉండేవాళ్ళు. దానికి ఒక పురాతత్వ సాక్ష్యం లభిస్తుంది. మొహెంజదారోలో ఒక చోట చాలా చిన్న చిన్న ఇళ్ళున్నాయి. రెండువిన్న గదులున్న ఇళ్ళు అవి. ఆ గదుల ప్రక్కన ధాన్యం దంచేవి–ఆ రోజుల్లో దంచడంరాలేదు. గానుగ ఆడేవారు – ధాన్యాన్ని పిండిగా చేసే ఒక సాధనం ఉండేది. ఇందులో నివసించేవారు బానిసలు అనీ, వాళ్ళు ఈ పట్టణాలకు ఈ ధాన్యాన్ని దంచి సరఫరా చేస్తూంటారని! రొమిలా థాపర్ అనే చరిత్రకారిణి అంటరానితనం అనేది కూడా అప్పుడే ప్రారంభమైంది అనే సిద్ధాంతం లేవదీశారు. దీనికి ఈ వృత్తిపరమైన విభజనకు ఆర్యులు "వర్ణ" అనే భావాన్ని కల్పించారు. ఆర్యులలో వర్ణభావన ఎక్కువగా ఉండేది. ఎందుకంటే ఆర్యులు తెల్లగా ఉండేవారు. స్థానికులు నల్లవారుగా వుండేవారు. వీరిని వర్ణించేటప్పుడు "కృష్ణ వర్ణః, "కృష్ణత్వచః" అని, "దాసవర్ణః". అంటే వాళ్ళ వర్ణానికి భిన్నమైన వర్ణంలో ఉండేటటు వంటివారు. అయితే వీరందరూ కలిసిపోయారు. ఎప్పుడు కలిసిపోయారు? తొలి వేద యుగంలోనే కలిసిపోయారు. సుదాసు అనే పేరు చూడండి. అందులో దాస పదం– ఆర్య – దాస సాంకర్యానికి నిదర్శనం. వీరి తాతగారు దివోదాసుడు కాబట్టి, ఆదిమ వైదిక యుగంలోనే ఈ ఆర్య–దాస జాతి సాంకర్యం జరిగింది. అవి వర్ణాలు కావు. జాతులు, తెగలు, తెగల సాంకర్యం జరిగింది.

## ఆర్యులలో మొదట మూడే వర్ణాలు

మొట్టమొదట ఆర్యులలో మూడే వర్ణాలుండేవి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య. ఈ వైశ్యులే సమాజంలో ఉండే అన్ని పనులు చేసేవారు. వారే వ్యవసాయం చేసే వారు. వాణిజ్యం చేసేవారు. మిగిలిన ఈ వడ్రంగం మొదలైన వృత్తులు కూడా వారే చేసే వారు. "విస్", అనే మాటకు అసలు అర్థం "ప్రజ" అని. క్షత్రియులు బ్రాహ్మణులు పూజారులుకాని వారందరు మిగిలిన ప్రజ. అంతేకాని విస్–వైశ్య అనే మాటకు వేరే అర్థం ఏమీ లేదు. వారు ప్రజలు. ఆ ప్రజలే మిగిలిన వృత్తులన్నీ అనుసరిస్తూ ఉండేవారు.

బ్రహ్మావర్తం అంటే ఆర్యులు మొట్టమొదట వచ్చి నివసించినచోటు. పంజాబు, వాయువ్య సరిహద్దు రాష్ట్రాల ప్రాంతాన్ని బ్రహ్మావర్తము అన్నారు. (The original settlement of the Aryans) అక్కడ నుండి క్రమంగా వీరు గంగా మైదానంలోకి విస్తరించారు. ఆ కాలంలో అనగా క్రీస్తుపూర్వం 800 ప్రాంతంలో ఇది జరిగింది. (1000-800 బి.సి.) ఆ కాలంలో ఆర్యులు విస్తరించడం వలన ఆర్థికంగా కొంత క్లిష్టత ఏర్పడింది. వ్యవసాయం పెరిగింది. అనేక వృత్తులు వచ్చాయి. ఈ ఆర్థిక విస్తరణకు అనార్యుల సహాయం వాళ్ళకు కావలసివచ్చింది. అప్పుడు "శూద్ర" వర్ణం ఏర్పడింది. శూద్రులు అంటే ఎవరు? వారూ ఆర్యులే!

శూద్రులు అంటే ఎవరు? శూద్రులు అంటే బానిసలు కాదు, అనార్యులు కాదు. శూద్ర అనే పదం ఒక జాతి పరమైన పదం. ఒక సిద్ధాంతం ప్రకారం– ఈ శూద్రులు అలలు అలలుగా ఆర్యులు వచ్చినప్పుడు మొట్టమొదట వచ్చిన ఆర్యులే – శూద్రులు అనే ఒక అభిప్రాయం ఉంది. They were also an Aryan tribe, పాండవులు, కౌరవులు గురించి కూడా ఇదే రకమైన అభిప్రాయం వుంది. కౌరవులు మొట్టమొదటవచ్చి స్థిరపడ్డారు. తరువాత పాండవులు వచ్చారు అని ఇదే రకంగా అనేక అలలు అలలుగా, అంచలు అంచలుగా ఆర్యులు మన దేశానికి వచ్చారు. మొట్టమొదట వచ్చిన ఆర్య జాతి వారి పేరు శూద్రులు, భోజ, కుమర, అంధ, వృష్ణి, భరత ఇవన్నీ ఆర్యులలో ఉన్న తెగల పేర్లు. అదే విధంగా శూద్ర అనేది కూడా ఒక ఆర్యతెగ యొక్క పేరు. వారు సరస్వతి నది ఒడ్డున ఉండేవారు. సరస్వతి నది ఇప్పుడు ఇంకిపోయింది. ఇప్పుడు లేదు. అది రాజస్థాన్ మధ్య భారత్ ప్రాంతాలలో ఉండేది. ఆ నది ఒడ్డున ఉండే శూద్రులను ఆర్యులు తమలో కలుపుకున్నారు. ఆ జాతి అంతా కూడా, ఆ తెగ అంతా కూడా ఆర్యజాతిలో కలిసి శూద్ర వర్ణంగా పురుష సూక్తంలో ప్రవేశించి రుగ్వేదంలోకి ఎక్కారు. అయితే శూద్రులు, బానిసలని మనకు వాఙ్మయంలో ఎక్కడా కనబడదు. ఎక్కడైనా ఒకచోట కనిపిస్తే కన్పిస్తుంది. శూద్రులలో పశుసంపద ఉన్న శూద్రులు ఉన్నారు. భూస్వాములైన శూద్రులున్నారు. తరువాత భిన్న భిన్న వృత్తులు అనుసరించిన శూద్రులున్నారు. కాబట్టి శూద్రులను కేవలం ఈ పై మూడు వర్ణాలకు సేవ చేస్తూ వుండమని బ్రహ్మ సృష్టించినటువంటి వర్ణం కాదు.

## ఆర్య, అనార్య సమ్మేళనం; బౌద్ధం కీలకపాత్ర

ఆరవ శతాబ్దంలో, క్రీస్తు పూర్వం బౌద్ధ మతం వచ్చింది. ఈ బౌద్ధమతం ఆర్య అనార్య జాతి సమ్మేళనానికి చాలా ఉపకరించింది. సంస్కృత భాషా సంస్కృతి విస్తరింపజేయడానికి ఉపకరించింది. బౌద్ధమతం ప్రబలంగా ఉన్నంతకాలం ప్రజలలో కులాల గురించిన బలమైన అభిప్రాయాలు ఉండేవి కావు. కుల చైతన్యం (caste consciousness) ఉండేది కాదు.

మన చరిత్రలో అంటే మన ఆంధ్రుల చరిత్రలో ఒక చిన్న ఉదాహరణ చెబుతాను. అమరావతి, నాగార్జున కొండ మొదలైనవి చాలా ప్రాచీన బౌద్ధ క్షేత్రాలు. అమరావతిలో 150 శాసనాలు దొరికాయి. నాగార్జున కొండలో 70–80 శాసనాలు దొరికాయి. ఈ శాసనాలు వేటిలో కూడా కులాల గురించిన ప్రసక్తిలేదు. ఆఖరికి బ్రాహ్మణ అనే పదం కూడా మనకు

కనిపించదు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర మొదలైన పదాలు ఏవీ ఈ శాసనాలలో కనపడవు. అయితే వాటికి చాలా మంది దాన ధర్మాలు చేశారు. వాటిలో వృత్తిపరమైన పేర్లున్నాయి. "గతిక" అంటే గంధకార అనేపేరు ఉంది. అలాగే శిల్పుల పేర్లున్నాయి. వడ్రంగుల పేర్లున్నాయి. వణిజ అనే పేరు వుంది. అంతేకాని వైశ్య అనే పదం లేదు. వణిజుడు అంటే బ్రాహ్మణుడు వణిజుడు కావచ్చు. శూద్రుడు వణిజుడు కావచ్చు. వణిజ అనే పదం ఉంది కాని వైశ్య అనేపదం లేదు. శూద్ర అనే పదం లేదు. బ్రాహ్మణ అనేపదం లేనేలేదు. ఇవి ఎంత వరకు? క్రీస్తు శకం మూడవ శతాబ్దం వరకు! ఈ క్రీస్తు శకం మూడవ శతాబ్దం వరకు ప్రజలలో కుల చైతన్యం (Caste consciousness) అనేది లేదు. అంతేకాక ఆ రోజుల్లో అస్పృశ్యత అనేది ఉన్నదా? లేదా? అన్నది అనుమానం. ఎందుచేతనంటే అమరావతి శాసనంలోనే ఒక దాంట్లో "విధికా" అనే చర్మకారుడు- నేను చర్మకారుణ్ని అని అతడే చెప్పుకున్నాడు-నేను పంచముణ్ణి అని చెప్పకోలేదు. పంచమ అనే శబ్దం యొక్క అర్థాలు చాలా చెబుతున్నారు. "పంచమజనః" అంటే నిషాదుడు అని ఒక గ్రంథం చెప్పింది. నిషాదుడు అంటే ఒక బ్రాహ్మణునికి శూద్రస్త్రీ యందు జన్మించినవాడు అని చెప్పారు. పంచముడు అంటే మనం మాల, మాదిగ వర్ణాలుకాదు "పంచమ జనః" అంటే నిషాదుడు. నిషాదుడంటే బ్రాహ్మణ యువకునికి -ఒక శూద్ర వనితకు జన్మించినవాడు.

ఈ "విధిక" అనే చర్మకారుని తండ్రి పేరు ఉపాధ్యాయ. నాగ ఉపాధ్యాయ. పేర్లు చూడండి సంస్కృతం పేర్లు. "విధిక" అనేది సంస్కృతం పేరు, సంస్కృతం మాట. నాగ అనేది సంస్కృతం మాట. చర్మకారులు కూడా సంస్కృతం పేర్లు పెట్టుకొన్నారు. వాళ్ళు ఆ బౌద్ధ స్తూపానికి వెళ్ళి దానం చేశారు. ఇది క్రీస్తుశకం మూడవ శతాబ్దంలో జరిగిన అటువంటి సంఘటన. వాడొక్కడే వెళ్ళలేదు. భార్య బిడ్డలందరితోను వెళ్ళాడు. కాబట్టి క్రీస్తు శకం 300 వరకు, మన దేశంలో, ఆంధ్రదేశంలో కూడా కుల చైతన్యము అనేది లేదు. ఎలా వైదిక సమాజంలో ఆర్య అనార్య జాతుల సమ్మేళనం జరిగిందో, క్రీస్తు తరువాత మూడవ శతాబ్దంలో కూడా ఈ జాతి సాంకర్యం జరిగింది.

## ఆంధ్రుల చరిత్రలో

ఆంధ్రుల చరిత్ర చూడండి. లేక దక్షిణ దేశ చరిత్ర చూడండి మన రాజులు చాలా మంది యజ్ఞయాగాది క్రతువులు చేసేవారు. ఉత్తర దేశంలో ఈ యజ్ఞయాగాది క్రతువులయందు ఇంత "పిచ్చి" లేదు. ఒక గుప్త వంశంలో సముద్రగుప్తుడు అతడి మనుమడు కుమార గుప్తుడు ఏదో ఒక అశ్వమేధం చేశామని చెప్పుకొన్నారు. దక్షిణదేశ చరిత్ర చూస్తే, మొదటి శాతవాహన చక్రవర్తి, శాతకర్ణి అనే అతడు, చాలా యజ్ఞాలు చేశాడు. రెండు అశ్వమేధాలు చేశాడు. ఏవో ఇంకా చాలా చాలా చేశాడు. అతని తరువాత దక్కనులో రాజ్యానికి వచ్చిన వాకాటక వంశంలో ప్రవరసేనుడు అనే అతడు చాలా యజ్ఞాలు చేశాడు. విష్ణుకుండినులలో మాధవ వర్మ అనే అతడు అతనికి బెజవాడకు కూడా సంబంధము ఉందని ఒక కథలో ఉంది. ఇక్కడ దుర్గాదేవి కనకదుర్గ కావడానికి మాధవవర్మే కారణమట. ఏదైనా కానివ్వండి అతడు "ఏకాదశాశ్వమేధ" పదకొండు అశ్వమేధాలు చేశాడట. 'క్రతు సహస్రయాజి' వేయి యజ్ఞాలు చేశాడు. ఎందుకు వీళ్ళకు యింత తాపత్రయం-యజ్ఞాలు చేయాలని? ఎందుకంటే వీళ్ళు స్వతహాగా వైదిక మతస్తులు కాదు. వాళ్ళే చెప్పుకున్నారు. "బ్రహ్మక్షత్ర తేజోభృతాం" "మాలో ఇటు బ్రాహ్మణుల తేజస్సు, ఇటు క్షత్రియుల తేజస్సు కూడా ఉంది. ఈ యజ్ఞయాగాది క్రతువులు చేయడం వలన, పరమేష్ఠిత్వాన్ని సాధించాను. బ్రహ్మత్వాన్ని సాధించాను" అని చెప్పుకున్నాడు. ఎందుకింత తాపత్రయం? శ్రీనాథుడు ఒక పద్యం చెబుతాడు చూడండి; "ఆవగింజంత బూడిదైనలదినేని వెండి గుమ్మడికాయంత వెర్రి మొగము" వీళ్ళు కొత్తగా బ్రాహ్మణ మతం పుచ్చుకొన్నారు. అందుచేత వీళ్ళకి బ్రాహ్మణ మతంలో తమకు శ్రద్ధ ఉన్నది అని ప్రజలకు చూపించడానికి ఇన్ని యజ్ఞయాగాలు చేశారు. ఉత్తర దేశంలో ఇంత కనుపించదు. ఇంత తాపత్రయం లేదు.

## అన్ని కులాల్లోను చేరిన ఆటవికజాతులు

క్రీస్తుశకం యెనిమిదవ శతాబ్దం వరకు ఇక్కడ ఉండే పుళిందులు, బోయలు మొదలైన వారంతా ఈ కులాల్లో చేరిపోయారు. కులం అంటే ఒక్క శూద్రకులంలోనే కాదు. బ్రాహ్మణ కులం దగ్గర నుండి శూద్ర కులం వరకు ఈ అన్ని కులాల్లోను ఈ ఆటవిక జాతులవారు (ఎబోరిజనల్స్) పుళిందులు (ఒక ధర్మశాస్త్రంలో పుళిందులను ఛండాలురలో కలిపి చెప్పారు) పుల్కస, పుళింద, ఛండాల- అంటే పుళిందులను ఛండాలురతో కలిపి చెప్పారు. ఛండాలురతో పుళిందులు సమానులని చెప్పారు. తెలంగాణాలో కరీంనగర్‌జిల్లా మాటేడు అనే గ్రామంలో ఒక శాసనం దొరికింది. అది పదకొండవ శతాబ్దంనాటి శాసనం. అక్కడ "పేపబోల" అని పుళిందుడు "నాది పుళింద కులము" అని చెప్పుకున్నాడు. పుళింద అనేది ఒక తెగ, ఒక Tribe. ఆ తెగ అల్లా ఒక కులమైంది. 'మాది పుళింద కులము' అని చెప్పుకొనడంతోనే వూరుకోలేదు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యశూద్ర కులాలను రక్షించడానికి మా కులాన్ని, బ్రహ్మదేవుడు పుట్టించాడు అన్నాడు. He was originally a Pulinda. అదే విధంగా బోయలు. బోయలు నెల్లూరుజిల్లాలో ఉండేవారు. ఇది క్రీస్తు శకం యెనిమిదవ శతాబ్దంనాటి సంగతి. అక్కడి శాసనాలున్నాయి. ఒంగోలు జిల్లాలో శాసనాలు దొరికాయి. బోయలు చాలామంది అన్ని కులాల్లోను చేరారు. ఋషి గోత్రాలు పెట్టుకొని బ్రాహ్మణులలో చేరారు. బోయలలో కూడా వృత్తి విభజన ఉండేది. ఆల బోయ - అంటే వాడు ఆవులను కాచుకొనేవాడు. మందు బోయ అంటే వాడు వైద్యుడు. కోవెల బోయ అంటే వాడు గుళ్ళో పురోహితుడు. ఈ గుళ్ళో పురోహితుడైనటువంటి వాడి

మొదటి కొడుకు బోయ అని పేరు పెట్టుకొన్నాడు. రెండవ వాడు రెడ్డి అని పేరు పెట్టుకున్నాడు. మూడవవాడు నాయుడు అని పెట్టుకున్నాడు. నాల్గవ వాడు నాయక అని పెట్టుకొన్నాడు. మీరు (You can verify) పరిశీలించవచ్చు. బెజవాడ మల్లేశ్వరస్వామి దేవాలయ శాసనాలని, ఇటీవల ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం వారు కూడా ప్రకటించారు. ఈ విధంగా బోయ జాతి వారు అన్ని వర్ణాలలోను చేరిపోయారు.

## కాకతీయులు ఎవరు? వారూ పుళిందులే!

ఇంకో చిన్న విషయం చెప్పి ముగిస్తాను. మన కాకతీయులు చాలా గొప్ప రాజులు అని చెప్పుకుంటాం. ఈ కాకతీయుల చరిత్ర చూసినట్లయితే వీరు మొట్ట మొదట పుళిందులు. వీరి మొట్టమొదటి రాజుల పేర్లు చూడ డి. గిరియ, వెన్న, గుండయ, ప్రోలయ్య. ఇవేవీ సంస్కృతం పేర్లు కావు. ఇవన్నీ బోయలలోను, పుళిందులలోను కనిపించే పేర్లు. రుద్రదేవుడు దగ్గర నుంచి వీళ్ళు మతం మార్చుకొని బ్రాహ్మణ మతం స్వీకరించారు. అక్కడ నుండి సంస్కృతం పేర్లు కనిపిస్తాయి. మనకు గణపతిదేవుడు జాయపసేనాని చెల్లెళ్లను పెళ్ళి చేసుకున్నాడు. జాయప సేనాని యెవరు? ఇతడు బోయ. దివిసీమను పరిపాలిస్తుండే బోయ రాజు.

## బ్రాహ్మణులు పవిత్రులు కాదు; శూద్రులు అపవిత్రులు కాదు

ఈ రకమైన దురభిప్రాయాలు - కులాలను గురించి లేక వర్ణాల గురించి - మనలో చాలా వ్యాప్తి చెంది ఉన్నాయి. ఈ దురభిప్రాయాలు తొలిగిపోవాలి. బ్రాహ్మణులు వాళ్ళు ఏమీ పవిత్రులు కాదు, శూద్రులు అంతకంటే అపవిత్రులుకారు. వాళ్ళలోను బోయలున్నారు. వీళ్ళలోను బోయలున్నారు. ఈ ఆటవిక జాతివారు అందరూ ఈ అన్ని కులాల్లోను చేరిపోయారు. అందుచేత ఈ కుల వ్యవస్థ యొక్క పునాదులకు వెళ్ళి చూస్తే, ఈ కులాల పట్టింపులు అనేవి అర్థం కానటువంటి విషయం. అని తెలుసుకోడానికి ప్రయత్నం చేస్తే కులాలు ఎప్పటికైనా మాసిపోతాయి. అయితే ఇందులో కులాలు ఎప్పటికైనా మాసిపోతాయా? అని ఒక పరిశోధన వ్యాసం ఉన్నట్లు కనిపిస్తుంది. ఇది ఏ రకంగా పోవాలి? ఈ తేడాలు ఎలా పోవాలి? విద్య ద్వారా పోవాలి. మనం ప్రజలను విజ్ఞానవంతులను చేయాలి. కాని విద్య ఇటువంటి విజ్ఞానాన్ని ఇప్పుడు యిస్తున్నదా?

## కుల, మతరీత్యా విద్యా సంస్థలు

నన్ను క్షమించాలి. మతానికి ఒక కాలేజీ; కులానికి ఒక కాలేజీ వుంటున్నాయి. మా గుంటూరు పట్టణం తీసుకోండి. నాల్గు మతాలకు నాలుగు కాలేజీలున్నాయి. హిందూ కాలేజీ, క్రిష్టియన్ కాలేజీ, జైన్ కాలేజి, ముస్లిం కాలేజీ వున్నాయి. అదే విధంగా కులానికొక కాలేజీ చొప్పున వున్నాయి. హిందూ కాలేజి - బ్రాహ్మణ కాలేజి అని ఒక అభిప్రాయం - కాదు నిజం కావచ్చు. అలాగే శెట్టి కాలేజి; పోలి శెట్టి సోమసుందరం-

తెల్లాకుల జాలయ్య వైశ్యుల కాలేజీ, చౌదరి కాలేజీ - బొగర్లమూడి కుప్పుస్వామి చౌదరి కాలేజి, నాయుడు కాలేజి, రెడ్డి కాలేజి ఇలా వున్నాయి. మనం విద్యావిధానం ద్వారా కుల వ్యవస్థను నిర్మూలించగలమనే ఆశ వున్నదా? విద్యలో ప్రవేశించిన ఈ కులతత్వం వల్ల అటువంటి ఆశ - భవిష్యత్తులో నెరవేరుతుంది అనే ఆశలేదు. రాజకీయ పార్టీలయొక్క ప్రధానమైన ఒక లక్ష్యం - ప్రజలను విజ్ఞానవంతును చేయడం; రాజనీతిశాస్త్రంలో చదువుకుంటారు. ఒక రాజకీయ పార్టీయొక్క విధులు ఏమిటి? ప్రజలను విజ్ఞానవంతులను చేయడం, మరి వీరందరూ పెద్దవారే. తెలిసినవారే. కాని రాజకీయ పార్టీలు కూడా కులతత్వాలమీదనే నడుస్తున్నాయి. అటువంటప్పుడు ఈ కులతత్వాన్ని ఇంకా దేశంలో నిర్మూలించేదెవరు? ఇటు విద్యావిధానంలో కులతత్వం ప్రవేశించి దానిని నీరసింపజేసింది. ఇటు రాజకీయ పక్షాలలో కులతత్వం ప్రవేశించి ప్రజలను అజ్ఞానంలో వుంచుతున్నాయి. ప్రజలను ఎంత అజ్ఞానంలో వుంచితే రాజకీయ పక్షాలకు అంతమేలు. వాళ్ళు రాజకీయ అధికారంలోకి రావడానికి అంత అవకాశం వుంది అన్న విధంగా వున్నాయి.

రష్యా దేశంలో కేథరిన్ అనే మహారాణి ఉండేది. ఆమెను కేథరిన్ ది గ్రేట్ అంటారు. ఆమె తన రాజ్యంలో కాలేజీలు, హైస్కూళ్ళకు భవనాలు కట్టించింది. ఒక మంత్రిగారు వెళ్ళి "మహారాణి! మీరు బిల్డింగులైతే కట్టిస్తున్నారు కాని అందులో ఉపాధ్యాయులు లేరు, విద్యార్థులు లేరు. ఎందుకు ఈ బిల్డింగ్స్?" అని అన్నాడట. ఆమె అన్నదట "ఈ ప్రశ్న వేయడానికి నువ్వు ఒక మూర్ఖుడవు అయివుండాలి. ప్రజలు నిజంగా విద్యావంతులైనప్పుడు నీ స్థానం వుండదు. నా స్థానమూ వుండదు. కాబట్టి మన దేశంలో వున్న రాజకీయ పార్టీలు కూడా కమ్యూనిస్టుపార్టీవారు క్షమించాలి - ఇదే విధమైన విధానాన్ని అనుసరిస్తున్నాయా? అయినప్పుడు, ఇక కులాలు పోడానికి ఆస్కారం ఎక్కడుంది? ఇది పెద్దలు ఆలోచిస్తూనే వుంటారు. నాలాంటివాళ్ళు రాజేశ్వరరావుగారి వంటివారు ఆలోచిస్తూనే వుంటారు. యువకులు ఆలోచించాలి. భవిష్యత్తు యువకులది. అందుచేత మీ అందరూ దీనిని జాగ్రత్తగా ఆలోచించి పరిష్కారమార్గం ఏమిటో భవిష్యత్తుకు వదలాలి. నమస్తే!

# కులం గురించి అవగాహన – ఒక ముసాయిదా

డాక్టర్ ఆరుద్ర

మానవుణ్ణి ఆలోచించగల జంతువు అని కొందరు నిర్వచిస్తారు. జంతువులు కొన్ని కలిసికట్టుగా మందలుగా జీవిస్తాయి. మానవులు కూడా మూకలుగా, గుంపులుగా, తండాలుగా సమిష్టి జీవనం గడుపుతారు. జంతువులకూ, మానవులకూ తేడా ఒక్క ఆలోచించే శక్తిలో మాత్రమేకాదు. జంతువులు తమ ఆహారాన్ని తాము అన్వేషించుకోవాలి! వేటాడాలి. మానవుడు మాత్రం తన జీవనోపాధిని తాను ఉత్పత్తి చేసుకొనడం ప్రారంభించాక జంతువుకన్నా విభిన్నుడయ్యాడు. తమ జీవితాలను తాము ఉత్పత్తి చేసుకొనగలరు. కనుకనే మానవులకు చరిత్ర అంటూ ఒకటి వుందని మార్క్స్ చెప్పాడు.

## ఉత్పత్తి సంబంధాలు: ఉత్పత్తి సాధనాలు

చరిత్ర అన్ని దశలలోనూ ప్రకృతికీ మానవులకూ మధ్యనున్న సంబంధాలతో ఉత్పత్తి ముడిపడి వుంది. తమ అవసరాలకు కావలసినట్టు ముడిసరుకులను వినియోగ వస్తువులుగా మార్చుకొనడానికి మానవులు ఉత్పత్తి పరికరాలను తయారుచేసుకొని వాటితో శ్రమిస్తారు. సామూహికంగా జీవిస్తారు. ఒక సామూహిక జీవితం ఆర్థిక ప్రాతిపదిక, దాని పరికరాలమీదా, పనిముట్లమీదనే ఆధారపడి వుండదు. ఆ పనిముట్లను వాడే మానవుల మీదా, వారు ఏ సాంఘిక ప్రయోగాల కోసం, ఏ ఉమ్మడి సౌకర్యాలకోసం సమిష్టిగా వాటిని వాడుకుంటున్నారన్న విషయంమీద ఆధారపడి వుంటుంది.

ఆదిమ కమ్యూనిస్టు సంఘ జీవితంలో రక్తసంబంధాలు, ఆహార విహారాలలో ఏకీభావం ముఖ్యవిషయాలు. ఒకే భాష, ఒకే రకమైన ఆచార వ్యవహారాలతోబాటు జీవితాన్ని సుఖమయం చేసుకొనడానికి ఒకే పద్ధతిలో కొన్ని ప్రాథమిక కళలను తరతరాలుగా ఏ మార్పూలేకుండా ఉపయోగించుకొనడం, కొన్ని కుటుంబాల సామూహిక విధానం కుల ధర్మంగా పరిణామం చెందడానికి కారణమైంది.

కొన్ని కులాలు ఆహార సేకరణలో సంచార జీవితానికి స్వస్తి చెప్పి ఆహారోత్పత్తికి పూనుకొని సేద్యం ప్రారంభించాయి. ఊళ్ళు కట్టుకొని ఒకచోట నిలకడగా వుంటేగాని సేద్యానికి వీలుండదు. కట్టుకున్న ఊరు ఎంత చిన్నదైనా ఎంత ప్రాథమిక దశలోవున్నా అది స్వయం సమృద్ధిగా సాగాలంటే ఎన్నో విద్యలు పట్టుబడాలి.

## 64 కళలు : వృత్తి విభజనలు

వివిధ గ్రంథాలలో ప్రాచీనులు అరవైనాలుగు కళలుగా పేర్కొన్న వాటిలో ఏయే జీవనాధార విద్యలున్నాయో చూడండి :

1. పశువుల శరీరమునుండి చర్మములు తీసేనేర్పు.
2. చర్మాన్ని మృదువుగా చేసే నేర్పు.
3. మన్నూ, కర్రా, రాయి, లోహాలు మొదలైన వాటితో వివిధ వస్తువులు చేసుకొనే విద్య.
4. పాలు పితుకుట మొదలుకొని నెయ్యికాచడందాకా గల వివిధ ప్రక్రియల జ్ఞానం.
5. నువ్వులు మొదలగు వాటినుండి నూనె తీయడం.
6. వస్త్రాలు నేయడం.
7. దున్నడం, విత్తడం మొదలైన సేద్యం పనులు.
8. లోహాలుండే ప్రదేశాలు గుర్తించడం.
9. ఇళ్ళుకట్టే విద్య.
10. గడ్డి, వెదుళ్ళతో, వేముతో ఆసనాలు, మంచాలు, కంచాలు అల్లడం.
11. లోహాలతో శస్త్రాస్త్రాలు చేసేనేర్పు.
12. బొమ్మలు చేసే విద్య.
13. పశు చికిత్స.
14. చెరువు, బావి, మేడ మొదలైనవి నిర్మించడం.

ఈ విద్యలన్నీ గ్రామ సుఖజీవనానికి చాలా అవసరమైనవి. వ్యవసాయం చేసేవాళ్ళు, పశుపాలన చేసే వాళ్ళూ, గ్రామానికి కావలసిన ఆహారాన్ని సమకూర్చుతారు. ఈ అన్నదాతలకు కావలసిన పనిముట్లనూ, పరికరాలనూ, పాత్రసామగ్రినీ, ఇళ్ళనూ, వాకిళ్ళనూ సమకూర్చే గ్రామశిల్పులను 'పంచాణం' వారని తెలుగువాట పిలుస్తారు. వీళ్ళనే ఇంగ్లీషులో ARTISANS అంటారు. అకారాదిగా చెప్పాలంటే కంచరి (కంచుపనులు చేసేవాడు), కమ్మరి (ఇనుప పనులు చేసేవాడు), కంసాలి (బంగారపు పనిచేసేవాడు), ముచ్చె (తోలుపనులు చేసేవాడు), వడ్రంగి (కర్రపనులు చేసేవాడు) ఈ అయిదుగురినీ పంచాణం, పంచహాణం వారంటారు. కొన్ని గ్రంథాలలో ముచ్చెకు బదులు కాసె (రాత్రి పనిచేసేవాడు) కనబడతాడు. ఆ గ్రామశిల్పులవల్ల ఊరివాళ్ళ అవసరాలన్నీ తీరుతూ వుండేవి.

## వృత్తి విభజన – కుల విభజనకు ప్రాతిపదిక

ఒక్కొక్క కళలో ప్రావీణ్యం సంపాదించిన వాళ్ళు ఒక కులంగా స్థిరపడడంతో ప్రత్యేక జాతిగా వ్యవహరించడం జరుగుతుంది. జాతిలో అర్థబలానికి ప్రాముఖ్యం రాకపూర్వం అంగబలమే ప్రాధాన్యంగా ఉంటుంది. కులంలోని సంఘీభావమే కుల సభ్యులందరికీ రక్షణ, భద్రత కలిగించే కవచం. ప్రతికులానికీ ఒక సంస్కృతి, కొన్ని విలువలూ ఉంటాయి. వీటిని నాలుగు రకాలుగా వింగడించవచ్చు. అవి ఆర్థిక, రక్తసంబంధ, లైంగిక, కులవృత్తి బోధక విధానాలు. ఆహారోత్పత్తి, వస్త్రోత్పత్తి, సంతానోత్పత్తి అన్నవి జీవితానికి ముఖ్యం. మొదటి రెండు ఉత్పత్తులలో వివిధ కులాల పరస్పర సహకారాలు ప్రారంభమై ప్రవర్ధమానమైనా సంతానోత్పత్తి విషయంలో ఏ కులానికి ఆ కులం తన కట్టుబాట్లను ఇప్పటికీ సడలించుకోలేదు.

మనుష్యులంతా భూమిమీద ఒకలాగే పుడతారు. జన్మ ఒకటే అయినా జనులు ఏ జాతిలో పుడితే ఆ జాతివారైపోతారు. జాతికోరకం నీతి వుంటుంది. కూటి విషయంలో కులాచారాలు పాటించాలి. అందరికీ ఆకలొకటే అయినా, ఆహార పదార్థాలలో విభేదాలుంటాయి. ఆచారాన్ని అతిక్రమించిన వాడికి కులం పోతుంది. కులంపోతే కూడుపుట్టదు.

ఒక్క ఆహార విషయంలోనే కాక ఆహార్యధారణలో కూడా కులాచారాలు ఉంటాయి. కట్టూ బొట్టూ జాతికి తగ్గట్టు పాటించాలి. యుగ ధర్మాలనుబట్టి ఇవి నిర్ణీతమవుతాయి. మహాభారత కాలంలో దాసులు పై వలువలు ధరించకూడదు. అందుకే జూదంలో దాసిగా దఖలుపడ్డ ద్రౌపది పై వలువలను దుర్యోధనుడు ఊడతీయమన్నాడు. పాండవులు అయిదుగురు తమ ఉత్తరీయాలను కింద పెట్టేశారు.

## ద్రౌపతీ వస్త్రాపహరణ వెనుక కథ

యజమానుల ముందు దాసులకు పైయిబట్టలు ధరించే హక్కు ద్వాపరయుగంలోనే కాదు, ఈ ఇరవయ్యో శతాబ్దంలో ఇటీవలదాకా లేదు. పైనున్న తుండుగుడ్డను చంకలో పెట్టుకొని చేతులుకట్టుకొని దొరలముందు దాసులు నిలబడ్డం ఇప్పటికీ మనం చూస్తున్నాం. మంచి జూదంలోనో, మాయాజూదంలోనో గెలుచుకున్న దుర్యోధనుడు తన హక్కును అమలుజరపడమే వస్త్రాపహరణ ఘట్టంలో విశదమవుతుంది. తాను అధర్మ విజితనని భావించి పాంచాలి ఎదురుతిరిగింది. ఈ ప్రతిఘటన తరువాత యుగం వాళ్ళకి నచ్చింది గనుక ద్రౌపతీ వస్త్రాపహరణాన్ని మానసంరక్షణగా మార్చుకొనడం జరిగింది.

## యుగధర్మాలు మారినా కులధర్మం మారలేదు

యుగధర్మాలు మారుతున్నా కులధర్మాలు ఒక పట్టాన మారవు. కుటుంబాచారాలు మార్చుకొనడం కష్టం. మళ్ళా మహాభారతంలోని ఉదాహరణే చూద్దాం. కుంతి పుట్టి పెరిగిన సంఘం వేరు. ఒక్క వనితకు పెక్కు భర్తలను అనుమతించే వ్యవస్థలోంచి ఆమె వచ్చింది. తన కోడలు కూడా తనను అనుసరించాలని ఆదేశించింది. ఈ ప్రాథమిక వాస్తవాన్ని జనామోదకరంగా చేయడానికి ఇతిహాసకర్తలు ఎన్నో సబబులూ, కొన్ని పూర్వ కథలూ సృష్టించవలసి వచ్చింది.

మన జానపదుల 'జాంబపురాణం', 'గౌతుపురాణం', 'సూతపురాణం' మొదలైన పురాణాలలో తెలుగు కులాల పుట్టుకల గురించి కొన్ని ప్రసక్తులు ఉన్నాయి. జాంబ పురాణంలో పంచమ కులగాథ ఉంది. మన సమాజంలో చతుర్థ పంచమ కులాల వాళ్ళే ఏనాడైనా సమాజంలో అధిక సంఖ్యాకులు. వీరే నిజమైన లోకులు. వీళ్ళు సంఖ్యలో ఎంత ఎక్కువగా ఉన్నారో సామాజికంగా అంత హీనంగా ఉన్నారు. చండాలుడన్నది ఒక తిట్టుకింద స్థిరపడింది. అయితే ఆదిలో చార్వాక మతానికీ, చండాలురకూ సంబంధాలు ఉండేవి. చార్వాక లోకాయతమతాలలోనికి శైవతాంత్రిక చర్యలు ప్రవేశించాయి. ఒక్క శైవంలోనే కాదు శాక్తం ప్రబలంగా జైనంలో, బౌద్ధంలో, వైష్ణవంలో కూడా తంత్రరూపంలో ప్రవేశించింది.

## పంచమకులం ఎలా ఏర్పడింది?

ఇక్కడ ఒకటి మనం గమనించాలి. చార్వాకానికీ చండాల జాతికీగల సంబంధం. అంత్యజులు వైదిక దాస్యానికి అంగీకరించకపోవడమే వాళ్ళు వర్ణవ్యవస్థకు వెలికావటానికి ముఖ్య కారణం. ఆది నుంచీ ఈ దేశంలోని అనార్య జాతులకు ఒక ప్రత్యేక దర్శనముంది. ఆచార వ్యవహారాలున్నాయి. ఆహార పద్ధతులున్నాయి. లోకాయత మతం నిషాదులలోనూ, చండాల జాతులలోనూ ప్రాచుర్యం పొందడానికి ఇదే కారణం. ఆదినుంచీ దశవిధ బ్రాహ్మణులలో చండాల బ్రాహ్మణులు కూడా ఉన్నారు. పంచగౌడులు, పంచ – ద్రావిడులు అనే విభజన కాక స్మృతికర్తల లెక్కప్రకారం ఇంకో పదికరాలవాళ్ళు ఉన్నారు.

## దశవిధ బ్రాహ్మణులు

"దేవ మునిర్ద్విజో రాజా వైశ్య శూద్ర బిడాలకః
పశు మ్లేచ్ఛశ్చండాలో దశవిప్రా ప్రకీర్తితా"

ఈ అంచనా ప్రకారం దశవిధ బ్రాహ్మణుల విభాగాలు ఇవి ః

1. దేవ బ్రాహ్మణులు
2. ముని బ్రాహ్మణులు
3. ద్విజ బ్రాహ్మణులు
4. క్షత్రియ బ్రాహ్మణులు
5. వైశ్య బ్రాహ్మణులు
6. శూద్ర బ్రాహ్మణులు

7. బిడాలక బ్రాహ్మణులు
8. పశు బ్రాహ్మణులు
9. మ్లేచ్ఛ బ్రాహ్మణులు
10. చండాల బ్రాహ్మణులు

ఒక్కొక్క జాతివాళ్ళు వాళ్ళ వాళ్ళ కులాచారాలను బట్టి వివిధ జీవిత సంస్కారాలను చేసుకోవాలి. అవి చేయించే కుల పెద్దలనే ఆ జాతి బ్రాహ్మణులుగా అంగీకరించక తప్పలేదు. ఈ దశవిధ బ్రాహ్మణులలో బిడాలక బ్రాహ్మణులు ఉండడం గమనించదగ్గ విషయం. హైతుకులను మనువు బిడాలవృత్తి గల వాళ్ళని పేర్కొన్నాడు. బిడాల బ్రాహ్మణులనే నిషాద బ్రాహ్మణులని గూడా అంటారు. చార్వాకం వీరివల్లనే వ్యాపించింది.

తెలుగు సాహిత్యంలో కొన్ని కులాల వివరాలు తెలియవస్తున్నాయి. వ్యవసాయమే వృత్తిగాగల నాల్గవ జాతి వారినందరినీ కాపులంటారు. తిక్కనగారే మొదటిసారి సేద్యగాళ్ళనే అర్థంలో కాపులు అనేపదాన్ని వాడారు.

అపు బేహారము గృషియు
న్నవరణలును బసుల సొంపునన యట్లగుటన్
భువి బసులు గలుగు కాపుల
నవనీశుడు గన్న ప్రజల యట్ల దయ దగున్

(శాంతి పర్వం - 2 - 368)

వార్త అనే పదానికి ఎన్ని అర్థాలున్నాయో అన్నీ ఈ పద్యంలో తిక్కనగారు పేర్కొన్నారు. అవన్నీ కాపుల వృత్తి ధర్మాలని వివరపర్చారు. తిక్కనగారే ఇంకో పద్యంలో కాపుల సంగతి కథనం చేశారు.

ప్రారంభములకెల్ల బౌరుషమ్మును దైవ
మును సాధనమ్ము వినుము వాని
లోన నొక్కటి చేతగానేర దనపు త
త్వల సిద్దులెల్లన్న దరచు వాన
కారు పొలంబున గల్గెనేనియు గొల్చి
గావింప నేర్చునే యవిధమున
పల నేర్పడగ దున్న బొలములో నైన వ
ర్షంబు లేకున్న ధాన్యంబులగునె
కాపులావు వెరపుగల్గ కర్మనము సే
యంగ వృష్టి దగినయట్లు గలుగ
ఫలము గల్గునట్లు పౌరుషంబునకు దై
వంబు తోడుపాటు వలయు నెందు.

(సౌప్తికపర్వం-1-31)

## రెడ్డి శబ్దం ఎలా వచ్చింది?

కాకతీయుల కాలం నుంచీ పాడిపంటల ఉత్పత్తి కాపుల కర్తవ్యాలని ఈ పద్యాలవల్ల తెలుస్తుంది. కాపు, రెడ్డి అనే మాటలు పర్యాయపదాలని సామాజిక మానవ శాస్త్రవేత్తలు చెప్తారు. క్రీస్తుశకం ఏడెనిమిది శతాబ్దాల నాటినుండి తెలుగు గడ్డమీద 'రట్టగుడి' పేరిట చిన్న గ్రామాధికారులు ఉండేవారు. ఈ రట్టగుడి శబ్దంనుండే రట్టోడి, రట్ల, రడ్డి, రెడ్డి అనే రూపాలు పుట్టాయి. చిన్న చిన్న భూ భాగాలకు అధికారులై వాటిని గుత్తగా అనుభవిస్తూ వున్న వాళ్ళని రట్ట - గుట్టలు, రట్టగుడ్లు అని పిలిచేవారు. వీరి ముఖ్య వృత్తి వ్యవసాయం. రట్లడులకు నిధి, నిక్షేపము, జలము, పాషాణములు, అక్షిణి, ఆగామి, సిద్ధము, సాధ్యము అనే అష్టభోగ స్వామ్యములు తమ భూములపై ఉండేవి. ఆ కాలంలో రట్టడములు ఒక రకమైన ఆర్థిక వ్యవస్థలు. ఆదిలో వృత్తి వాచకమైన 'రడ్డి' పదం తర్వాత జాతి వాచకమైంది. (చూ॥ 'రెడ్డి సంచిక' లో కుందూరి ఈశ్వరదత్తుగారి 'రెడ్డి పదోత్పత్తి వికాసం' అనే వ్యాసం) వేమనగారి జననకాలందాకా 'రట్టడి' అధికార సూచకమైన బిరుదు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతులకు వుండేది. ఉత్తరోత్తరా చతుర్థ కులజులకే పరిమితమైంది.

## ఒకే కుదిటిలోంచి నాల్గుకులాలు

వ్యవసాయమే వృత్తిగాగల ఇతర కులాలవారు తెలుగునాట ఉన్నారు. ఆంట, కమ్మ, తెలగ, వెలమ అనే నాలుగు శాఖలు ప్రధానమైనవి. ఈ నాలుగూ ఒక్క కుదుటిలోంచే వచ్చాయని కట్టుకథలో, గట్టి కథలో గాని జాతి పుట్టుకథలు ప్రచారంలోనికి వచ్చాయి. కాకతి ప్రతాపరుద్రుని భార్య చెవికమ్మ ఒకసారి కొల్లబోయిందట. దానిని గాలించి పట్టుకొని తీసుకురావడానికి నలుగురు కొడుకులో, నలుగురు శూరులో బయలుదేరారు. ఆ నలుగురే ఈ నాలుగు కులాల మూలపుషులయ్యారట. ప్రసిద్ధ కావ్యకర్తలు ఈ కథల్లో ముఖ్యమైన సారాంశాన్ని తమ కృతిభర్తల వంశవర్ణనలోనికి ఎక్కించారు.

శ్రీనాథుడు తన భీమేశ్వర పురాణంలో ఇలా చెప్పాడు. విష్ణుమూల పాద పంకజం నుండి ఒక పావన వర్ణం ఉదయించింది. ఆ పుణ్యవంశం "నిఖిల ప్రపంచంబునకు నాధారంబై ప్రవర్తిల్లె. అందు బద్మనాయకులన, వెలమలన, గమ్మలన, నరిసర్లన, వంటర్లన, బహు ప్రకార శాఖోపశాఖ భిన్నంబులైన మార్గంబుల... గోత్రంబు లెన్నియేనియు జగత్పవిత్రంబులై .... పంట దేపటి మహనీయంబు భాకనాటి దేశం భీబున భద్ర పీఠంబు నధివసించి...." (శ్రీనాథుడు భీమేశ్వర పురాణం, 1 - 32) ఉండేది. ఈ పంట దేసటి వంశాలనే రెడ్లని పిలుస్తారు.

శ్రీనాథునిలాంటి కవులు ఏమని వర్ణించినా వేమనగారు జనశ్రుతిలోవున్న చారిత్రక విషయాన్ని ఒక పద్యంలో చెప్పారు.

పాకనాటి రెడ్డి పరగ మూటారెడ్డి
యెలగు తోట పెద్ద యెర్రరెడ్డి
మొరకులందరు భువి హరు వొప్ప మిన్నంటి
ప్రతిభకెక్కి రొట్ట పరగ వేమ

(వేమన సూక్త రత్నాకరం - 2483)

శ్రీనాథుని వర్ణనవల్లా, వేమనగారి పద్యంవల్లా పాకనాటి రెడ్లు ప్రభువులై పాలించారన్న విషయం రూఢయింది.

## సాంఘికంగా పైకి వెళ్ళిన చతుర్థ కులజులు

చతుర్థ కులజులు సాంఘికంగా పైకి వెళ్ళడమే మన దేశ చరిత్రలో ఎక్కువగా కనబడుతుంది. వర్ణాశ్రమ ధర్మాలను సిద్ధాంత రీత్యా తెలుగు వాళ్ళు దిగుమతి చేసుకొన్నా శిఖరాగ్రంలో బాపనయ్యలు, అట్టడుగున పంచములూ తప్ప మధ్యనున్న కులాలలో సాంఘికంగా ఉన్నత చలనం కొన్ని సందర్భాలలో కనబడుతుంది. వర్ణవ్యవస్థను మార్చలేనపుడు దానిలోనే ఉంటూ అంతస్తును పెంచుకొందుకి అందరూ ప్రయత్నిస్తారు. ఇది అనాదిగా హిందూ సంఘంలో జరుగుతున్నదే. రాచవారితోపాటు వెలమవారు, కమ్మవారు, రెడ్ల శాఖలు మండలాధిపతులు కావడం, మహారాజులు కావడం తెలుగు చరిత్రలో అందరికీ విశదమైన విషయమే. ప్రాచీన కాలంలో ఉత్తర భారతదేశంలోని 'సోషల్ మొబిలిటీ గురించి రొమిలా థాపర్ చేసిన పరిశోధన వంటిది మధ్య యుగాల తెలుగుదేశంలోని సాంఘిక చలనం గురించి ఎవరైనా చెప్తే బాగుండును. (INDIAN SOCIETY - Historical Proceedings (In memory of D. D. Kosmabi) Indian council of Historical Research. P P 95 - 123)

గ్రామాధికారులుగా, సైనికులుగా, వ్యవసాయదారులుగా జీవనాన్ని గడిపే చతుర్థ కులజుల గురించి సాహిత్యంలో వివరాలు దొరుకుతున్నా సేద్యాన్ని జీవనాధారంగా చేపట్టిన వారి గురించి మరింత ఎక్కువగా లభిస్తాయి. వీళ్ళ ఆచార వ్యవహారాలు, అలవాట్లు, కుల కట్టుబాట్లు మొదలైనవాటిని క్రోడీకరించి విశ్లేషణ చేస్తే సంపూర్ణ సామాజిక జీవనం అవగాహన అవుతుంది. మన సాహిత్యంలో స్త్రీ వర్ణనలు ఎక్కువగా ఉంటాయి. పైటలేని స్త్రీలను, పైటలు వేసుకున్నా వారు కుడిచేతి పైటవారని చెప్పే పద్యాలు లభిస్తున్నాయి. దీనివల్ల సాంఘిక చరిత్రలో ఒక ముఖ్యమైన విషయం విస్పష్టమవుతుంది.

## కుడి, ఎడమ పైటలు

పూర్వం కుడి ఎడమ పైటల పట్టింపులు చాలా ఉండేవి. చాలా ఏళ్ళ కిందట కుడి ఎడమ పైటల వారికి పోట్లాట జరిగి మద్రాసు హైకోర్టులో తీర్పు చేయించుకున్న సంగతి సురవరం ప్రతాపరెడ్డిగారు తమ ఆంధ్రుల సాంఘిక చరిత్ర (ద్వితీయ ముద్రణ, పుట 334)లో పేర్కొన్నారు.

ఈ కుడి ఎడమ పైటల పట్టింపుల గురించి బోధపరుచుకోవాలంటే ఒకనాటి మన గ్రామీణ వ్యవస్థను తెలుసుకోవాలి. ఏ గ్రామంలోనైనా పూర్వం పన్నెద రాయగాళ్ళు ఉండేవాళ్ళు. గ్రామంలో రైతు దగ్గర మొత్తం సంవత్సరానికి నిర్ణయించుకొన్న ప్రకారం కళ్ళంలోని ధాన్యం తీసుకొనే వివిధ వృత్తుల వాళ్ళను ఆయగాళ్ళంటారు. అకారాదిగా ఆయా వృత్తుల, కులాల వాళ్ళ జాబితాను చూడండి.

| | | | |
|---|---|---|---|
| 1. | కంసాలి | 7. | నేరడి |
| 2. | కమ్మరి | 8. | పురోహితుడు |
| 3. | కరణం | 9. | మంగలి |
| 4. | కుమ్మరి | 10. | మాదిగ |
| 5. | చాకలి | 11. | రెడ్డి |
| 6. | తలారి | 12. | వడ్ల |

ఈ పన్నెండుమంది గ్రామాధికారులు, గ్రామ సేవకుల కోసమే కాక రైతు ఇనాం ఆయగాళ్ళకోసం కూడా పంటను పండిస్తారు. దేవమాన్యం, రెడ్డిమాన్యం విడిగా ఉంటాయి. మఠపతి జంగాలు, తమ్మిళవారూ, మేటిగొల్లలు, బోయవాళ్ళు, నేసేగమళ్ళు మొదలైన వారు గ్రామం మీద బతకవలసిన వారే.

## ఎడమ చేతి కులాలు – కుడిచేతి కులాలు

గ్రామాధికారులలో రెడ్డి, కరణం అధికులు. శాతవాహనుల కాలం నుంచి మన గడ్డపై గ్రామణులు పెద్దలుగా ఉండేవారు. వస్తూత్పత్తి చేసేవాళ్ళూ, వ్యాపారాలు చేసేవాళ్ళు, వాటికి సంబంధించిన వ్యాపకాలవాళ్ళు స్వలాభాలను సంరక్షించు కోవాలంటే కలిసికట్టుగా ఉండాలి. ఆర్థిక కారణాలవల్ల గ్రామాలలోని వివిధ వృత్తులవాళ్ళు ఎడమ చేతి కులాలుగా, కుడిచేతి కులాలుగా చీలారు. నేను ఇప్పటిదాకా సేకరించిన ఆకారాలను బట్టి ఆ కులాల విభజన ఇలా ఉంటుంది. (C.S. Srinivasachari - The origin of the Right and Left Hand castes Divisions, Journal of Andhra Historical Research Society, Vol. IV P P 77 - 85)

## ఎడమ చేతి కులాలు

1. కంచరి
2. కంసాలి
3. కమ్మరి
4. కాసె
5. దేవాంగులు
6. బేడర్లు
7. బేరిసెట్లు
8. వడ్రంగులు
9. మాదిగలు

వీళ్ళుకాక ఇంకో 89 కులాలవాళ్ళు ఈ వర్గంలో ఉన్నారు. మొత్తం 98 జాతులవారు ఈ ఎడమచేతి వర్గంగా ఉండడానికి ఒప్పందం చేసుకొన్నారు.

### కుడి చేతి కులాలు

1. అద్దకం...
2. ఓడ నా...కులు
3. ఓడ వ్య...ంగులు
4. కుమ్మరులు
5. కోమట్లు
6. గొల్లలు
7. చాకళ్ళు
8. జాంద్రవాళ్ళు
9. జెనులు
10. పట్టుసాలెలు
11. పద్మసాలెలు
12. పల్లకీ బోయీలు
13. మంగళ్ళు
14. మాలలు
15. యానాదులు
16. రెడ్లు

ఈ వృత్తుల వాళ్ళేకాక భోగంవారు కూడా కుడిచేతి భోగంవారూ, ఎడమచేతి భోగంవారు అని రెండు తెగలుగా ఏర్పడ్డారు. బ్రాహ్మణులూ, సాతానులూ మొదలైనవారు తటస్థులు. అయితే అధికార వర్గాన్నే బలపరుస్తారని భావించటం తప్పులేదు.

శాస్త్రీయ సామ్యవాదం నిరూపించిన వర్గకలహం అన్న సత్యం వర్గాలున్న ప్రతి సమాజంలోనూ ఏదో ఒక రూపంలో ఉంటుంది. కులాలలో ఉన్నతంగా సాంఘిక చలనం సాధ్యమై వర్గాలు ఏర్పడతాయి. మానవులు పరిస్థితులవల్ల, బాల్యంనుండి పెరిగిన కులవాతావరణంవల్ల కొన్ని స్వభావాలు సంతరించుకొంటారు. పరివర్తన చెందిన మానవులు నూతన పరిస్థితులవల్లా, వినూత్నమైన పెంపకంవల్ల ఏర్పడతారన్నది సిద్ధాంతీకరించేటప్పుడు ఒక విషయం మరిచిపోకూడదు. మానవులే పరిస్థితులను మారుస్తారు. దానికి ఆర్థిక విధానాలలో అంకురించే నూతన పరిణామాలే కారణం.

## అధికారం చేజిక్కించుకొనడానికి "కులం"

అధికారం చేతికి చిక్కించుకోవడానికి కులభేదాలను నిచ్చెనలా ఉపయోగించుకొనే వర్గాలు మాటల్లో సమానతను వల్లెవేస్తున్నా చేతల్లో అసమానతలనే శాశ్వతంగా ఉంచాలని ప్రయత్నిస్తాయి. 'కులం తక్కువ తనం' ఒక అర్హతగా ప్రకటించే వ్యవస్థలో దళితులు, పీడితులు, బడుగు పేదలు దానివల్ల లాభం పొందాలని చూడడంలో వింత ఏమీ లేదు. అయితే ఇది కంటి తుడుపేగాని, కడుపులోని చిచ్చును ఆర్పేసాధకం కాదని గుర్తించిన కష్టజీవులు కులాలకు అతీతమైన శ్రామిక వర్గంగా సంఘటితమవడానికి ఎక్కువ అవకాశాలు ఉన్నాయి. నూతన సాంఘిక వర్గాలలో నూతన ఉత్పత్తి శక్తులు తలలెత్తుతాయి. ఆ నూతన సాంఘిక వర్గాలలోని సంఘర్షణే చరిత్ర పురోగమనానికి ప్రాధాన్యం.

## స్వార్థపరశక్తుల వికృత యత్నమే కులతత్వం

అయితే పురోభివృద్ధికి ఆటంకంగా ఈనాడు దేశంలో కులమత ద్వేషాలు అవరోధాలుగా ఎందుకున్నాయి? మానవుణ్ణి ఆలోచించగల జంతువు అని పూర్వం కొందరు నిర్వచించినా తమ స్వలాభాలను పరిరక్షించుకొనే స్వార్థపర రాజకీయవాదులు కులతత్వాలను రెచ్చగొట్టి మానవులను ఆలోచించలేని జంతువులుగా చేస్తున్న వికృత ప్రయత్నాలే కారణం. వీటిని వామపక్ష లౌకికవాదశక్తులు ఎదుర్కోవడం ప్రథమ కర్తవ్యం.

"భారతీయ సంస్కృతిపై ముద్ర వేసిన సంస్కృత రచన ఏదీ లేదా ?......గీ...ల్గత, పరస్పర విరుద్ధ విషయాల మధ్య సామరస్యం కుదిరించ జూసే భారతీయ సాంప్రదాయానికి అనుగుణంగా, గీత తీవ్ర వైరుధ్యాలను హాయిగా కలిపేస్తుంది. భక్తి అనే కొత్త సిద్ధాంతాన్ని బలంగా ప్రతిపాదించడం ద్వారానే 'గీత' విశేషంగా ఆదరణ పొందగలిగింది. దేవుడి గుణగణాలు ఎలాంటివైనా వాటిని ప్రశ్నించకుండా, నిర్నిబంధంగా విధేయత చూపడమే "గీత"లోని భక్తి సారాంశం, భూస్వామ్య భావజాలానికి ఇది సరిగ్గా అమరిపోయింది. మేస్త్రికి అర్థ భానిస, భూస్వామికి మేస్త్రీ, సామంతునికి భూస్వామి, రాజుకు సామంతుడు షరతులు లేని విధేయత చూపడం మీదే భూస్వామ్య సమాజం ఆధారపడింది."

(డి. డి. కోశాంబి)

# ఊర్ధ్వచలనం – అధోచలనం

**శ్రీ ఏటుకూరి బలరామమూర్తి**

చార్వాక, జైన, బౌద్ధ మహోద్యమాల ఫలితంగా బౌద్ధయుగం తర్వాత, సామాజిక ఊర్ధ్వ చలనం పెద్ద ఎత్తున మొదలయింది. దాదాపు అదే సమయంలో అధోచలనం కూడా ప్రారంభమైంది.

క్రీ॥ పూ॥ 600 – క్రీ॥ శ॥ 1000 వరకు ఈ మహాసామాజిక పరిణామం జరిగిందని చెప్పవచ్చు. ఊర్ధ్వచలన క్రమం బీహార్, బెంగాల్‌ల్లోనూ, అధోచలన క్రమం ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్‌లలోనూ అని స్థూలంగా స్థల నిర్దేశన కూడా చేయవచ్చు.

బౌద్ధులలో రెండు రకాల వారున్నారు. సన్యాసం స్వీకరించి, ఆరామాలలో భిక్షువులుగా జీవిస్తూ, వైద్యం, విద్యాప్రచారం, లేఖనం, చిత్ర, శిల్ప కళలు చేపట్టి ప్రజాసేవ చేసేవారు. క్రీ॥ పూ॥ 250లో అశోక చక్రవర్తి కాలానికి యిలాంటి వారే 2, 3 లక్షల మంది వున్నట్లు అంచనా.

వీరుకాక 'ఉపాసకులు' అను మరొక వర్గం వుండేది. వీరు గృహస్థులు. వాణిజ్యం, వ్యవసాయం లేక ఏవో వృత్తులు నిర్వహిస్తూ లౌకిక జీవనం గడిపే వారు.

భిక్షుక వృత్తి స్వీకరించినవారు, అంతకు పూర్వం తాము ఏ కులం నుండి వచ్చారో, ఆ పేరు కూడా స్మరించేవారు కాదు. "ఉపోద్ఘ" అను దీక్షతో వారి పేర్లు కూడా మారిపోయేవి. నాటి నుండి వారు పునర్జన్మ ఎత్తినట్లు భావించేవారు. గౌతముడు తన తండ్రి శుద్ధోధనుని వద్దకు భిక్షుకు వెళ్ళాడు. "నీవు నా కుమారుడవు కావా" అని శుద్ధోధనుడు ఎంతో దీనంగా అడిగాడు. "ఔను, మహారాజా పూర్వజన్మలో నేను మీ కుమారుడనే. ఇప్పుడు బౌద్ధం స్వీకరించాను. ఇది పునర్జన్మ" అని గౌతముడు సమాధానం చెప్పాడు. అన్నట్లు "పునర్జన్మ" అను మాట ఈ రూపంలో బౌద్ధంలో ప్రవేశించి, తర్వాత అనేక అపభ్రంశ వాఖ్యానాలకు కారణమైంది.

రెండవ తరహాకు చెందిన ఉపాసకులు సైతం, తాము "బౌద్ధులము" అని సమాధానం చెప్పేవారు. మీ కులం ఏమిటి అని అడిగినా చెప్పేవారు కాదు. పౌరజీవితంలో కులం పేరు సైతం ఉచ్ఛరించరాదు అని ఉపాసకులకు బౌద్ధం విధించిన నియమం.

అంటే దీని అర్థం, కుల "చైతన్యం" వారిలో పూర్తిగా నశించిందని కాదు. వివాహాది సందర్భాలలో వీరు తమకు ఆప్తులు, బంధువులైనవారితోనే వియ్యమందేవారు. పౌర జీవితంవేరు, కుటుంబజీవితం వేరు – అనే విభజనను బౌద్ధం ప్రవేశపెట్టింది. తర్వాత 250 సంవత్సరాలకు అశోకచక్రవర్తి చెక్కించిన అనేకానేక శాసనాలద్వారా యిది వ్యక్తమౌతుంది. అప్పటికదే గొప్ప సంస్కారం. అదే సమయంలో "అన్ని మతాల వారిని సమదృష్టితో చూడండి, శ్రమణులను, బ్రాహ్మణులను గౌరవించండి" అనే మాట అశోకుని శాసనాలన్నింటిలోనూ అంతర్వాహినిగా కనిపిస్తుంది. శ్రమణులు అంటే బౌద్ధ భిక్షువులు, బ్రాహ్మణులు అంటే వైదిక పండితులు – మైధో వర్గానికి చెందిన యీ ఉభయులపట్ల గౌరవభావాన్ని ప్రదర్శించవలెను అని భావం.

జైనులు కూడా ప్రత్యేక మత శాఖవారు కులం పేరు చెప్పరు. కేవలం జైనులు అని మతం పేరు చెబుతారు. ఆ జీవకులు అను మరొకశాఖ వుండేది. కాని వారు సంఖ్యారీత్యా కొద్ది మంది. ఛార్వాకులుకూడా తగు సంఖ్యలో వుండేవారు.

(Communisum-2(a)

## వృత్తి విభజన

సామాజిక ఊర్ధ్వ చలనం మొదట వృత్తి విభజన రూపంలో, కొత్త వృత్తుల ఆవిర్భావంద్వారా జరిగింది. బౌద్ధానికి పూర్వం శిల్పం, చిత్రలేఖనం, లేఖక వృత్తి, వైద్యం లాంటి వృత్తులవారు అతి స్వల్పంగా వుండే వారు. ఈ వృత్తులకు బౌద్ధం ఫలితంగా గొప్ప ప్రోత్సాహం లభించింది. అంతవరకూ యజ్ఞ యాగాదులలో పౌరోహిత వృత్తి ద్వారా జీవించే బ్రాహ్మణ వర్గంలో సగభాగం నిరుద్యోగులయినారు. వారిలో, అవసరంకొద్దీ కొందరు, బౌద్ధం కలిగించిన మానసిక పరివర్తనద్వారా కొందరు కొత్త వృత్తులను స్వీకరించారు. వివిధ కులాల నుండి కొత్తగా వృత్తులు స్వీకరించినవారు, బ్రాహ్మణ వర్గం నుండి యీ వృత్తులు స్వీకరించినవారు, అంతా కలిసి ఒక మిశ్రమ కులం ఏర్పడ్డది. వారే విశ్వబ్రాహ్మణులు. అంతకు ముందు యీ పేరే లేదు. తర్వాతనే వీరి పేరు వినిపించింది. వీరంతా మతరీత్యా మొదట్లో బౌద్ధులు లేక జైనులు. శిల్పులు, వడ్రంగులు, కమ్మరి, బంగారం, వెండి పనులు చేసేవారు. క్రమంగా వీరికి పంచాణంవారు అనే పేరు స్థిరపడ్డది.

ఊర్ధ్వచలనంలో మరొక పార్శ్వంవుంది. బౌద్ధులు, జైనులు అన్ని కులాలనుండి వచ్చారు. రెండు మూడు తరాలు గడిచిన మీదట వీరు ఏ కులం నుండి మొదట్లో వచ్చారో అనే స్పృహకూడా సహజంగా నశించింది. కొంతకాలం తర్వాత

వారు తిరిగి వైదిక మతంలో [illegible]లైనారు. ఆ పిమ్మట శైవులలో పూజారులు, బ్రాహ్మణులు ఐనారు. కొత్త వృత్తుల ద్వారా కొత్త ఆచారాలు, ముఖ్యంగా తిండి, బట్ట, మాట తీరులలో మార్పు వచ్చింది. అంటే సాంస్కృతిక పరివర్తన జరిగిందన్నమాట. మిశ్రమ కులాలు, సంస్కృతి యిలా ఏర్పడ్డాయి. ప్రస్తుత కాలంలో బ్రాహ్మణుల నుండీ అన్నీ మిశ్రమ కులాలే.

## స్థాన భ్రష్టత

అశోకుని కళింగ యుద్ధం తర్వాత సుమారు 2 లక్షల మంది ప్రజలు స్థానభ్రష్టులైనారు. వీరంతా కళింగం నుండి యితర ప్రాంతాలకు బలవంతంగా తరలించబడ్డారు. పూర్వం అన్ని యుద్ధాల ఫలితంగా యిలాంటి సామూహిక స్థానభ్రష్టత్వం జరిగేది. కొత్త ప్రాంతాలలో బతుకుతెరువుకై వెళ్ళినవారు, బలవంతంగా తరలించబడినవారు, తమ పాత ఆచారాలను కొనసాగిస్తూనే, కొత్త ప్రాంతాలలో సామాజిక ఊర్ధ్వచలనం లేక అధోచలనానికి గురయ్యేవారు. వ్యవసాయం లాంటి వృత్తులు వారికి లభిస్తే ఊర్ధ్వచలనం, ఇంకా తక్కువ వృత్తులు లభిస్తే అధోచలనం. ఇది అంతా పరిపాలకుల దయ.

ఇదే కాలంలో, వైదిక సాహిత్యంలోను, మతంలోను అంతర్మథనం మొదలైంది. బౌద్ధ సాహిత్యంతో పాటే జన్మించింది భగవద్గీత. "స్త్రీ సుదుష్టాసు వార్ష్ణేయ వజాయతే వర్ణసంకరం" అనే మాట పుట్టింది. పురుషులు దుష్టులైనా వర్ణ సంకరం వస్తుందికదా? అలా అనలేదు. అనులోమ వివాహాలను చూసి చూడనట్లు సర్దుకున్నారు. విలోమ వివాహాల మీదనే యీ ఆంక్షలు.

పై వర్ణం స్త్రీ, క్రింది వర్ణం పురుషులతో వివాహ తదితర సంబంధాలద్వారా సంతానం కంటే, వారికి అధోచలనం తప్పదు. కొన్ని సందర్భాలలో ఒక్క మెట్టు, రెండు మెట్లు క్రిందికి జారే వారు. మను ధర్మశాస్త్రం కఠినంగా అమలు జరిగిన కాలంలో అన్ని మెట్ల నుండి క్రిందపడిపోయి అస్పృశ్యులలో చేరిపోయేవారు. కొన్ని ఆటవిక తెగలు గ్రామీణ జీవితంలో ప్రవేశించే క్రమంలో, నాలుగు వర్ణాలలోకి అప్పుడే అందరూ సర్దుకున్న మీదట, అస్పృశ్యత అంటూ అవర్ణులంటూ ఒక కులం ఏర్పడ్డది. గ్రామ పారిశుద్ధ్యం, మృత శరీరాల దహనం, తోళ్ళ పరిశ్రమ, చెప్పులు కుట్టడం, గ్రామీణ వ్యవసాయ కార్మిక వృత్తి ఇది వీరి జీవన విధానం. అన్ని వృత్తులు సమానమే. నిజానికి అపరిశుభ్రమైన వృత్తులు చేసే వారికి మరింత పరిశుభ్రత నేర్పవలసి వుంది. బౌద్ధ ఉదారవాదం, అలా బోధించింది. ఈ వాసన సోకని, వర్ణవ్యవస్థ కుల వ్యవస్థగా చీలి, హెచ్చు తగ్గుల పై ఆధారపడిన సామాజిక దొంతరలను సృష్టించింది. నాటి నుండి కొనసాగుతూ, నేటికి మరింత వికృతరూపం ధరించిన కులవ్యవస్థ ఇదే.

మరో సామాజిక ఊర్ధ్వచలన ప్రక్రియ, శుంగ, కణ్వ రాజుల కాలంలోను, ఆ పిమ్మట వచ్చిన గుప్త రాజుల కాలంలోనూ పెద్ద ఎత్తున సాగింది.

## విదేశీయుల స్వీకృతి

మౌర్య చక్రవర్తుల కాలంలో మొదలై, గుప్త, వాకాటక రాజుల వరకూ, ఆ తర్వాత కూడా దాదాపు 9వ శతాబ్ది వరకూ అనగా 12 లేక 13 వందల సంవత్సరాలపాటు, యవన, శక, పహ్లవ, అభీర, గూర్జర, కుషాన, హూణ ఇత్యాదులు నిరంతరం పశ్చిమ భారతంలోకి వస్తూనే వున్నారు. వీరందరూ వైదిక మతాన్ని, లేక మహాయాన రూపం ధరించిన బౌద్ధమతాన్ని స్వీకరించారు. సంస్కృత భాషను, లేక ప్రాకృతాన్ని మాతృభాషగా స్వీకరించారు. మొదట్లో వారి మతం ఏమో, భాష ఏమో ఎవరికీ తెలియదు. వీరందరూ ఆయుధోప జీవులు. రాజరికం నిర్వహించినవారు. శకులు, కుషానులు, హూణులు, పాటలీపుత్రం వరకూ దాడి చేసి, తిరిగి పశ్చిమ భారతానికి గుప్తరాజులచే నెట్టివేయబడినవారు.

ఆయుధోపజీవులైన వీరిని క్షత్రియులుగా వైదిక మతం స్వీకరించింది. ఆబు పర్వతంలో జరిగిన 'అగ్ని పరీక్ష' అనంతరం వీరంతా క్షత్రియులు, లేక క్షత్రియులైనారు. అన్యమతస్తులను వైదిక మతంలో చేర్చుకునేందుకు ఆనాడు వైదిక మతం అవలంబించిన ప్రక్రియ ఇది. అందరూ క్షత్రియత్వ గౌరవం పొందలేదు. కొందరిని నిర్వాసిత శూద్రులు, అనిర్వాసిత శూద్రులు అని పిలిచారు. నిర్వాసిత అంటే ఊరి బైట నివసించేవారు, అనిర్వాసిత అంటే ఊళ్ళో నివసించే వారు. నిర్వాసిత శూద్రులు ఆర్థిక స్థితి, వృత్తి, హోదా క్షీణించినకొద్దీ క్రింది కులాలకు బహుశా కొందరు అస్పృశ్యులలోకి కూడా చేరిపోయారు. ఒకే సమయంలో జరిగిన ఊర్ధ్వచలన, అధోచలన ప్రక్రియ ఇలా వుండేది.

## మిశ్రాలు, శర్మలు

మూడో తరహా మరొకటి వుంది. గుప్తరాజుల కాలంలో పూర్వ మీమాంసా సిద్ధాంత, అనగా యజ్ఞ యాగాది క్రతు సంరంభాన్ని ప్రోత్సహించే ధోరణి మొదలైంది. అంతవరకూ ఆటవిక జాతులుగా వున్నవారు, ముఖ్యంగా మధ్యప్రదేశ్‌లో బ్రాహ్మణులుగా, క్షత్రియులుగానూ ఊర్ధ్వచలనం పొందారు. ఏమంటే ఆటవికుల మంత్ర, తంత్ర ప్రక్రియ, పూర్వ మీమాంసా మత ప్రక్రియకు సన్నిహితం. మధ్యప్రదేశ్‌ను, ఆంధ్రలో ఉత్తరభాగాన్ని పరిపాలించిన వాకాటకులు, క్షత్రియత్వం పొందారు. బీహారులో మిశ్రాలనబడే బ్రాహ్మణులు, తెగల పూజార్ల దశ నుండి బ్రాహ్మణత్వం పొందినవారు. వీరుకాక బీహార్‌లోనే శర్మ అంటు మరొక బ్రాహ్మణ వర్ణం ఉన్నది. ఒక్కమాటలో చెప్పాలంటే 7, 8, 9 శతాబ్దాలలోని బ్రాహ్మణ, క్షత్రియ, శూద్రకుటుంబాలలో హెచ్చుభాగం, తత్పూర్వం ఆటవిక, గిరిజన నాయకులుగా వుండి సంస్కృతీకరణ ఫలితంగా ఇలాంటి ఊర్ధ్వ చలనానికి గురైనవారే.

ఇదే కాలంలో, ఇదే క్రమంలో సామాన్యులు ఏం కావాలి? వారు ఏదో తక్కువ కులంలో సర్దుకున్నారు. మరికొందరు అస్పృశ్యుల సంఖ్యను పెంచారు.

వంశవృక్షాలు రాసుకుని, గోత్రాలు చెప్పుకుని ఎవరికి వారు, క్షత్రియులమని, సద్బ్రాహ్మణులమని గొప్పలు చెప్పుకోవచ్చుగాక, చరిత్రలో జరిగిన పరిణామం మాత్రం ఇదే.

చాళుక్య, కాకతీయ యుగాలలో దక్షిణాదిన ఆంధ్రదేశంలో కూడా యిలాంటి పరిణామమే జరిగింది.

ఏ ఒక్కరూ నిజాయితీతో, తాము క్రింది కులాల నుండి, శ్రేణుల నుండి పైకి ఎగబాకిన వారము అనే వాస్తవాన్ని అంగీకరించరు. ప్రతి ఒక్కరూ వేదకాలం నుండి తమ కులానికి ఏవో బీజాలు వున్నాయంటారు. కుల వ్యవస్థలోని అత్యంత విషాదకరమైన అంశం ఈ ఆత్మవంచన.

తర్వాత చరిత్రలో కూడా ఇలాంటి ఊర్ధ్వచలన, అధోచలన క్రమాలు చాలా జరిగాయి. వీర శైవ, వీరవైష్ణవ ఉద్యమాల కాలంలో దక్షిణాన, రామనంద, కబీరుల కాలంలో ఉత్తరాదిన యిలాంటి పరిణామాలు జరిగాయి.

ఎన్ని జరిగినా, చట్రం మారదు. సంస్కృతి మారలేదు. పై కులంలో ఉన్న వ్యక్తి క్రింది కులాలను తక్కువగా చూసే ప్రవృత్తి మారలేదు.

విద్య, వృత్తి ఆచార వ్యవహారాలలాంటి వ్యత్యాసాలు తిండి, బట్ట, మాటతీరు అన్నీ కలిసి కులాలను, వేలాది సంవత్సరాలుగా కొనసాగినందున దాదాపు విభిన్న సాంస్కృతిక శ్రేణులుగా మార్చి వేశాయి.

ఈ పొరలన్నింటినీ తొలగించాలి. సర్వులకు విద్య అంచుకు మొదటి చర్యకావాలి. విద్యకూడా సాంప్రదాయ పద్ధతిలో కాక, చారిత్రక, శాస్త్రీయ విశ్లేషణాపరంగా వుండాలి.

ఒక పొరపైన మరొకటి యిలా పేరుకు పోయాయి.

ఈ పొరలన్నింటినీ తొలగించడానికి మరికొన్ని శతాబ్దాలు పట్టవా? అనే ప్రశ్న వుంది. అక్కరలేదు. ఆధునిక యుగంలో సామాజిక పరిణామాలు అతి వేగంగా సాగుతున్నాయి. జరిగి తీరతాయి. ఈ క్రమాన్ని వీలైనంత వేగిరపరచటమే మన కర్తవ్యం.

---

"సింధులోయలో మొహెంజొదారో, హరప్పా—రెండే నగరాలు. మిగతా జనావాసాలు, వాటి శిథిలాలు చాల చిన్నవి. రెండు నగరాల చుట్టూరా, పరిసరాలలో ఎంతో గ్రామీణ జీవితం వుండాల్సింది. చెదురు మదురుగా కొన్ని జనావాసాలు మాత్రమే తవ్వకాలలో కనిపించాయి .........

సింధులోయ నాగరికత మార్పు, చేర్పులు లేకుండా కొనసాగడానికి కారణం కేవలం నిర్లక్ష్యమే కాక, అంతకన్న బలమైన కారణాలే ఉండి వుండాలి ... ... ...

కాలువల వ్యవసాయాన్ని అనుకరించి పంటలు ఇంకా బాగా పండించి ఉండొచ్చు. ఈ పనులేవి సింధు ప్రజలు చేయలేదెందుకు? వీటివల్ల తమ లాభాలు పెరగవని సింధు వ్యాపారులు భావించి వుండాలి. మహాదేవాలయం, దాని పురోహిత వర్గం మొత్తం భూమిపై పెత్తనం చలాయించి వుండాలి. ఒకసారి పెత్తనం చెలాయించాక ఇంకా కొత్త కొత్త మార్పులను వీరు అడ్డగించి వుండాలి. పురోహిత వర్గానికి మార్పులు అవసరం లేదు. వ్యాపారులకు మార్పు లాభసాటి బేరంకాదు.

(డి. డి. కోశాంబి)

---

# భారతదేశంలో కులవ్యవస్థ

డా॥ మాడభూషి భావనాచార్యులు

భారతదేశంలో నేడు పునర్వ్యవస్థీకృతమవుతున్నాయి కులాలు. స్వాతంత్ర్య సమరకాలంలో సంఘ సంస్కర్తల త్రికరణశుద్ధివల్ల పూర్తిగా యివి దెబ్బతిన్నాయి. కాని స్వాతంత్ర్య సముపార్జనానంతరం - పాలకవర్గంలోకి ఎగబ్రాకేందుకు ఒక నిచ్చెనగా కులమౌఢ్యాన్ని స్వార్థపర శక్తులు పెంచుతున్నాయి. దీనివల్ల ఒక కులానికి మరొక కులానికి నడుమ స్వార్థం గురించిన కలహాలుగా యేర్పడి రక్తపాతం వరకూ పెరిగిపోతున్నాయి. ఐతే కేవలం భారతదేశానికే పరిమితమైన ఈ కులవ్యవస్థ ప్రారంభపరిణామాలేవిధంగా వున్నాయో విశ్లేషించడం అవసరం.

ఈ కులవ్యవస్థను విశ్లేషించడానికి సాధారణంగా "జాతి, వర్ణం, కులం" అనే మూడు పదాలు వినబడుతూ వుంటాయి. ఈ మూడూ పర్యాయపదాలు కావు. వేరు వేరు అర్థాలతో ఏర్పడినా, వ్యవహార సరళిలో సమానార్థాలని అనిపిస్తాయి. 'శబ్దార్థాలననుసరించి వీటికి జాతి అంటే పుట్టుక అనీ, వర్ణం అంటే రంగు అనీ, కులం అంటే సమూహం అనీ అర్థం. భారత దేశం నలుమూలలా అనేక జాతులు, వర్ణాలు, కులాలు ఉన్నాయి. వాటి మధ్య సంకుల సమరాలు సాగి, సంలీనాలతో పర్యవశించడం జరిగింది. ఆర్యులు - అనార్య జాతులతో అనేక యుద్ధాలు చేసినట్లుగా 'ఋగ్వేదమే చెబుతూంది. వంద దుర్గాలుకల శంభరాసునితో, ఆరంభం నుంచీ ఆర్యులు యుద్ధాలు సాగించారు. భారతదేశం అనేక తెగలకు ఆలవాలం. ఆయా తెగలన్నీ తమ తమ సంస్కృతులనూ, ఆచార వ్యవహారాలనూ విడనాడకుండా వైదిక ధర్మాన్ని అవలంబించారు. విదేశీజాతులైన యవనులు, ఈజిప్షియనులు, కుషానులు వగైరా అనేక మంది వైదిక మతాన్ని స్వీకరించి, జాతీయ స్రవంతిలో లీనమయ్యారు. అందుచేతనే వైదిక ధర్మం ఒకటి అయినా, భారతదేశంలో విభిన్న సంస్కృతులు వున్నాయి. వీటిలో వర్ణం - కులం అనేకం మిళితమై వున్నాయి.

అథోజ్ఞాపిక .... ..... ...... (1)

## "వర్ణం" పదవ్యాప్తి

"వర్ణం" అనే పదవ్యాప్తిని గురించి పరిశీలిద్దాం. వర్ణం అంటే శరీరచ్ఛాయ. ఆర్యులు తెలుపురంగని, అనార్యులు నలుపురంగని వేదవచనాలు తెలుపుతూన్నాయి. కులాలవారీగా రంగులను మహాభారత శాంతిపర్వంలో చెప్పారు. ఈ క్రింది శ్లోకంలో శరీర వర్ణాధారంతో కుల భేదాలెలా యేర్పడ్డాయో తెలిపింది.

శ్లో॥ బ్రాహ్మణానాం సితోవర్ణః క్షత్రియాణాం చ లోహితః
వైశ్యానాం పీతకోవర్ణః శూద్రాణాం అసితస్త థాః ॥

*మ॥ భా॥ అధ్యాయం 186 శ్లో - 05*

బ్రాహ్మణులు తెలుపు, క్షత్రియులు ఎరుపు, వైశ్యులు పసుపు రంగు, నలుపు శరీరాలు కలవారు శూద్రులు.

ఈ విధంగా ఆదిలో వింగడించారు. ఇది సత్యదూరమని మన ఎథనాలజిస్టులు, శాస్త్రకారులూ రుజువు చేశారు. నాడూ - నేడూ కూడా అన్ని కులాలలోనూ, అన్ని వర్ణాలలోనూ, అన్ని జాతులలోనూ అన్ని రంగులవారూ ఉన్నారు. ఆదిమకాలంలో మనదేశంలో జాతులకు వర్ణభేదాలున్నా, అవి ప్రాచుర్యం పొందలేదు. కారణం భిన్నత్వంలో ఏకత్వం సాధించిన మన వైదిక సంస్కృతి. ఇది మన విశిష్టత. ఇలా అన్ని దేశాలలోనూ జరగలేదు. శాస్త్రీయ (సైన్సు) సాంకేతిక వైజ్ఞానిక (టెక్నలాజికల్) పరిజ్ఞానం పెరిగిన నేటి ఆధునిక ప్రపంచంలో కూడా జాతి విద్వేషాలు - వర్ణ సంఘర్షణలు జరుగుతూనే వున్నాయి. విశ్వ ప్రజాస్వామ్య పరిరక్షణ ముసుగులో, ప్రపంచాధిపత్యానికి తహతహలాడే అమెరికాలో - నల్లజాతి నీగ్రోలకూ, శ్వేతజాతి అమెరికా వారికీ అనునిత్యం సంఘర్షణలు జరుగుతూనే వున్నాయి. ఇక ఆఫ్రికాలో వర్ణవిభేదాలు పర్వతప్రమాణాలలో పెరిగిపోయాయి. పరస్పరం ఢీకొంటున్నాయి.

## తెల్ల, నల్లజాతుల సంఘర్షణలు

ఒక్క 1966 సంవత్సరంలోనే అమెరికాలో నీగ్రోలకూ, శ్వేతజాతీయులకూ 150 సంఘర్షణలు జరిగాయి. అసంఖ్యాకులు మరణించారు. చాలా ఆస్తి నష్టపడింది. వీటికి కారణాలను అన్వేషించేందుకు రైనాల్డ్ బి. జాన్సన్ ఆనాటి అమెరికా ప్రెసిడెంటు 1967లో ఒక కమిటీని నియమించాడు. ఆ కమిటీ తన నివేదికలో యీ సంఘర్షణలకు శ్వేత జాతీయులే కారణమని వక్కాణించింది. పరిష్కారంగా నీగ్రోలకు ఫెడరల్ పథకాలద్వారా సహాయాన్ని అందించాలని ఘోషించింది.

1968లో కీర్నర్ (KERNER) కమిటీ తన నివేదికలో నీగ్రోలకు ప్రత్యేకంగా పేటలను ఏర్పరచడాన్ని నిరసించింది. "అమెరికన్ శ్వేతజాతీయులు యెప్పటికీ అర్థం చేసుకోలేందీ - నీగ్రోలు యెప్పటికీ మరువలేందీ - నీగ్రోలకు

ప్రత్యేక పేటలను యేర్పాటు చేయడమే! దీనికి ఆర్థిక అసమానతలు తోడయ్యాయి. ఇంక ఘర్షణలు అనివార్యం" అంది.

15 సంవత్సరాల వయస్సుగల కొరియన్ బాలికను, అమెరికన్ శ్వేత జాతీయులు హత్య చేశారు. నీగ్రో జాతీయుడు ర్రోడ్నీకింగ్‌ను నడిరోడ్డుపై పోలీసులు చచ్చేట్లు బాదారు. ప్రభుత్వంగానీ, న్యాయస్థానాలుగానీ నేరస్థులపై ఎట్టి చర్యా తీసుకోలేదు. నల్లజాతీయులను హత్యచేయటం - హింసించడం శ్వేత అమెరికన్‌లకు నేరంకాదనీ - అది వారి జన్మహక్కని న్యాయస్థానాల భావనట! ఇట్టి ఘాతుకాలను జరిపినందుకు అమెరికన్ ప్రెసిడెంట్ జార్జిబుష్ పోలీసులనూ - న్యాయస్థానాలనూ అభినందించాడట!! (front line, june 5 -1992 P. 101 - 107) ఆఫ్రికాలో జాతి - వర్ణ విచక్షణల గూర్చి యెంత తక్కువ మాట్లాడితే అంత మంచిది. ఇది మానవజాతికి - మానవ సంస్కృతికి తలవంపు.

భారతదేశంలో జాతి - వర్ణ విచక్షణలు అంతగా లేవు. కులవ్యవస్థ మాత్రం నేడు సాంఘిక పీడనకు పర్యాపదమైంది. కులవ్యవస్థకు కొన్ని వేల సంవత్సరాలనుండి ప్రజలపై ప్రజలమైన పట్టువుంది. దాని కారణాలను వివరించకుండా పరిష్కారాలను కనుక్కోలేం. "ఋగ్వేదకాలంలో గణతంత్ర వ్యవస్థ వుండేది. ఆ వ్యవస్థలో జాతి వర్ణ కుల విచక్షణలు లేవు" అని ఏటుకూరి బలరామమూర్తిగారు 1957లో కాశీనాథుని నాగేశ్వరరావు స్మారకోపన్యాసంలో చెప్పారు. ఋగ్వేదం పదవమండలం 190వ మంత్రంలో "సంగచ్ఛత్వం - సంవదత్వం - సందోమారిసిజాతం".

అందరూ కలసి నడుచుకొందాం - అందరూ కలసి మాట్లాడుకొందాం - అందరూ సమానంగా జీవిద్దాం !!

ఇదే ఆనాటి ఋగ్వేదకాలపు విభేదాలూ - అంతరువులూ లేని సమసమాజం.

విశ్వసాహిత్యంలో ఋగ్వేదం అతిపురాతనమైనది. టర్కీలో అటాటర్ డ్యామ్‌వద్ద "నేవలికోరి" అనేచోట యిటీవల జరిపిన త్రవ్వకాలంలో ఋగ్వేద నాగరికతను పోలిన విశేషాలు బయటపడ్డాయి. "నేవలికోరి" ని సందర్శించి వచ్చిన ప్రముఖ ఆర్కియాలజిస్టు డా॥ బి. జి. సిద్ధార్థ యిలా అన్నారు.

ఋగ్భ్యోజాతం వైశ్యం వర్ణమాహుః।
యజుర్వేదం క్షత్రియ స్యాహుర్యో।
సామవేదో బ్రాహ్మణానాం ప్రసూతిః ।
పూర్వే పూర్వేభ్యోవచపిత దూచుః॥

(వ మండలం, 2వ మంత్రం)

తాత్పర్యం : ఋజ్మంత్రాలవల్ల వైశ్యులు; యజుర్వేదంవల్ల క్షత్రియులు; సామవేదంవల్ల బ్రాహ్మణులు వికసించారని పూర్వ ఋషులు వక్కాణించారు.

వైదిక సమాజంలో గొడ్డలికం (తవ్వకోల) క్రాయ్య నాగలిగా పరిణామం చెందింది. ఉత్పత్తి పెరిగింది; దీనికి వైశ్యులు వ్యవసాయకులు. అదనపు ఉత్పత్తికి రక్షణ అవసరమైంది; అందుకు క్షత్రియులు, ఉత్పత్తిని అధికతరం చేసే పరిశోధక వ్యాసంగానికి బ్రాహ్మణులు అవసరమయ్యారు; క్రమ పరిణామంలో సమాజ పోషణకు ఆహారోత్పత్తి ప్రధానం కావున వ్యవసాయకులైన వైశ్యులు ప్రథమశ్రేణిలోనూ, రక్షణ ద్వితీయ శ్రేణిలోనూ, మేధాప్రక్రియ తృతీయ శ్రేణిలోనూ చెప్పారు.

వేదాలు ఒకే కాలంలో కూర్చబడలేదు; వాటికి వందల వేల సంవత్సరాలు పట్టింది; ఆ వేదాలన్నిటినీ విభాగించి, కూర్చడంవల్ల వాటిని వేద సంహితలన్నారు; వైదిక ధర్మాలను కొన్ని తెగలు ఐచ్ఛికంగా అంగీకరించాయి; మరి కొన్ని తెగలు యుద్ధాలకు తలపడ్డాయి. ఓడిన తెగలను శూద్రులుగా చేశారు; ఋషులను ఉల్లంఘించిన శత్రులైన వారు శూద్రులయారు.

ఋగ్వేద పదవ మండలంలోని పురుష సూక్తం కుల విభజనను పేర్కొంది. ఈ సూక్తం యిటీవలి కాలంలో ఋగ్వేదంలో చేర్చబడిందని భండార్కర్ ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ అధినేత ఆర్. యస్. దండేకర్ నిరూపించాడు. ఏమైనా యీ సూక్తం దురర్థాలకు లోనైంది.

## పురుష సూక్త పాఠం

1. సహస్ర శీర్షా పురుషః। సహస్రాక్ష సహస్రపాత్।
సభూమిం విశ్వతోవృత్వా। అత్యతిష్ఠ దళాంగుళం।

12. బ్రాహ్మణోస్య ముఖమాసీత్। బాహూరాజన్యకృతః।
ఊరూ తదస్య యద్వైశ్యః। పద్భ్యాం శూద్రో అజాయత।

తాత్పర్యం : ఆ విరాట్ పురుషునికి వేయి శిరస్సులు, వేయి కళ్ళు, వేయి పాదాలు, భూమినంతా ఆవరించాడతను; ఐతే పది అంగుళాలకు మించి ఉండడు; అతనికి బ్రాహ్మడు ముఖం, క్షత్రియుడు భుజాలు, తొడలు వైశ్యుడు, పాదములు శూద్రుడు; భౌతిక గతికి పాదాలే ఆధారం; కర్మకు చేతులు, మేధకు ముఖం ప్రధానం;

వేదాలకు ప్రతీకాత్మకర్థాలే (Symbolic) గాని శబ్దార్థాలు తక్కువ అని స్వామి అరవింద ఘోష్ నిరూపించాడు. దీనిని రూపకార్థంగా భావించాలి. "వేయి" శబ్దాన్ని గుణ వాచకంగానే తప్ప, సంఖ్యావాచకంగా తీసుకోకూడదు. దీనిలో సమాజాన్నంతటినీ ఒక పురుషునిగా రూపించి, సామాజిక కర్మలను అవయవాలుగా వర్ణించాడు; నాలుగు కులాలనూ ఋగ్వేదం ఈ విధంగా శర్దిస్తే రామాయణం మరొక విధంగా చెప్పింది;

శ్లో॥ మనుర్మనుష్యాన్ జనయత్ కాశ్యపస్య మహాత్మనః।
బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యాన్ శూద్రాన్ చ మను జర్షభ।

తాత్పర్యం : కస్యపి ప్రజాపతి భార్య 'మనువ' నే వనిత; ఆమె బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులయిన మానవులను ప్రసవించెను;

భారతదేశంలోని అనేక తెగలు వైదిక ధర్మాన్ని స్వీకరించాయి; కాలక్రమంలో అలాగే ఈ దేశంలోనికి దండయాత్రలకు వచ్చి, ఇక్కడే స్థిరపడిన అనేక తెగలు, యవనులు, శకులు, ఈజిప్షియనులు, కుషానుల వంటివారు తమ తమ సాంస్కృతిక, ఆచార వ్యవహారాలను నిలుపుకొంటూ, వైదిక ధర్మాన్ని అవలంభించారు; ప్రప్రథమంలో యెట్టి కులాలూ లేవు; తర్వాత మూడు కులాలు; ఆ తర్వాత నాలుగు - మహాభారత కాల చరమదశలో ఐదు కులాలు, ఇక వందల వేల సంఖ్యలో కులాలు - ఇలా అనేకానేక కుల వ్యవస్థగా భారతీయ సమాజం భ్రష్టమైంది; ఒక్క బ్రాహ్మణ కులంలోనే రెండు వేల తెగలున్నాయని యుగ పురుషుడు శ్రీ కందుకూరి వీరేశలింగంగారన్నారు; నేటి భారతదేశంలో 4500 కులాలున్నా యని మండల్ కమిషన్ చెప్పింది.

## శూద్రులు ఎవరు?

నూతనంగా భారతీయమైన సమాజంలో కాలానుగతంగా అనేక పరిణామాలు పొడసూపాయి. ఆయా తెగలలోని మేధావులు బ్రాహ్మణ కులంలోనికి అనులోమం చెందారు. భుజబల ప్రధానులు క్షత్రియులుగా మారేరు. ఈ విధంగా రాచమర్యాదలు పొందిన తెగలనే తెలుగుదేశంలో పద్మనాయకులు; రెడ్లు, కమ్మవారు వగైరా. సంలీనాన్ని తిరస్కరించి, యుద్ధం చేసి ఓడిన వారిని దస్యులుగా, శూద్రులుగా విడదీశారు. ఇట్టి వారిని యూరోపియన్ - అమెరికన్ దేశాలలో కట్టుబానిసలుగా చేశారు. ఆ కట్టుబానిసలకు ఆస్తి హక్కుగానీ, వివాహపు హక్కుగానీ లేదు. వారిని పశువుల మాదిరి అమ్మడం - కొనడం - పశువులశాలలో కట్టివేయడం - వారిని వ్యవసాయపు పనులకు పెద్ద ఎత్తున వినియోగించడం చేసేవారు. భారతదేశంలోని శూద్రులకు - ఆస్తి హక్కులు - వివాహపు హక్కులు ఉన్నాయి. 14 భాషలలో మహా పండితుడూ - వ్యాఖ్యాత - విమర్శకుడు శ్రీ దామోదర ధర్మానంద కోశాంబి "భారతదేశంలో చాతుర్వర్ణ వ్యవస్థే బానిస వ్యవస్థ రాకుండా అడ్డగించింది" అన్నాడు.

భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పింది నాలుగు వర్ణాలను.

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా స్పృష్టం గుణ కర్మ విభాగశః ।

"గుణ కర్మలపై ఆధారపడి అనగా కర్మల స్వభావాన్ని బట్టి నాలుగు వర్ణాలుగా నేను విభజించాను." అన్నాడు కృష్ణుడు.

మానవుడు చేసే వృత్తినిబట్టి నాలుగు వర్ణాలూ ఏర్పడ్డాయనేది స్పష్టం. మన దేశంలో మహాభారత కాలం వరకూ కులాలు వాటర్ టైట్ కంపార్టుమెంట్లు కావు. పుట్టుకనుబట్టి కుల నిర్ణయం లేదు. మహాభారత అరణ్య పర్వంలో,

శ్లో॥ జాతో వ్యాసస్తు కైవర్త్యాశ్వపాక్యాస్తు పరాశరః ।
బహవోన్యేపి విప్రత్వం ప్రాపయే పూర్వ మద్విజః ॥

వ్యాస మహర్షి బెస్త కన్యకు; పరాశర మహర్షి కుక్క మాంసం తినే వనితకు పుట్టేరు. బ్రాహ్మణ దంపతులకు పుట్టనివారు కూడా అనేక మంది బ్రాహ్మణులయ్యారు. కర్మ ననుసరించే కుల నిర్ధారణ, పుట్టుకనుబట్టి కాదు. "విద్యయా యాతి విప్రః" విద్యచేత విప్రుడవుతాడు.

శ్లో॥ జన్మనా జాయతే శూద్రహః సంస్కారే నజాయతే ద్విజః ।

పుట్టుకతో అందరూ శూద్రులే! (అజ్ఞానులే) సంస్కరింపబడుటచే , అతను ద్విజుడు అవుతాడు. (చాందగ్యోపనిషత్తు).

## వేశ్యాపుత్రుడు వశిష్టుడు

విశ్వామిత్రుడు క్షత్రియుడు. ఇతడు బ్రాహ్మడై అనేకమందో బ్రాహ్మలకి గోత్రకారకుడయ్యాడు. గాయత్రీమంత్ర స్రష్టకూడ యితడే! అంతేకాక, ఋగ్వేదంలో అనేక శూక్తాలకు స్రష్టకర్త. వశిష్టుడు తిలోత్తమ అనే వేశ్యకు జన్మించాడు. బ్రాహ్మడై ఋగ్వేద సూక్తకర్త అయ్యాడు. భృగుమహర్షి వీతహవ్యుడైన క్షత్రియుని బ్రాహ్మణునిగా చేశాడు. అతని పుత్రుడు గృత్సమదుడు ఋగ్వేద సూక్తకర్త. చాందగ్యోపనిషత్తు చతుర్థప్రపాఠంలో జనశ్రుతి అనే వేదవేత్త రైక్వుడనే శూద్రునికి వేదోపదేశం చేశాడు. అలాగే కవషుడనే శూద్రునిచే మంత్రపఠనం చేయించాడు. స్కాంద పురాణంలోని సహ్యాద్రి ఖండమందు (నేటి పడమటి కనుమలు) పరశురాముడు బెస్తవారైన కంకణి జాతి వారికి యజ్ఞోపవీతం వేసి, బ్రాహ్మణులుగా చేశాడు. ఋగ్వేదంలో 63గ్గురు స్త్రీలు సూక్తాలను రచించారు.

శూద్రులు - స్త్రీలు వేదోపదేశానికి అర్హులుకారనే శాసనం ఋగ్వేద కాలంలోగానీ, ఉపనిషత్తుల కాలంలో గాని లేదు. రాచరిక ధాష్టిక వ్యవస్థ (Fundamental System) అవలక్షణాలుగా యివి సంక్రమించాయి.

## ప్రపంచంలోని మానవులంతా ఒకటే

ప్రపంచంలోని మానవులంతా ఒకటే అని మహాభారత అరణ్యపర్వంలో చెప్పారు.

శ్లో॥ ఏకవర్ణమిదం పూర్ణం విశ్వమాసీద్యుధిష్ఠిర

"ఓ ధర్మ రాజా విశ్వంలోని మానవులంతా ఒకటే!"

మహాభారత అరణ్యపర్వంలో యక్షుడు "ద్విజత్వానికి కారణం ఏమిటి?" అని ధర్మరాజును ప్రశ్నిస్తాడు. అందుకు ధర్మరాజు.

శ్లో॥ "ద్విజత్వేజ వృత్తమేవ న సంశయః"

"ద్విజత్వానికి ప్రవర్తనే కారణం - ఎట్టి సందేహం లేదు" అన్నాడు.

మహాభారతంలో ఛండాలుర ప్రస్తావన వుంది. నాలుగు వర్ణాలకు మరొక వర్ణం తోడైంది. ఛండాలురు అనే వారు ఒక తెగకు సంబంధించినవారు, వీరు వైదిక ధర్మాలను ఆమోదించలేదు. వారితో యుద్ధం చేసి, ఓడించి, అస్పృశ్యులుగా ఊరిబయట పెట్టారని పండిత జైస్వాల్ చెప్పాడు.

మహాభారతంలో అంత్యజుల గూర్చి.

శ్లో॥ అంత్యజో విప్రజాతశ్చ ఏక ఏవ సహోదరః
ఏకయోనీ ప్రసూతశ్చ ఏకాశాఖేన జాయతే॥

## దళితులు ఎవరు?

అంత్యజులు (దళితులు అనగా సమాజంచే విదళింపబడినవారు) బ్రాహ్మలు సహోదరులు, ఏకగర్భజనితులు, ఒకేశాఖకు చెందినవారని పై శ్లోకంలో భీష్ముడు చెప్పినట్లుంది. దీనిని గూర్చి సంఘసంస్కర్త త్రిపురనేని రామస్వామి చౌదరి తన సూత పురాణంలో

"ఒక బ్రాహ్మణ స్త్రీ శూద్రునితో చెడిపోతే పుట్టిన సంతానం ఛండాలురు లేక హరిజనులు" అన్నారు. వారు అస్పృశ్యులుగా చెప్పబడ్డారు. అస్పృశ్యత విష్ణధర్మశాస్త్రంలో తప్ప మరే ధర్మ శాస్త్రంలోనూ కనబడదు. విశ్వధర్మ శాస్త్రం క్రీస్తు తరువాత మూడవ శతాబ్దంలోనిది అని విశ్వ విఖ్యాత శాస్త్రవేత్త పాండురంగ వామనకానే అన్నారు. (History of Dhrarma Sastra Vol. 4).

రాచరిక వ్యవస్థలోనూ, సూత్రకారుల కాలంలోనూ కులవ్యవస్థ వికృత రూపం ధరించింది. కులధర్మాలు ఎంతో క్రూరంగా అమలుజరిపారు. భారత ఆర్థిక వ్యవస్థలో ఆదిమకాలంలో కులం ప్రముఖపాత్ర వహించింది. ఆ కులంవారు తరగతులుగా ఆ వృత్తిలో వుండుటచే నైపుణ్యం - ఉత్పాదనశక్తి పెరిగేందుకు తోడ్పడింది. ఇనుము ఉత్పత్తిలో ప్రవేశించింది. అనేక సాంఘిక మార్పులకు కూడ కారణమయింది. వృత్తివిద్యలో పోటీ లేకపోవుటచే నైపుణ్యం క్షీణించింది. అది ఏనాడో తాత తండ్రులు చెప్పిన సాంకేతిక జ్ఞానానికే పరిమితమైంది. కులవృత్తులు పతనోన్ముఖంగా పయనించ ప్రారంభించాయి. బౌద్ధులు లోకాయతులు కులవ్యవస్థను - వైషమ్యాలను నిరసించారు. రాచరిక వ్యవస్థ అధోగతి పాలవుతోంది. అదికోత్పత్తికి ఒకనాడు ఆలంబనమైన కుల విభజన ఈనాడు అందుకు గుదిబండ అయింది. ఈ అస్పృశ్యత ఆదిశంకరుని కాలానికి విజృంభించింది. శంకరుడు అంత్యకాలంలో వర్ణ వ్యవస్థను వ్యతిరేకించాడు. క్రీ.శ. 11వ శతాబ్దంలో కర్ణాటకలో జన్మించిన బసవేశ్వరుడు వీరశైవ ప్రవక్త. ఆయన కుల వ్యవస్థను సమూలంగా కూల్చాడు. 12వ శతాబ్దంలో రామానుజుడు కుల వ్యవస్థను నిరసిస్తూ, తన 99వ యేట కూడా గ్రామ గ్రామం తిరిగి ప్రచారం చేశాడు. మదత్రయాలకు వ్యతిరేకంగా ప్రబోధించాడు. మదత్రయం అంటే ధన మదం - విద్యామదం - అగ్రవర్ణ (అభిజన) మదం.

## ముస్లింపాలనలో కులవ్యవస్థ

ఆ తరువాత వచ్చిన ముస్లిం పరిపాలన కుల వ్యవస్థను పరోక్షంగా కరుడు కట్టేటట్లు చేసింది. బలవంతంగా మతాంత - కులాంతరీకరణలు చేశారు. స్వమతరక్షణార్థం తమ మతాన్ని కులాలను పటిష్టం చేయనారంభించారు హిందువులు. ఇందుకు రాజపుత్రులు ముందువరుసలో నిలిచారు. ఈ తరుణంలోనే భక్త బృందాలు మతం వేరైనా మానవులంతా ఒకటే. అందరూ ఆ లోకేశ్వరుని సంతతే అని ప్రచారం చేశారు. ఉదాహరణకు భక్త కబీరులాంటి అనేకులు రామ్ - రహీమ్‌లు ఒకటే అని గ్రామ గ్రామాన తమ కోయిల గానంతో ప్రచలితం చేశారు.

ఇక బ్రిటిషు సామ్రాజ్య పాలన ప్రారంభమైంది. దేశ సమైక్యతను భగ్నంచేసి, విభజించి పాలించడం వీరి రాజనీతి. ఈ కుత్సితనీతితో కుల - మత కలహాలను రగిల్చి, సర్వదా ఆజ్యం పోసేవారు. నూతన ఆంగ్ల విద్యా ప్రభావంతోనూ - రైలు నిర్మాణం లాంటి విశృఙ్ఖలంగా అమలు జరుగుతున్న పారిశ్రామిక విప్లవ ఫలితంగానూ - కుల కట్టుబాట్లు కొంతవరకూ సడలాయి. ప్రముఖ సంఘసంస్కర్త శ్రీ రాజారామ్మోహన్‌రాయ్ కుల వ్యవస్థను తిరస్కరించాడు. ఏకేశ్వరోపాసనలు ప్రబోధించి, మానవులంతా ఒకటేనని చాటి చెప్పాడు. బ్రహ్మసమాజ ప్రభావానికి లోనైన కందుకూరి, మహీధర కుటుంబాలు ఆంధ్రలో ఎనలేని సంస్కరణోద్యమాన్ని ప్రచలితం చేశారు.

## కులతత్వానికి వ్యతిరేకంగా జాతీయోద్యమం - కమ్యూనిస్టు ఉద్యమం

భారతీయ తాత్విక శ్రేణిలో ప్రథముడుగా స్వామి వివేకానంద కుల వ్యవస్థనీ - అందులోని వైషమ్యాలను ప్రతిఘటించాడు. భారత స్వాతంత్ర్యోద్యమానికి ఊపిరిపోశాడు. పంజాబ్‌లో ఆర్యసమాజం లాంటి సంఘసంస్కరణల సంస్థలు కుల కట్టుబాట్లు సడలేందుకూ, జాతీయ సమైక్యతకూ ఎనలేని కృషి చేశాయి. జాతిపిత మహాత్మాగాంధీ మతాతీత - కులాతీత జాతీయోద్యమాన్ని నడిపాడు. మానవతా ధర్మాలను, నైతిక స్థాయిని పెంపొందించాడు ఖిలాఫత్ ఉద్యమం మొదలు హరిజనోద్ధరణవరకూ జాతిని మేల్కొలిపి, మూఢ విశ్వాసాలను సడలించాడు. జాతీయోద్యమ ప్రభావంతోనే ఆనాడు

గాంధేయవాదులు కుల కట్టుబాట్లను ధిక్కరించి, వర్ణాంతర మతాంతర వివాహాలను చేసుకొన్నారు. నౌఖాలీ దురంతాలలో మానభంగాలకు గురిఅయిన అపహృత స్త్రీలను వివాహమాడటం పవిత్ర కర్తవ్యమని మహాత్మాగాంధీ ఉద్బోధించాడు. 1921 నుండీ గాంధేయులుగా, రాజకీయ పాఠశాలలను నడుపుతూ చెలికాని రామారావు, వారి అనుయాయి పుల్సల సత్యన్నారాయణగార్లు అనేక కులాంతర వివాహాలను జరిపించారు. శ్రీయుతులు చెలికాని రామారావు, పుచ్చలపల్లి సుందరయ్య, మోహన్‌కుమార మంగళం, చిట్టూరి ప్రభాకరచౌదరి, పాలచర్ల పనసరామన్న, అస్మదాదులు యింకా ఎంతో మంది కులాంతర మతాంతర వివాహాలను చేసుకొన్నారు. ఆనాడు సనాతనులంతా సభలుపెట్టి కులాంతర వివాహాలను ఖండించేవారు, సాంఘిక బహిష్కరణాలనూ అమలుజరిపేవారు.

## కులవ్యవస్థ ఆర్థిక పునాదులు కూలిపోయాయి

కులాలకు ఆర్థిక పునాదులు ఏనాడో కూలి పోయాయి. కాని కులాలలో వున్న మూక లక్షణం (ట్రయిబల్ కేరక్టరు) మాత్రం మిగిలిపోయింది. ఒక తెగ (Tribe) లో వానిని మరొక తెగవారు కొట్టినా - హింసించినా, హత్యచేసినా - ఆ ట్రయిబ్ అంతా కలసి కలగజేసుకుని అతనికి అండగా నిలుస్తుంది. అలా చేయకపోవడం మహాదోషం. దీనినే అర్జునుడు కృష్ణునితో,

"కులక్షయ కృతం దోషం" (గీ 1 అ - 39 శ్లో)

కుల నాశనం దోషం అన్నాడు. పాండవులు - కౌరవులూ ఒకే ట్రయిబ్‌కు చెందినవారు.

కాలం చెల్లిన కులాలలో ట్రయిబ్ లక్షణాల పరస్పర రక్షణకు నిలిచి వుంది. చావు - పుట్టుకల సందర్భంలో కులాలు అండగా నిలుస్తాయనే విశ్వాసం నేటికీ ఉంది. దీనికి తోడు నేటి రాజకీయ వేత్తలు తమ స్వార్థప్రయోజనాలకై కుల తత్వాలను వినియోగించుకోవడం, ఏది యేమైనా కాని జాతీయోద్యమ ప్రభావంతో కుల కట్టుబాట్లు సడలాయి. కొంత మేరకు కులంలో సంస్కరణ చోటుచేసుకొంది. ఒకనాడు బ్రాహ్మణుడు భోజనం చేస్తూండగా శూద్రుడు చూడ కూడదు. నేడు బ్రాహ్మణుడు శూద్రుని యింటగానీ, హరిజనుని ఇంటగానీ భోజనం చేసినా పట్టించుకొనే ధైర్యం ఎవరికీ లేదు.

## కులతత్వం రెచ్చగొడుతున్న నడమంత్రపుసిరి వర్గాలు

స్వాతంత్ర్య సముపార్జనానంతరం గత నలభైయేళ్ళలోనూ, నూతన సంపద్వర్గం తలెత్త నారంభించింది. ట్రయిబల్ మూక లక్షణంతో కులతత్వాన్ని రెచ్చగొట్టి - నడమంత్రపుసిరితో కుల నాయకత్వంలోకి ఎగ్రబాకి తద్వారా రాజకీయ పదవులను - వాటి ద్వారా సంపదలను కొల్లగొట్టే షడ్యంత్రంలో కులతత్వం పునః విజృంభింపజేస్తున్నారు. ఇది సకల అరిష్టాలకూ కారణభూతమవుతోంది. నడమంత్రపుసిరి లక్షణమే కట్న ధనాశలకు గురిచేసి, స్త్రీ హత్యలకూ - భ్రూణ హత్యలకు దారి తీస్తూంది. ఈ అవలక్షణాలకు ప్రధాన కారణం, 1918 తరువాత గాంధీని మన జాతీయ స్రవంతి నుండి పూర్తిగా తొలగించేశాం. కమ్యూనిస్టు ఉద్యమం - తన జాతీయ కర్తవ్యాన్ని - సాంఘిక సంస్కరణోద్యమాన్ని విస్మరించింది. వీరేశలింగం ప్రభృతి సంస్కర్తలను, యుగపురుషులనూ మరచిపోయాం. మహామహులు నిర్మించిన సంస్కరణోద్యమం భగ్నమై, స్వార్థపరశక్తులు పట్టం కట్టుకున్నాయి. అందుచే ఎవరి కులం బొరియలలో వారు చేరిపోయేందుకే ప్రయత్నం చేస్తున్నారు.

## కాలం తీరిన వ్యవస్థలు కాలగర్భంలో కలుస్తాయి!

ఎవరెన్నివిధాల చరిత్ర గతిని వెనక్కి త్రిప్పాలి అని ప్రయత్నించినా, కాలం తీరిన వ్యవస్థలు కాలగర్భంలో కలిసిపోక తప్పదు. ఇది చరిత్ర చెప్పిన తీర్పు. అందుకే స్వామి వివేకానంద "శ్రామిక రాజ్యం వచ్చి తీరుతుంది. అందులో కుల భేదాలు నశిస్తాయి. అందరికీ తిండి, బట్ట, చదువు అందుబాటులో ఉంటాయి" అన్నాడు.

సమాజాన్ని ఆకాంక్షిస్తూ, మన మహాపురుషులు జాతి, వర్ణ, కుల భేదాలు, ధనిక, నిర్ధనిక వ్యత్యాసాలు మానవ కల్పితాలని, విశ్వ మానవులంతా ఒకటే అని ప్రబోధించారు. వాటికి భౌతిక రూపాన్ని కల్పించడం మన వంతు.

ఎలక్ట్రానిక్స్ - ఉపగ్రహాలు - కంప్యూటర్స్ ఉత్పత్తిలో నేడు ప్రవేశిస్తున్నాము. సామాజిక మార్పులనూ, ఆర్థిక మార్పులనూ ఆచరణాత్మక మార్క్సియదర్శన దీప్తితో "ఒకడు అందరికోసం, అందరూ ఒకని కోసం" పరిశ్రమించే సమాజ స్థాపనకు కృషి చెయ్యాలి. తద్వారా తరతరాలనుండి వేన్నాడుతున్న కుల వ్యవస్థకూ, ఆర్థిక అసమానతలకూ మంగళం పాడాలి.

దురాచారాల ఆర్థిక పునాదులు సడలిపోయినా మూర్ఖ విశ్వాసాల నీలి నీడలు మనపై ప్రసరించక తప్పదు. నేడు ఆలోచనాపరులు - అభ్యుదయ కాముకులు - స్వాతంత్ర్య సమర వీరులు తమ తమ భగ్న మనోరథాలను సమీక్షించుకొని - అర్థమర్థాంతరంగా ఆగిపోయిన సాంఘిక సంస్కరణ ఉద్యమపతాకను నిలుపుకొని, జాతిని మూఢపాశవిక శాపాల నుంచి, విముక్తి చేయాల్సిన బాధ్యతను విస్మరించరాదు. ఇందులో కమ్యూనిస్టులు తమ విశిష్ట పాత్రను పునః ప్రతిష్ఠించుకోవాలి.

అధోజ్ఞాపిక – 1

"Contact between food producers and gatherers whether by fighting or by some form of exchange could not be avoided, as the food producers extend operations. Each marginal food gathering was numarically small. But there was endless variety of tribes; where agriculture support as many as hundred people per square kilometre the most efficient hunting and food gathering would not even support one person and richest pastoral life less than three on a rough calculation. Moreover, good agriculture is possible with irrigation and fertilisers over a much under range of terrain there is food gathering. The first food production on large scale in India (actually Pakistan) was in the valley of Indus river, namely West Punjab and sindh. The date would be 3000 - 1750 B.C. This could not spread beyond the particular land. Then came the real expausion to the East for 1,800 kilometres into gangetic basin. This required totally different techniques of food production, accompanied by a new social organisation caste. That expansion took another thousand years, say to 700 B.C. Such a diffusion would not have been feasible, under premeture conditions with an early stage of caste system under which the fruits of labour could be appropriated without slavery".

(The culture and civilisation of ancient India in Historical Lines)

**BY D. D. KOSANBI**

అధోజ్ఞాపిక – 2 (ప్రకటపేజీ) Right side column

ఋగ్భ్యః = ఋక్కులనుండి; జాతం = ఉద్భవించిన; వర్ణం = కులం; వైశ్యం = వైశ్యుని; అహుః = చెప్పుదురు; యజుర్వేదం = యజుర్వేదం; క్షత్రియస్య = క్షత్రియులుకు సంబంధించినదిగా; అహు = చెప్పుదురు; యః = ఏ; సామవేదః = సామవేదం; బ్రాహ్మణానాం బ్రాహ్మణులకు; ప్రసూతి = వికాసమందినట్లు; పూర్వే పూర్వేభ్యః = పూర్వ మంత్రద్రష్టుల నుండి; ఏతత్‌ఈ; వచః = మాట; ఊచుః = పలికిరి.

అధోజ్ఞాపిక – 3

పదపాఠం – ప్రతిపదార్థం : అస్య = ఈ విరాట్ పురుషునికి; బ్రాహ్మణః = బ్రాహ్మడు; ముఖం = ముఖం; ఆసీత్ = అయెను; రాజస్యః = క్షత్రియుడు; బాహూ = భుజములుగా; కృతం = చేయబడెను; అస్య = ఈ విరాట్ పురుషునకు; ఊరూ = తొడలు; యత్ = ఏదియో; తత్ = అది; వైశః = కోమటి; పదాభ్యాం = పాదములవలన; శూద్రః = శూద్రుడు; అజాయతః = పుట్టెను.

అధోజ్ఞాపిక – 4

"At every stage, in almost every part of the country, a great deal of superstructure surviued; along with the productive and formal mechanism of several previous stages; There always remained some people, who could and did cling stupor to the older mode."

("The culture and civilisation of Ancient India in Historical out line".)

by **D.D. KOSANBI**

---

"ఈ దేశంలోని శ్రామికవర్గానికి శత్రువులు రెండు. ఒకటి బ్రాహ్మణీయత, రెండు రాచరిక వ్యవస్థ. బ్రాహ్మణీయత అంటే నా ఉద్దేశంలో సమానత్వం, సౌభ్రాత్రత, స్వతంత్రత అనేవాటికి వ్యతిరేకంగా ఉన్న వ్యవస్థ. అంతేకాని బ్రాహ్మణుల అధికారం, హోదా యివికావు. ఈ వ్యవస్థ బ్రాహ్మణుల చేత ప్రారంభించబడింది కాబట్టి దీనిని బ్రాహ్మణీయత అంటున్నాం. నిజానికి యిది అన్ని వర్గాలలోనూ వ్యాపించి వుంది."

(బి. ఆర్.. అంబేద్కర్)

దళిత జాతుల పోరాటం మర్యాదకోసం, ఆత్మగౌరవం కోసం. ఆర్థికపరమైన పురోగతి ఒక్క దానికోసమే కాదు.

(బి. ఆర్. అంబేద్కర్)

---

# భారతదేశంలో కులాలు

డా॥ ఎస్వీ. సత్యనారాయణ

భారతదేశంలో కులాల సమస్యను అధ్యయనం చేయడానికి ముందు ఇక్కడ నెలకొనివున్న సామాజిక వ్యవస్థను అర్థం చేసుకోవడం ముఖ్యం. ప్రపంచంలోని అనేక ఇతర దేశాలలోలాగా ఒక వ్యవస్థను పూర్తిగా ధ్వంసంచేసి, అంతకన్నా అభివృద్ధికరమైన వ్యవస్థలోకి పయనించడం ఇక్కడ జరగలేదు. ఉన్న వ్యవస్థతో క్రమంగా రాజీపడుతూనే కొత్త వ్యవస్థ రూపొందింది. ఫలితంగా కొన్ని స్వల్పమైన మార్పులతో సామాజిక వ్యవస్థ కొనసాగుతూ వున్నది.

## కుల – భూస్వామ్య – పెట్టుబడిదారీ మిశ్రమ వ్యవస్థ

మన దేశ సమాజ వాస్తవికతను జాగ్రత్తగా గమనిస్తే - ఇది కుల - భూస్వామ్య - పెట్టుబడిదారీ సంక్లిష్టమిశ్రమ సామాజిక వ్యవస్థగా అర్థమవుతుంది. దీనిలో మొదటిది వర్ణ లేదా కుల వ్యవస్థ. ఇది దాదాపు 4000 సంవత్సరాల నుండి కొనసాగుతున్నది. వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, ప్రబంధాలన్నీ దాదాపుగా ఈ వర్ణ వ్యవస్థను సమర్థించినవే. చాతుర్వర్ణ వ్యవస్థను ప్రతిపాదించిన ఈ సామాజిక వ్యవస్థ బ్రాహ్మణులను ప్రథమ స్థానంలో, శూద్రులను అథమ స్థానంలో, క్షత్రియ, వైశ్యులను మధ్యమ స్థానంలో నిలిపింది. కాలక్రమంలో శూద్రులలోని అట్టడుగు తెగల వారిని పంచములుగా, అస్పృశ్యులుగా, అవర్ణులుగా పరిగణించింది. కాలం గడుస్తున్న కొద్దీ ఈ శూద్రులు, అస్పృశ్యులు అనేక ఉపకులాలుగా విభజింపబడి, దాదాపు 6,000 కులాలుగా చీలిపోయారు. వీటిలో ఒకదానికంటే మరొకటి తక్కువ కులంగానూ, అథోస్థానంలోనూ నిలపడంవలన తీవ్రమైన అసమానతలకు, నిలువునా చీలికలకు దారి తీసింది.

వేలాది సంవత్సరాలుగా పాలనాధికారం, విద్య, విజ్ఞానం, ఉత్పత్తి శక్తులపై యాజమాన్యం, లలిత కళలపై పట్టు పై రెండు వర్ణాల గుత్తసొత్తుగా మారాయి. వర్తక, వాణిజ్యాలు వైశ్యుల పరమయ్యాయి. వెట్టిచాకిరీ, దాస్యం, శారీరక శ్రమ, నీచవృత్తులుగా పరిగణింపబడుతున్న వృత్తులు చేయడం, సమాజ అవసరాలను తీర్చడానికి ఉపయోగపడడం శూద్రుల జీవిత విధానమయ్యింది.

తరతరాలుగా ఈ దేశంలోని శూద్రులు అజ్ఞానాంధకారంలో, అమాయకత్వంలో, నిత్య దారిద్ర్యంలో, అవమానాలతో పశువులకన్నా హీనంగా జీవించారు.

రాజ్యాధికారం, ఆర్థిక ఆధిపత్యం, సాంస్కృతిక వికాసం కలిగిన అగ్రవర్ణాలు శూద్రుల్లో వర్ణ వ్యవస్థ కాపాడే మత విశ్వాసాలను, మూఢ నమ్మకాలను, కర్మ సిద్ధాంతాలను, పునర్జన్మ భావనను స్వర్గ, నరకాలను ప్రచారం చేసి పబ్బం గడుపుకున్నారు. భగవద్గీత, మనుస్మృతులు సమాజంలో అశాస్త్రీయమైన, అహేతుకమైన భావజాలాన్ని వ్యాపింపజేశాయి.

బానిస సమాజ వ్యవస్థలో నెలకొన్న వర్ణ వ్యవస్థ చట్రంలోనే ఈ దేశంలో భూస్వామ్య వ్యవస్థ రూపు దిద్దుకున్నది. రాజులు బ్రాహ్మణులకు, యుద్ధవీరులకు, కవి పండితులకు, రెవెన్యూ అధికారులకు విశాలమైన భూభాగాలను, అగ్రహారాలను దానం చేయడం ద్వారా క్రమంగా భూస్వామ్య వ్యవస్థ రూపొందింది. మహమ్మదీయ పరిపాలకుల కాలంలో సర్వే, రెవెన్యూ సెటిల్‌మెంట్ల ద్వారానూ, ఆ తర్వాత బ్రిటిషు వలస పాలకుల కాలంలో జమీందారీ వ్యవసాయ పద్ధతిని చట్టబద్ధం చేయడం ద్వారా భూస్వామ్య సామాజిక, ఆర్థిక వ్యవస్థ విస్తరించింది. చేతివృత్తులు వృద్ధి చెందాయి.

ఈ మధ్య కాలంలోనే కుల వ్యవస్థకు వ్యతిరేకంగా బౌద్ధం, జైనం, చార్వాకులు, శైవం, వైష్ణవం, మహమ్మదీయం, క్రైస్తవం వంటి మతాలూ, సంస్కరణ ఉద్యమాలూ కృషి చేసినప్పటికీ అవి విజయం సాధించలేకపోగా ఇక్కడి కుల వ్యవస్థతో రాజీపడ్డాయి. వీలైతే మరిన్ని కొత్త కులాల ఆవిర్భావానికి తోడ్పడ్డాయి. ఈ కొత్త మతాలవైపు శూద్రులు కొందరు ఆకర్షింపబడి, మతాంతరీకరణ చెందినప్పటికీ వారి సామాజిక, ఆర్థిక పరిస్థితులు ఏమీ మారకుండా కొన్ని స్వల్పమైన మార్పులు జరిగినప్పటికీ యదాతథ పరిస్థితి కొనసాగింది.

మన దేశాన్ని మహమ్మదీయ, బ్రిటిష్ వలస పాలకులు పరిపాలిస్తున్న కాలంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులతో పాటు శూద్రుల్లోని కొన్ని అగ్రకులాల వారు గ్రామీణ రెవిన్యూ అధికార్లుగా, సైనికాధికారులుగా బాధ్యతలు నిర్వహించి ఆర్థికంగాను, సామాజికంగానూ పై మూడు వర్ణాల స్థాయికి ఎదగడం ప్రారంభించారు. అధికార యంత్రాంగంలో భాగం పంచుకోవడం ద్వారా విద్యా, వైజ్ఞానిక రంగాల్లో కూడా ప్రవేశించగలిగారు. శూద్రుల్లోని అట్టడుగు కులాలవారు, ముఖ్యంగా అస్పృశ్యులు వ్యవసాయ కూలీలుగా, వెట్టిచాకిరీ చేసేవారుగా మాత్రమే, నీచవృత్తులు చేసేవారుగానే కొనసాగారు. రైత్వారీ ప్రాంతాలలో ఆధిపత్యంలో ఉన్న

కులానికి చెందిన శూద్రులు కొందరు భూస్వాములుగా ఎదిగి, అగ్రవర్ణాలతో సారూప్యం చెందారు.

బ్రిటీషు వలస పాలకుల కాలంలో పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ ప్రారంభమైనా, ఇది కుల, భూస్వామ్య, సామాజిక వ్యవస్థ చట్రంలోనే అభివృద్ధి చెందింది. వర్తక, వాణిజ్యాలు, పారిశ్రామికీకరణల వలన కొన్ని కొత్త వర్గాలు సమాజంలో ప్రారంభమైనప్పటికీ ఉన్నత వర్ణాల నుండే పెట్టుబడిదారీ వర్గం ప్రధానంగా రూపొందింది. శరీర కష్టంపై ఆధారపడిన శూద్రులు, దళితులు, అస్పృశ్యులు ఒక వైపు గ్రామాల్లో వ్యవసాయ కూలీలుగాను, మరోవైపు నగరాల్లో పేద కార్మికులుగానూ రూపాంతరం చెందారు.

దేశానికి స్వాతంత్ర్యం లభించిన తర్వాత కూడా ఈ సామాజిక వ్యవస్థలో మౌలికమైన మార్పులు సంభవించలేదు. జాతీయ బూర్జువా వర్గం అధికారాన్ని హస్తగతం చేసుకోవడం ద్వారా కొన్ని సంస్కరణలు మాత్రమే ప్రవేశపెట్టగలిగింది. కానీ సమూలమైన మార్పులకోసం పాటుపడటం లేదు.

భారత రాజ్యాంగంలో సమానత్వం, సౌభ్రాతృత్వం, సామ్యవాదం, లౌకికతత్వం వంటి ఎన్ని పదాలను పొందుపరచుకున్నా పాలకవర్గాలు తమ ప్రయోజనాలను కాపాడుకోవడం కోసం శ్రామికులను, పీడితులను నిరంతరం విడదీస్తూనే వున్నారు.

వర్ణాలు (రంగులు) సమసిపోయినా, వర్ణవ్యవస్థ కొనసాగుతున్నది. కులాలకు ఆయువుపట్టు వంటి వృత్తులు సర్వజనీనమైనా కులవ్యవస్థ వృద్ధి చెందుతున్నది. భూస్వామ్య వుత్పత్తి సంబంధాల్లో అనేక మార్పులు సంభవించినా భూస్వామ్య సామాజిక వ్యవస్థ పటిష్టమౌతూనే వుంది. పారిశ్రామికీకరణం, విద్యావకాశాల పెరుగుదల, ప్రజాస్వామ్య వాతావరణం వంటి అభ్యుదయకరమైన పరిణామాలు సంభవిస్తూ కులం అస్థిత్వాన్ని కోల్పోవలసిన పరిస్థితులు ఏర్పడినప్పటికీ, కులం నశించకుండా ఇంకా వికసిస్తున్నది. కుల సంఘాలు, కులం పత్రికలు, కుల భవనాలు, కుల హాస్టళ్ళు, కుల విద్యాలయాలు రోజు రోజుకూ అధికమౌతున్నాయి. కమర్షియల్ బూర్జువా శక్తులకు, రాజకీయ నాయకులకు వీటి అవసరం ఉన్నందున, వారి ఆర్థిక సహాయ సహకారాలతో ఇవి విస్తరిస్తున్నాయి. విద్యార్థి సంఘాల ఎన్నికలు మొదలుకొని విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుల నియామకం దాకా; గ్రామ పంచాయతీ ఎన్నికలు మొదలుకొని రాష్ట్రపతి అభ్యర్థిత్వం దాకా నేడు 'కులం' ప్రధానమైన భూమికను నిర్వహిస్తున్నది. ఇది మనకు ఇష్టమున్నా కష్టమున్నా జీవిత వాస్తవికతగా కళ్ళముందున్నది.

## కుల నిర్మూలన ప్రయత్నాలు

కుల వ్యవస్థపై తిరుగుబాటుగా బౌద్ధం, జైనం, శైవం, వైష్ణవం వంటి మతోద్యమాలు ఈ దేశంలో తలెత్తినప్పటికీ అవి కులాన్ని నిర్మూలించలేక పోయాయి. కాలక్రమంలో అవి మరిన్ని కొత్త కులాలను ఏర్పరచి వర్ణవ్యవస్థలో లీనమయ్యాయి.

మధ్యయుగాలలో కుల వ్యతిరేక ఉద్యమం భక్తి ఉద్యమంగా సాగింది. రామానుజుడు, నామ్‌దేవ్, ఏక్‌నాథ్, తుకారాం, బసవేశ్వరుడు, కబీర్, నానక్, జ్ఞానేశ్వర్, నారాయణ్ గురు మొదలైనవారు భక్తి ద్వారా కులతత్వాన్ని నిరసించారు. ఈ భక్తి ఉద్యమకారుల్లో ఎక్కువమంది అట్టడుగు కులాల వారే. దేవుని ముందు అందరూ సమానులే అనే భావాన్ని ప్రచారం చేసిన ఈ భక్తి ఉద్యమాలు కూడా కులాన్ని నిర్మూలించలేక పోయాయి. ఆంధ్రప్రాంతంలో బ్రహ్మనాయుడు, వేమన, పోతులూరి వీరబ్రహ్మం మొదలయినవారు కులతత్వాన్ని నిరసించారు.

కుల విభేదాలను నిరసిస్తూ, నిమ్న వర్గాల ఉద్ధరణకోసం మహారాష్ట్రలో మొదటిసారిగా జ్యోతి బాపూలే (1827-1890) తిరుగుబాటుకు పిలుపు నిచ్చాడు. సవర్ణుల యుక్తితో కూడిన ఆధిపత్యం, నిమ్న వర్గాల అజ్ఞానం ఇక్కడి సాంఘిక వికృతాలకు మూలమని భావించాడు. 'సత్యశోధక్ సమాజ్' అనే సంస్థను స్థాపించి దళిత చైతన్యానికి విశేషమైన కృషి చేశాడు.

ఆ తరువాత మహారాష్ట్ర, ఉత్తర భారతం, కేరళ, కర్నాటక, తమిళనాడు, ఆంధ్ర ప్రాంతాల్లో సాంఘిక అసమానతలకు వ్యతిరేకంగా విభిన్న పద్ధతుల్లో ఆందోళనలు జరిగాయి.

డా॥ బి.ఆర్.అంబేద్కర్ కుల నిర్మూలన కోసం, దళితుల సర్వతోముఖ వికాసం కోసం విశేషమైన కృషి చేశాడు. అస్పృశ్యతపై ఉద్యమించాడు. దళితులకు రాజ్యాంగపరమైన రక్షణలు, రిజర్వేషన్లు, రిజర్వుడ్ నియోజకవర్గాలను సాధించాడు.

బ్రహ్మసమాజం, ఆర్య సమాజం, కుల నిర్మూలన సంఘాలు కుల వ్యవస్థను నిరసించినప్పటికీ, కులాన్ని నిర్మూలించలేకపోయాయి.

## ప్రగతిశీల శక్తుల ముందున్న ప్రస్తుత కర్తవ్యాలు

ఈనాడున్న 'కుల వ్యవస్థ' దేశ వ్యాప్తంగా కుల కలహాలకు, కుల చైతన్యానికి, కుల దురహంకారానికి, అన్యకుల ద్వేషానికి ఉసికొల్పుతున్నది.

భారతీయ సంస్కృతిని నిర్వీర్యపరుస్తున్న వ్రణం 'కులం'. బ్రాహ్మణ్య ఆలోచనాధార జాతికి విధించిన శాపం 'కులం'.

చరిత్రను కుల వ్యవస్థ దృక్కోణంతో కాక, కుల నిర్మూలన దృక్పథంతో తిరగరాయవలసిన అవసరం ఉంది.

సాహిత్యంలోనూ, సకల సామాజిక చైతన్య రూపాల్లోనూ సాంస్కృతిక విప్లవం తేవాల్సిన సమయం ఆసన్నమయింది.

అంతిమంగా ఏదో ఒక కుల ప్రయోజనాలనో, కొన్ని కులాల సమాఖ్య ప్రయోజనాలనో కాకుండా దేశంలోని మెజారిటీ ప్రజలైన పీడిత తాడితుల ప్రయోజనాలను కాపాడే చైతన్యం సృష్టించాల్సిన అవసరం ఉంది.

మనం ఎవరి పక్షం? మన దిశ ఏది? మన పోరాటాల ఫలితం ఎవరికి దక్కాలి??? వర్ణ పోరాటమా? వర్గ పోరాటమా??? వర్ణాలను విస్మరించే వర్గపోరాటమా? వర్గ స్పృహలేని వర్ణపోరాటమా???

ఇవి మన ముందున్న తక్షణ సమస్యలు. కొందరు వర్ణ పోరాటమే తక్షణ కర్తవ్యమంటున్నారు? మరి కొందరు వర్గపోరాటం ద్వారానే కులం నిర్మూలింపబడుతుం దంటున్నారు.

ఈ రెండు ధోరణులూ సమస్యను పూర్తిగా పరిష్కరించలేవు; పాక్షిక ప్రయోజనాన్ని మాత్రమే సాధించగలుగుతాయి.

## వర్గపోరాటంలో భాగంగా కుల నిర్మూలన పోరాటం

కులం అస్తిత్వాన్ని గుర్తించని వర్గదృష్టి అంధప్రాయం. వర్గ దృష్టిలేని కుల చైతన్యం వంధ్య ప్రాయం.

సామాజిక న్యాయం, సర్వమానవ సమానత్వం అనేవి నేడు మన ముందున్న తక్షణ లక్ష్యాలు. వీటిని సాధించడానికి వర్గపోరాటంలో భాగంగా కుల నిర్మూలన పోరాటాన్ని కొనసాగించాల్సి వుంటుంది.

తెలంగాణా సాయుధ పోరాటకాలంలోనూ, వామపక్ష ప్రజా సంఘాల నిర్మాణంలోనూ, వివిధ వామపక్ష ఉద్యమాల్లోనూ, నక్సలైట్ ఉద్యమాల్లోనూ అన్ని కులాలూ కలిసి పోరాడాయి, పోరాడుతున్నాయి. పీడిత వర్గ సమరశీలతను ప్రదర్శిస్తున్నాయి.

వెట్టిచాకిరి నిర్మూలన, భూపంపకం, భూస్వామ్య వ్యతిరేకత వంటి వాటిని శ్రమజీవులు సమైక్యంగా ప్రదర్శిస్తున్నారు.

ఉద్యమకారులు పుట్టిన కులాన్ని బట్టి కాక, ఉద్యమనిబద్ధత, వారి ఓరియంటేషన్ గీటురాయి కావాలి.

## కుల ప్రాతిపదికపై పోరాటాలు హానికరం

కులపోరాటాలు కులాల విస్తృతికీ, కుల దురహంకారానికీ, అన్యకుల ద్వేషానికీ తోడ్పడతాయి.

కుల నిర్మూలన పోరాటాలు ప్రజాస్వామికీకరణకూ, ప్రగతిశీల వుద్యమానికి వుపయోగపడతాయి.

దళితులు, ఉన్నత కులాల్లో పుట్టిన పేదవర్గాలు, పీడిత వర్గ పక్షపాతం వహించే మేధావులు, శ్రమజీవులు కలిసి వర్గ దృక్పథంతో కుల నిర్మూలన వుద్యమాలు నిర్వహించాల్సి వుంది. ప్రజా సంఘాల్లో క్రియాశీలంగా పాల్గొంటూ నాయకత్వ స్థాయికి ఎదిగి, పోరాటాలు నిర్వహించాల్సి వుంది.

## దళితులలో నూతన సంపన్న వర్గం

దేశ స్వాతంత్ర్యానంతర కాలంలో విద్యావకాశాల పెరుగుదల, రాయితీలు, సబ్సిడీలు, రిజర్వుడ్ నియోజకవర్గాల ద్వారా ఎన్నికయ్యే అవకాశాలు వినియోగించుకొని దళితుల్లోనే ఒక వర్గం నూతన ధనిక వర్గంగా రూపొందింది. కొన్ని కుటుంబాలు పారిశ్రామిక బూర్జువా వర్గంగానూ, వాణిజ్య బూర్జువా వర్గంగానూ, ఆర్థిక, రాజకీయ బలాన్ని సంతరించుకుంటున్నాయి. 'దళితులకే రాజ్యాధికారం' నినాదం ఈ నూతన ధనిక దళిత వర్గానికి రాజ్యాధికారాన్ని కట్టబెట్టే ప్రమాదముంది. వర్గదృష్టిని వదులుకొని కేవలం కులదృష్టితో సాగడం ఈ ప్రమాదకరమైన దిశను సూచిస్తున్నది.

మరొకవైపు దళితేతర పేదవర్గాలు, శ్రామిక వర్గాలు కొన్ని దళితానుకూల స్పృహను ప్రదర్శించడం చరిత్రలో చూస్తున్నాం. రిజర్వేషన్ అనుకూల ఉద్యమాల్లోను, దళితులపై దాడులను ఖండించడంలోనూ దళితేతర శ్రామిక వర్గాల పాత్ర విస్మరింపరానిది.

దళిత వర్గ రిజిడిటీవల్ల దళితేతరుల్లో ఉన్న ప్రగతిశీల శక్తులను దూరం చేసుకోవడం, దళితేతర పేద వర్గాలను శత్రువులుగా చూడడం ప్రమాదకర ధోరణి. చేజేతులా దళితేతర పేద వర్గాలను ఆయా ఉన్నత కులాల పెట్టుబడిదారీ వర్గం కొమ్ముగాసే పరిస్థితులు కల్పించడం వామపక్ష ఉద్యమానికి విఘాతం కలిగిస్తుంది.

## ఒక ప్రమాదకర ధోరణి

ఫెమినిస్టు ఉద్యమం పేరిట స్త్రీలను వర్గపోరాటాలకు దూరం చేయడంగానీ, దళిత కుల పోరాటం పేరిట దళితులను పీడిత వర్గ పోరాటాల నుండి వేరుచేయడం గానీ హర్షణీయమైన పరిణామాలు కాకపోగా హానికరమైనవి కూడా.

దళితులు పీడిత వర్గ ఉద్యమ స్రవంతికే దూరం కావడంకానీ, ప్రగతిశీల ఉద్యమాలు దళితులను విస్మరించడంకానీ సరైన పద్ధతి కాదు. డా॥ అంబేద్కర్ ఆలోచనా విధానంలోని అభ్యుదయానుకూల భావజాలంతో సాంఘిక విప్లవాన్నీ, మార్క్సిజం - లెనినిజం వెలుగులో ఆర్థిక విప్లవాన్ని ద్విముఖ పోరాటంగా సాగించి రాజకీయ అధికారాన్ని శ్రమజీవులు సాధించాల్సి వుంది.

# కులం–వర్గం–వాటి అంతస్సంబంధాలు

శ్రీ కత్తి పద్మారావు

భారత సమాజం కుల దొంతరలతో నిండి అతి ప్రాచీన కాలం నుండి అసమత్వాన్ని రూపొందించుకొని వుంది. వర్ణ, కుల అస్పృశ్యతలతో ఉన్నత, మధ్య, అధమ వరుసలుగా పేర్చిన నిర్మాణముతో వుంది. ఆర్థికంగా కూడా భారతదేశం ఈ అసమానతలతో నిండి వుండడానికి బలమైన కారణం ఈ కులదొంతరలే. పేదరికం కుల సమాజంతో అంతస్సంబంధం కలిగి సామాజిక ఆర్థిక రూపాలుగా పెనవేసుకొని వున్నాయి.

విస్తృతమైన సాంఘిక ఆర్థిక అంతరాలు వాటి రూపాలను మార్చుకుంటూ పెరుగుతూ వున్నాయి. కాని తరగటంలేదు. భారతదేశంలోని రాజకీయ, ఆర్థిక, కుల వైరుధ్యాలకు వాటి మార్పులో జరుగుతున్న జాప్యానికి సాంఘిక పునాదే బలమయిన కారణంగా వుంది.

మానవ శాస్త్రజ్ఞులు, సాంఘిక శాస్త్రజ్ఞులు, ఆర్థికవేత్తలు ఈనాడు కులానికి, వర్గానికీ మధ్య వుండే అంతస్సంబంధాల మీద పెద్ద చర్చ కొనసాగిస్తూ వున్నారు. కేవలం ఆర్థిక సంబంధాలే సమాజ పరిణామానికి మూలమని భావించేవారు కూడా పునరాలోచిస్తూ వున్నారు. ఈ నేపథ్యంలో ఈ చర్చకు మూల అంశాలన్నింటిమీద వాటి పరస్పర సంబంధాల మీద, వైరుధ్యాలమీద శాస్త్రీయ పరిశోధనకు పూనుకుందాం.

## కులం–వర్ణం

కులానికీ, వర్ణానికీ వున్న సంబంధాన్ని సామాజిక శాస్త్ర పునాదిగా చర్చిస్తేగాని కులానికి వున్న పట్టు మనకు అవగతంకాదు. వర్ణ శబ్దం ఋగ్వేదంలో ప్రాథమికంగా ఆర్యులకు–దస్యులకూ తేడాని తెల్పేదిగా వాడబడింది. ఋగ్వేదం పదవ మండలం రచనా కాలానికి నాలుగు వర్ణాలు పేర్కొనబడ్డాయి. నాలుగు వర్ణాలలో మూడు ఆర్యవర్ణాలు కాగా, నాల్గవది ఆర్యేతర వర్ణం. అందుకే ఈ నాల్గవ వర్ణంవారు బ్రహ్మ పాదాలనుండి జనించారని చెప్పబడింది. వీరు ఆర్య సమాజంలో కలిసి నాల్గవ మెట్టులో జీవించే సామాజిక చారిత్రక పరిస్థితులు ఏర్పడ్డాయి. అయితే ఈ వర్ణ సమాజానికి దూరంగా జీవించినవారు ఛండాలురు, పిపీలకాదులు, నిషాదులు.

పంచములుగా పిలవబడి ఆ తరువాతి కాలంలో అస్పృశ్యులుగా పిలవబడినారు. వీరిని ఋగ్వేదకాలంలో వైదికార్యులు అస్పృశ్యులుగా పరిగణించలేదు. వీరిని పంచజనులుగా మాత్రమే పరిగణించారు. ఈ విషయాన్ని విశ్లేషిస్తూ G. S. GHURYE ఇలా వ్యాఖ్యానించారు :

"It is more reasonable to hold that both these groups chandala and pipilikas were sections of the aborigins that were, for some reason or another, particularly despired by the Aryans. The Nishadas, on the other land, soon to have been a section liked by the Aryans, probably because they were amenable to their civilised Nations. The vedic expression panchjanah is explained by tradition, belonging to the latter part of the period, to mean the four varnas and Nishadas, a fact which shows that these people had, by this time, became quite acceptable to the Aryans. [1]

1. "Social Stratification" Edited by Dipankar Gupta page 29.

మిర్యై, వైదిక ఋషులు వీరిని పంచమహాజనులుగానే గుర్తించారని చెప్పాడు. దీనినిబట్టి అస్పృశ్యతాభావం వీరిపై ఆ కాలంలో రుద్ధబడలేదని అర్థమవుతుంది.

వర్ణవ్యవస్థ నాలుగు వర్ణాలను పేర్కొంది. అవర్ణులుగా పంచములను పేర్కొంది. అయితే ఆ విభజన సిద్ధాంతం ప్రయోగంలో భారతదేశంలో శాఖోపశాఖలుగా విస్తరించింది. ముఖ్యమైన భాషలు మాట్లాడే ఒక్కొక్క జాతిలో కనీసం రెండు వందల కులాలు, మూడు వేల ఉప కులాలుగా రూపొందాయి. అవి శాఖలుగా, ఉప శాఖలుగా వంశపారంపర్య తత్వంతో అంతశ్శాఖ వివాహ సంబంధాలు మాత్రమే కలిగి కుంచించుకుపోయాయి. ఈ వర్ణతత్వం యొక్క ప్రభావం కులం పునాదులలో కూరుకుపోయింది. ఆర్యులు వర్ణతత్వాన్ని భారతదేశానికి మోసుకురాక ముందు ఈ విధమైన విభజన భారతదేశంలో లేదు. ఈ కులతత్వం ఏవిధంగా పరివ్యాప్తమయ్యిందో N.K. DUTTA "ORIGIN AND GROWTH OF CASTE IN INDIA"లో యీ విధంగా వ్యాఖ్యానించాడు.

"Members of a caste can not marry outside it; There are similar but less regid restictions on eating and drinking with a member of another caste; There are fixed occupations for many castes; There is some hierarchical gradation of castes, the best recognised position being that of the Brahmans at the top: Birth determines a man's caste for life unless he be expelled for violation of its rules; Other wise transition from

one caste to another is not possible' The Whole system turns on the prestige of the Brahman".[1]

1. "Caste in India"- J. H. Hutton page 49.

శ్రీ దత్ "ఇక్కడ కులాలుగా రూపొందినవారు ఇతర కులాలవారిని పెళ్ళి చేసుకొనకూడదని, ఆహార పానీయాలుకూడా స్వీకరించకూడదని, వేరు వేరు కులాలకి వేరు వేరు వృత్తులను నిబద్ధించడం, ఈ కులాలు అంతరాలు బలపడటానికి కారణాలు" అని వ్యాఖ్యానించారు. బ్రాహ్మణులు అత్యున్నత స్థానాన్ని ఆక్రమించి ఈ కులతత్వాన్ని ఎలా రూపొందించారో శ్రీ దత్ విశ్లేణాత్మకంగా వివరించారు.

"హిస్టరీ ఆఫ్ హిందూ ఇంపీరియలిజమ్" అనే పుస్తకంలో Swamy Dharma Theertha "ఈ బ్రాహ్మణ పురోహిత వర్గం ఈ కులతత్వాన్ని భారత ప్రజల మెదళ్ళలోకి చొప్పించడానికి, మూఢ విశ్వాసాలను స్వేచ్ఛారహిత ఆలోచనా విధానాన్ని, క్రూర ఆచార పద్ధతిని ఎలా కూర్చారో విశ్లేషించారు.[2]

2. "History of Hindu Imperialisum" - Page 32.

అయితే కులం పునాది చెడకుండ పై కులాల పురుషులు క్రింది కులాల స్త్రీలను వివాహం చేసుకునే పద్ధతి కొనసాగింది. ఈ విషయంమీద విశ్లేషిస్తూ G. S. Ghurye "Caste and Race in India" అనే గ్రంథంలో పై మూడు వర్ణాలైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు శూద్ర స్త్రీని చేసుకొనవచ్చును. కాని శూద్ర పురుషుడు మాత్రం పై మూడు వర్ణాల స్త్రీలను వివాహము చేసుకొనకూడదని, అలా చేసుకోవడం పెద్ద పాపంగా పరిగణించారని, పై మూడు వర్ణాల స్త్రీలను వివాహము చేసుకొనకూడదని, అలా చేసుకోవడం పెద్ద పాపంగా పరిగణించారని, పై మూడు వర్ణాలలో కూడా బ్రాహ్మణ పురుషుడు క్షత్రియ స్త్రీని, క్షత్రియ పురుషుడు వైశ్య స్త్రీని చేసుకొనవచ్చును. కాని వైశ్య పురుషుడు క్షత్రియ స్త్రీని, క్షత్రియ పురుషుడు బ్రాహ్మణ స్త్రీని చేసుకోకూడదని నిషేధించారని వివరించారు.[3]

3. " Caste and Race in India:" - G. S. Ghurye page 173(1979).

మనుస్మృతికాలం వచ్చేనాటికి ఇవన్నీ అనులోమ, విలోమ వివాహ పద్ధతులుగా నిర్ణయించబడినాయి. పై వర్ణాల పురుషులు క్రింది వర్ణాల స్త్రీలను వివాహం చేసుకోవడం అనే పద్ధతి పితృస్వామిక వ్యవస్థ కొనసాగింపే. పై వర్ణం పురుషుడు క్రింది వర్ణం అమ్మాయిని చేసుకున్నప్పుడు ఆ వర్ణంలోనే ఆ అమ్మాయిని కలుపుకోవడం జరిగేది. మనుస్మృతి కాలం వచ్చేనాటికి వర్ణాంతర వివాహితుల సంతానం క్రొత్త జాతులుగా ఏర్పడ్డాయి తప్ప అవి వర్ణరహిత సమాజానికిదోహదం చేయలేదు. వర్ణాలు, కులాలు భారతదేశంలో ప్రతీరూపంలో పెంచారే తప్ప నిర్మూలించే ప్రయత్నానికి వైదిక సమాజం పూనుకోలేదు. అందుకే G S. Ghurye "ఈ కులం ఆర్య సంస్కృతి పునాదిగా గల్గిన బ్రాహ్మణత్వానికి పుట్టిన బిడ్డ" అంటూ యిలా వ్యాఖ్యానించాడు.

I may conclude that caste in India is a Brahmanic child of the INDO ARYAN culture cradied in the land of the Gangas and the Jamna and thence tranfered to other parts of the country".[1]

1. Caste and Race in India- G.S. Ghurye Page 176 (1979)

G. S. Ghurye అన్నట్లుగా భారతీయ సంస్కృతి మొదటిగా విస్తరించిన సింధు నాగరికత విస్తరిల్లిన ప్రాంతంలో ఈ కులం ప్రస్తావనలేదు. ఇది గంగ, యమునల మధ్య విస్తరించిన ప్రాంతం నుండే పరివ్యాప్తం చెందింది.

ఈ వర్ణ పద్ధతిని కొనసాగించడం కోసం ఒకే కులంలో వివాహ పద్ధతిని అనుసరించడమేగాక ఆహార పానీయాల నిషేధంపై మూడు వర్ణాలు శూద్ర వర్ణానికి అమలు జరిపారు. ఇక పంచముల సంగతి సరేసరి.[2] దక్షిణ భారతదేశానికి ఆర్య సంస్కృతి వచ్చే వరకూ ఒక జాతి నుంచి మరొక జాతికి ఆహార పానీయాలు స్వీకరించడంలో ఎటువంటి నిషేధాలు లేవు. దక్షిణా పథానికి ఈ నిషేధాలను పరివ్యాప్తం చేసిందికూడా ఆర్యులే. ఈ నిషేధంలో అంతర్గర్భితంగా దాగివున్న అస్పృశ్యతా భావం పంచమ జాతులమీద రుద్దకముందు శూద్ర జాతులపట్ల ఆర్య వర్ణాలవారు అమలు జరిపారు. డాక్టర్ బి. ఆర్. అంబేద్కర్ ఇంకా లోతుగా ఆలోచించి ఆ అస్పృశ్యతా భావం త్రైవర్ణాలలో ఒకరిలో ఒకరికి అమలు జరిగేముందు ఒకే బ్రాహ్మణ కుటుంబంలో బ్రాహ్మణ స్త్రీకి బ్రాహ్మణ పురుషునికి అమలు జరిగిందని విశ్లేషించారు. తన "అస్పృశ్యులెవరు?" అనే పుస్తకంలో.

2. A. E. Crailey - "The Mystic Rose" Page 162.

బ్రాహ్మణ జాతి యొక్క మనుగడ అస్పృశ్యతను అమలు జరపడంలోనే వుందని గమనించి బ్రాహ్మణులు ఈ అస్పృశ్యతా భావాన్ని అన్ని కోణాల్లోనూ వ్యాపింపజేశారు. ఆర్యులు భారతదేశానికి వచ్చిన తర్వాతే ఆర్యులు- అనార్యులు, అస్పృశ్యత- స్పృశ్యత వంటి తేడాలు బాగా ప్రచారంలోకి వచ్చాయి. అంతకుముందు భారతదేశంలో ఎన్ని జాతులు వున్నా ఈ తారతమ్యాలు లేవు. వారంతా కలిసి జీవించడానికి ప్రయత్నించారు. బ్రాహ్మణులు తమలో తాము కూడా వివాహాలు చేసుకొనేవారు కాదు. వీరిలో అనేక గోత్రాలు వున్నాయి. ఈ గోత్రాల విధానం క్షత్రియుల్లో కూడా వుంది.

రాజపుత్రులలో ఈ గోత్ర విధానాన్ని బలంగా ఆచరించేవారు. రెస్లీ బీహారు రాజపుత్రులు గురించి చెబుతూ, వీరిలో ఒకే గోత్రంలోనే వివాహాలు జరిగేవనీ, ఇది చాలా కఠినంగా జరపబడేదని చెప్పారు. భట్టాచార్య "Hindu Castes and Sects" అనే పుస్తకంలో హిందూ గోత్ర విధానాన్ని ఈ విధంగా వివరించారు :

"Generally speaking of the gotra is a strictly exogranous group among Brahmans, though ever here castes are found in which the gotra, though existing is not the exogarnous unit for instance, the Sakadiripi Brahmans of Bihar are devided into PURS or Sections Which do not coincide with their gotras, here the PUR is the exogarnous unit and provided marriage takes place outside the PUR it may be with in the gotra, and a similar system is reported of the Saraswat Brahmans of the Punjab".

బ్రాహ్మణులు మూడు వేద శాఖలను అనుసరించి మూడు గుంపులుగా విడిపోయారు. ఋుగ్, యజు, సామమ్ అనే ఈ విభజన కేవలం పూజా విధానాలకు మాత్రమే. ఇంకా వారు భాషనుబట్టి, ప్రాంతాలనుబట్టి, ఆచారాలనుబట్టి చాలా ముఠాలుగా విడిపోయారు. ప్రతీ బ్రాహ్మణుడికీ ఒక గోత్ర నామం వుంటుంది. ఆ గోత్ర నామం పేరిట ఒక గృహ్య సూత్రం వుంటుంది. వాటిని బట్టి వీరి విభజన వుంటుంది. ఇందులో ప్రధానమైనవి ఎనిమిది : (1) అశ్వలాయన సూత్రం, (2) ఆపస్తంభ, (3) భరద్వాజ, (4) బోధాయన, (5) సత్యషాద, (6) విభానస, (7) కాత్యాయన సూత్రం, (8) వుహ్యయన సూత్రాలు మొదలయినవి. ఇవి వేద శాఖలనుండి వచ్చినవని వీరు చెబుతారు.

అంతేగాక ఈ ప్రధానమయిన ఏడుగురు ఋుషులలో వారు ఒక ఋుషికి అనుబంధంగా వుంటారు. (1) అత్రి, (2) భృగు, (3) కుత్స, (4) వశిష్ఠ, (5) గౌతమ, (6) కాశ్యప, (7) అంగీరస, ఈ ఋుషులు కాక అగస్త్యకూడ వున్నాడు అని కొందరు అంటున్నారు. ఈ ఋుషుల పేరు మీద వున్నటువంటి గోత్రాలు దక్షిణ భారతదేశంలోనే రెండు వందల ముప్పై అని ఎడ్గార్ త్రస్టన్ వివరించాడు.

ఈ వర్ణాచారాల విధానాన్ని బ్రాహ్మణులు ఒక జీవన విధానంగా మలచుకున్నారు. ఒక పిల్లవాడు పుట్టిన దగ్గరనుండి పెరిగే వరకూ అతని కుల పద్ధతిలో పెంచడానికి వారు నియమాలు రూపొందించారు. అన్నప్రాసనం, నామకరణం, జాతక కర్మం ఆ తర్వాత ఉపనయనం. జాతక కర్మం చేసేటప్పుడు నేతిని, తేనెను నాలుకకు నాకించి వందేళ్ళు బ్రతకమని ఇంద్రుడు, సరస్వతి, అశ్వని నిన్ను సంరక్షిస్తారని చెప్తారు. నామకరణం చేసేటప్పుడు కూడా అతని చెవిలో అతని పేరు చెప్పి ఇంద్రుడు నీకు విజ్ఞానాన్ని కల్గిస్తాడని దీవిస్తారు. అన్న ప్రాసనం అంటే బిడ్డపుట్టిన ఆరు నెలల తర్వాత అన్నం తినిపిస్తూ ఒక మంత్రాన్ని చదువుతారు.

"Agni who lives on plants, Soma who lives on Soma Juice, Brahmans who live on the Vedas and Devatas who live on amrutham (ambrosia) may they bless you. As the earth gives food to plants and water, so I give you this food. May these waters and plants give you prosperity and helth".

ప్రకృతి శక్తులను దేవతలుగా స్తుతించి ఆర్య సంస్కృతి జీవితంలోని ప్రతి అడుగులో బ్రాహ్మణులు వారికి సంతోషాన్ని కలుగజేస్తారు. ఎనిమిది సంవత్సరాల వయస్సులో ఉపనయనంతో అతన్ని బ్రాహ్మణీకరిస్తారు. ఈ బ్రాహ్మణ సంస్కృతిలో పెరిగిన ఎంత గొప్పవాడైనా ఆ సంస్కృతినుండి తప్పుకోవడం కష్టం. బ్రాహ్మణులలో ఎంతోమంది సంస్కర్తలు ఆవిర్భవించారు. కాని వారిలో ఏదో ఒక సందర్భంలో ఈ బ్రాహ్మణ సంస్కృతి ప్రభావం కన్పిస్తూనే వచ్చింది. ఈ వర్ణతత్వం ఒక ఊబి వంటిది. దానిలో కూరుకుపోవడమే కాని, కూరుకుపోయిన వాడు పైకి లేవలేకపోతున్నాడు. అంటే ఈ కులతత్వాన్ని రూపుమాపాలంటే వర్ణతత్వాన్ని దాని పునాదిగా వున్న బ్రాహ్మణ హిందూ సంస్కృతిని పునాదులతో పెకలించాల్సిన అవసరం వుంది.

వర్ణంలోనూ, వ్యక్తిలోనూ, కుటుంబంలోనూ, గోత్రంలోనూ మొత్తంలో ఈ మార్పు రావాలి అంటే ఉపరితలంలో వున్న రాజ్యాంగాలు, రాజ్య శాసనాలు వాటిని మార్చలేవు. భారతదేశంలోని రాజదండాలు సుమారు రెండు వేల అయిదు వందల సంవత్సరాలపైన వర్ణతత్వాన్ని స్థిరీకరించడం కోసం ప్రయత్నం చేశాయి. హిందూ సంస్కృతేతరులయిన మొగలాయిలు, ఆంగ్లేయులు ఈ వర్ణతత్వాన్ని తమ పాలనకు అనుకూలంగా ఉపయోగించుకున్నారేగాని, పునాది జోలికేమీ పోలేదు. అందుకే మొగలులు వ్యాప్తి చేసిన ఇస్లాంలోను, ఆంగ్లేయులు వ్యాప్తి చేసిన క్రైస్తవంలోను కులం చోటు చేసుకున్నాయి. కాని హిందూమతంలో వున్న కులతత్వాన్ని వారు మార్చలేకపోయారు. దీనంతటికీ కారణం హిందూ పునరుద్ధరణ వాదం నిరంతరం తమ ప్రచారంలోను, ఆచరణలోను కొనసాగడమే.

## శూద్రులలో స్వసంఘ పౌరోహిత్యాలు యజ్ఞోపవేతాలు

ఇంతేగాక శూద్రులుగా చెప్పబడుతున్న నాటి వర్గం. బ్రాహ్మణ సంస్కృతికి ఆకర్షించబడి ఆ చట్రంలో పరిభ్రమిస్తూ వుంది. బ్రాహ్మణులతో సమానం కాపటానికి పౌరోహిత్యాన్ని ఆచరించడం, బ్రాహ్మణ నామాన్ని కులంలో

చేర్చుకోవడంద్వారా తమ ఆధిక్యతను ప్రకటించుకోవడం చేశారు. ఆంధ్రదేశంలో పద్మసాలీలు జంధ్యాలు ధరించారు. మంగలులు నాయీ బ్రాహ్మణులుగా, కంసాలులు విశ్వ బ్రాహ్మణులుగా పేర్లు ధరించి బ్రాహ్మణీకరణకు సిద్ధపడ్డారు. ఇదే విధంగా పంచములుగా పిలువబడుతున్న దళితులలో కూడా మాలదాసర్లు, మాదిగ దాసర్లు రూపొందారు. అయితే ఈ పేర్లవల్ల, ఇలా జంధ్యాలు ధరించడంవల్లా కులాధిక్యత వీరికేమీ రాలేదు. లింగాయతులు కూడా మేము బ్రాహ్మణులతో సమానమని ప్రకటించుకున్నారు. చివరకు బ్రాహ్మణులు వండిన ఆహారాన్ని భుజించడానికి నిరాకరించారు. కానీ మార్పేమీరాలేదు. దీనికి కారణం శూద్ర కులాలను బ్రాహ్మణులు అనేక మాయలలో ముంచడమే. ప్రతి కులం మరియొక కులం కంటే అధికమనే భావన కలిగించారు. ప్రతి కులానికీ మీకంటే వేరొక కులం తక్కువదని బోధించారు ఎవరు ఎవరికంటే ఎక్కువ, ఎవరు ఎవరికంటే తక్కువ అనే మీమాంస శూద్రులలో అనేకసార్లు అలజడులకు కారణమైంది. హిందూ సంస్కృతి ఒకరితో ఒకరు కలవడానికి వీలులేని అంతరం వీరిలో రూపొందించింది. ఇంతేగాక శాకాహారులు, మాంసాహారులకంటే పవిత్రులని శూద్రులలో శాకాహారులు బ్రాహ్మణులతో గౌరవింపదగినవారని హిందూ మతవాదులు ప్రచారం చేశారు. ఒక వృత్తిని ఆచరించేవాడు అదే వృత్తిని ఆచరించే మరొకనికి వృత్తి ధర్మాన్ని నిర్వర్తించకూడదనే నమ్మకం ఏర్పరచారు. ఈ ఆచారం ఇప్పటికీ కొన్ని వృత్తులలో ఆచరణలో వున్నది. రజకులు రజకులకు బట్టలుతకకపోవడం కొన్ని చోట్ల ఈనాటికీ అనువర్తింపబడుతోంది. శూద్రులందరూ దళితులకు తమ వృత్తి ధర్మాలను చాలా ప్రాంతాలలో నిర్వర్తించడంలేదు. దీనంతటికీ కారణం బ్రాహ్మణ సంస్కృతి దాని విషపు పునాది ఇంకా శూద్ర కులాల మీద బలంగా వుండడమే.

## కులం పట్టు పెంచిన వివాహ పద్ధతి

G. S. Ghurye "ఫ్యూచర్ ఆఫ్ ది కాస్ట్ సిస్టం"లో తన తెగవారినే పెండ్లి ఆడే విధానం కులచట్రం బిగింపుగా ఎలా మిగిలిపోయిందో వివరించారు. [1]

1. "Social Stratification" Features of the caste system - G. S. Ghurye Page 46.

Most of the groups, whose feature. I have attempted to charectarise above, are further divided into a number of sub-groups every on of which forbids its members to marry persons from out side it. Each of these groups popularly known as sub-castes, is such a dominant aspect of caste Society that an eminent Sociolagist is lead to regard endogarnous as the es ence of the caste system".

కులాలు, ఉప కులాలు వాళ్ల కులంలోనే పెండ్లి చేసుకొనే పద్ధతి కుల చట్రాన్ని మరింత జటిలపరచింది. ఉపరితలంలో ఎన్నో మార్పులు వస్తున్నా, అంతర్గతంగా కులం పునాదులు కదలకపోవడం యిదొక బలమైన కారణం. ఈ వివాహాలకు సంబంధించి ప్రతీ కులానికి వేరు వేరు కట్టుబాట్లు, వేరువేరు ఆచార సంప్రదాయాలు రూపొందించబడి వుండటం కూడా ఈ కులరూపం చెరగకుండావుండడానికి ఒకకారణం. వర్ణాంతర వివాహాలు ప్రేమించి పెళ్లి చేసుకొనేవే కాని కులం పోవాలని సమాజంలోని పెద్దలు ఆలోచించి చేసేవికాదు. పెండ్లిలో భోజనాలకు ఆర్థిక స్థాయినిబట్టి ఆహ్వానించుకున్నా అది భోజనాలవరకే పరిమితంకాని కులపద్ధతిని మార్చడానికి కాదు. ఆంధ్రరాష్ట్రంలో కమ్మ, రెడ్డి, రాజు, వెలమ ఆర్థికంగా ఒకే స్థాయిలో వుంటారు. వారు పెళ్లిళ్లకు ఒకరినొకరు భోజనాలకు పిలుచుకుంటారు. కాని ఒక కులం మరొక కులంవారిని వివాహం చేసుకోరు. పైగా ఆ విషయంలో జరిగే చర్చలు కూడా మీ కులంలో అయితే ఇలా వుంటాయి. మా కులంలో అయితే యిలా వుంటాయి. అనే విధంగా సాగుతాయి. అలాగే దళితులలో కూడా మాల, మాదిగ కులాలు సామాజికంగా, ఆర్థికంగా ఒకే స్థాయిలో వుంటాయి. వీరు పెండ్లి భోజనాలకు పిలుచుకుంటారు. కాని రెండు కులాల మధ్య అంతర్ వివాహాలు లేవు. అలాగే నేత కార్మికులు అయిన పద్మసాలీలు, దేవాంగులు ఒకే వృత్తిలో వున్నా, కులాంతర వివాహాలు లేవు. కమ్మరి, కుమ్మరి, చాకలి, మంగలి ఇవన్నీ వెనుకబడిన కులాలుగా వున్నాయి. వీరి ఆర్థిక స్థాయి కూడా దగ్గర దగ్గర సమానమే. కాని వీరిలో అంతర్వివాహాలు మాత్రం లేవు. ఇది బ్రాహ్మణిజం ప్రభావం. ఒక కులానికి మరొక కులానికి మధ్య వివాహ సంబంధాలు లేకపోవడంవల్ల కులాల కులాల మధ్య అగాధం ఏర్పడుతుంది. మానవ సంబంధాలు పైపైకి కలిసి పోయినట్లు కన్పించినా అంతర్గతంగా పెనవేసుకోలేకపోతున్నాయి. ఇలాగే ఏనాదులు, ఎరుకలు మొదలగు గిరిజనుల జాతుల మధ్య కూడా కులాంతర వివాహాలు లేవు. కులాంతర వివాహాలు సిద్ధాంతం కోసమో, మానవ పునర్నిర్మాణం కోసమో చేసేవి చాలా తక్కువ.

ఇతర కులాలతో దళిత స్త్రీ లైంగిక సంబంధం పెట్టుకుంటే పెద్దలు పిలిచి తప్పు వేయడం ఇది కులానికి పరువు తక్కువని చెట్టుకు కట్టి అవమానించటం కూడా జరుగుతోంది. సంఘ పెద్దల పెత్తనం దొరతనానికి ఈ కులం ఒక పునాదిగా వుండటంవల్ల కుల చట్రం మారడానికి క్రింది కులాల పెద్దలు కూడా అడ్డు వస్తూంటారు. వీరి మూఢత్వంవల్ల ఉపకులాలు జటిలమై మాల, మాదిగ విభేదాలు రావడం కూడా జరుగుతోంది.

పైనుండి క్రిందిదాక ఈ అంతర్ కుల వివాహ పద్ధతి కుల చట్రాన్ని జటిలం చేస్తూ కులం రూపాన్ని మారకుండా, కుల పునాది కదలకుండా హిందూ సంస్కృతికి పెట్టని కోటగా

వుంది. ఇది భారత సమాజంలో మానవ సంస్కృతి వికాసానికి అవరోధంగా వుంది.

## పట్టణ సంస్కృతి–కులం

పట్టణాలలో కూడ ఈ కులతత్వం నిరాఘాటంగా కొనసాగుతూవుంది. పట్టణానికి ఎవరైనా వచ్చి జీవించే పౌర స్వేచ్ఛ వుంది. కాని ఈ పట్టణాలలోకి గ్రామాల నుంచి వచ్చి చేరిన వివిధ కులాల ప్రజలు తమ కుల సంస్కృతి బీజాలను నిక్షిప్తం చేసుకొనే వచ్చి జీవించుతూ వున్నారు. పెద్ద పెద్ద పట్టణాలలో జీవన విధానంలో కూడా అంతర్గతంగా కులం చోటుచేసుకొనే వుంది. బొంబాయిలో ఈనాటికీ బ్రాహ్మణ సంస్కృతి ఆధిక్యతతో మనకు కన్పిస్తుంది.

ఈ పెద్ద పట్టణాలలో అంతకుముందే కులపరమైన ప్రాంతాలు ఏర్పడి వుంటాయి. అన్ని కులాలు కలిసి జీవించే కాలనీల్లో తమ తమ కులం వారిని కలుసుకోవడానికి పెళ్లి ఒక సమావేశ కేంద్రంగా వుంటుంది. అమెరికాలో కూడా మన భారతీయులు కుల సంఘాలను ఏర్పాటు చేసుకున్నారు. కుల వివాహ వేదికలు వస్తున్నాయి. ఒకే కాలనీలో నివసించే వేరు వేరు కులాలవారు కొన్ని ఉపరితల సంబంధాలను పెట్టుకుంటారు. ఆర్థికంగా యిచ్చి పుచ్చుకుంటారు. పుట్టినరోజులకు వచ్చి పోతుంటారు. కాని పెళ్లి విషయం వచ్చేసరికి స్వంత కులంవారినే ఆ మహా పట్టణంలో వెతికి చేస్తారు. బొంబాయిలో వుండే మహర్‌లు ఆగ్రాలో వుండే జాతవులు పట్టణీకరించబడుతున్నారే గాని వారి కుల చట్రం బద్దలు కావటంలేదు. మద్రాసులో తోటీలుగా జీవిస్తూ వున్నారు. వారు నివసించే మురికివాడలు దుర్భర దారిద్ర్యానికి నిలయాలు. అలాగే ఢిల్లీ, కలకత్తా, బొంబాయి మురికివాడల్లో నివసించే, జీవించే కాందిశీకులు, దళిత కులాలు లొంభై శాతంగా వున్నారు. అంతేకాదు. పట్టణాల్లో క్రొత్త క్రొత్త రూపాల్లో కుల వ్యవస్థ కొనసాగుతూ వుంది.

## పారిశ్రామికీకరణ సైతం కులాన్ని కూల్చలేదు !

పారిశ్రామికీకరణ కూడా మనదేశంలో కులరూపాన్ని నాశనం చేయలేకపోయింది. పరిశ్రమల్లో పనిచేసే కార్మికులు వారి ఆర్థిక సమస్యల మీద కలిసి పనిచేస్తున్నారేకాని సామాజికంగా కలిసి జీవించలేకపోతున్నారు. అందుకే వారిలో కుల భేదం పోవడంలేదు. కులాంతర వివాహాలు జరగడంలేదు. పట్టణాల్లో వుండే బ్రాహ్మణులుకూడ ఉపనయనం చేసుకోకుండా వుండలేకపోతున్నారు. వీలున్నంతవరకూ తద్దినాలు, ఆబ్దికాలు అమలు జరుగుతూనే వున్నాయి. వ్రతాలు, నోములు కూడా చేస్తున్నారు. ఇవన్నీ కుల ఆచార పట్టును పెంచేవేకాని సడలించేవికావు. ఢిల్లీ నడిబొడ్డులోనైనా ఈ కుల కర్మకాండ జరిగిపోతూనే వుంది. పట్టణ సంస్కృతి కులానికి అడ్డు తగలడంలేదు. కుల విషవృక్షం భారతదేశంలోని ఏ నేలలోనయినా శాఖోపశాఖలుగా పెరుగుతోంది. ఇటీవల పట్టణాల్లోనే ఆర్.ఎస్.ఎస్. విశ్వ హిందూ పరిషత్ పెద్ద ఎత్తున అభివృద్ధి చెందుతోంది. హిందూ పునరుద్ధరణ వాదానికి ఈ సంస్థలు ప్రాణం పోస్తున్నాయి. పట్టణాల్లోని అగ్ర కులాలవారు ఈ సంస్థలను తమ ఆర్థిక శక్తితో పెంచి పోషిస్తూ వున్నాయి. వీరు రాజ్యం చేస్తున్న ప్రాంతాలలో కుల సంస్కృతి వేయిపడగల విష సంస్కృతిని వ్యాపింప చేస్తున్నాయి.

## ఆధునిక యుగంలో బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాలు – ఫలితాలు

దక్షిణ భారతదేశంలో బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమం బలంగా జరిగింది. దాని ఫలితంగా బ్రాహ్మణులు ఆర్థికంగా, రాజకీయంగా బాగా దెబ్బతిన్నారు. తమిళనాడులో పెరియార్ రామస్వామి నాయకర్, ఆంధ్రలో త్రిపురనేని రామస్వామి చౌదరి ఈ పోరాటాలను స్వీకరించారు. కేరళ, కర్నాటకలలో కూడా ఈ పోరాటాలు జరిగాయి. మహారాష్ట్రలో మహాత్మా, పూలే, డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ ఒక సాంఘిక విప్లవంగా ఈ పోరాటాన్ని ముందుకు తీసుకువచ్చారు. ఈ పోరాటాలవల్ల ఎన్నో పరిణామాలు సంభవించాయి. బ్రాహ్మణులు తమపైకి ఈ పోరాటాలు వచ్చి దూకినప్పుడు తలవంచారేగాని, వారి కులతత్వాన్ని వదులుకోలేదు. బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాల ద్వారా ఆధిపత్యంలోకి వచ్చిన శూద్ర కులాలన్నింటిలోను బ్రాహ్మణత్వ లక్షణాలే తిరిగి కనిపిస్తున్నాయి. ఆంధ్రలో కమ్మ, రెడ్డి కులాలవారు బ్రాహ్మణులను జయించిన తర్వాత సాంఘిక, రాజకీయ ఆధిపత్యాలు కైవసం చేసుకొని బలమైన కులాధిపతి శక్తులుగా మారారు.

కులానికి వుండే కర్కశత్వాన్ని, క్రూరత్వాన్ని వారి క్రింది కులాలపైన చూపించారు. బ్రాహ్మణులు క్రింది కులాలవారిని హింసించారు. కాని రెడ్డి, కమ్మ కులాలవారు అనేక సందర్భాలలో తమ క్రింది కులాలవారిని హింసించారు, చంపారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ప్రణాళికా రంగంలో వచ్చిన అనేక మార్పులు వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడంకోసం ప్రయత్నించాయి. అందులో భాగంగా వచ్చిన హరిత విప్లవం, క్షీరవిప్లవం వీరికి ఉక్కు గోళ్లు పెంచాయి. ఆర్థికంగా, సాంఘికంగా బలపడిన వీళ్లు క్రిందికులాలవారు మానవులుగా ఎదగడానికి చేసిన ప్రతి ప్రయత్నంమీద పెద్ద దాడులు చేశారు. కొన్ని సందర్భాలలో నరహంతకులుగా మారి పల్లెలపైబడి కత్తులతో, బరిసెలతో, గండ్రగొడ్డళ్లతో సాటి మనిషిని ముక్కలుగా నరికి, చంపి, స్త్రీలను మానభంగాలు చేసి, గృహాలను దగ్ధం చేశారు. వీటికి కారంచేడు, చుండూరు ముఖ్య ఉదాహరణలు. బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాలు కులతత్వాన్ని పెంచాయిగాని తగ్గించలేదు. కులాధిపత్యభావం, కుల క్రౌర్యానికి కూడా దారితీసింది.

## రాజకీయ రంగంలో కులం

హిందూ సాంప్రదాయవాదులు కాంగ్రెస్‌లో మొదటినుండి కులం పట్టు తగ్గకుండా చూశారు. ఆయా రాష్ట్రాల్లో వచ్చిన నాయకుల్నిబట్టి కాంగ్రెస్‌లో కుల నాయకత్వం బలంగా ముందుకు వచ్చింది. నెహ్రూ నాయకుడుగా వుండటం వలన ఉత్తరప్రదేశ్ బ్రాహ్మణులు మొదటినుండి కాంగ్రెస్‌లో ఆధిప్యతంలో వుంటూ వచ్చారు. అలాగే గాంధీవలన గుజరాత్ బనియాలు, తిలక్ వలన మహారాష్ట్ర బ్రాహ్మణులు నాయకత్వాలను కైవశం చేసుకున్నారు. ఆంధ్ర రాష్ట్రంలో కూడా ప్రకాశం పంతులువల్ల బ్రాహ్మణులు ముందుకువచ్చినా తర్వాత రెడ్లు నాయకత్వంలో ముందుకు వచ్చారు. పునాదిలోనే కులతత్వంతో ఏర్పడి కొనసాగుతున్న కాంగ్రెస్ సంస్థ అదే కొనసాగింపును పటిష్టంగా ముందుకు తీసుకువెడుతున్నది.

డాక్టర్ అంబేద్కర్ చెప్పినట్లు కులం వెనుక హిందూ మత భావం పునాదిగా వున్నంతకాలం దాని చట్రం కదలదు. ఉపరితల నిర్మాణంలో ఎన్ని మార్పులు వచ్చినా పునాది మారాలనేది సత్యశోధితమైన అంశం. క్రింది గ్రామం నుండి పట్టణ స్థాయివరకు ఈ కుల నిర్మాణం పరివర్తితమవుతున్న తీరు ఆశ్చర్యం గొలుపుతూ వుంటుంది. గ్రామ స్థాయిలో పంచాయతీ ప్రెసిడెంట్ రాజకీయ ప్రతినిధి. ఈ పంచాయతీ ప్రెసిడెంట్లు భూస్వామ్య కులాలనుండే ప్రధానంగా వుంటున్నారు. రిజర్వేషన్‌లలో వచ్చిన వారు తప్ప పంచాయతీ ఆధిపత్యం అంతా వీరిదే. రిజర్వేషన్లలో వచ్చిన వారిలో మెజారిటీ వీరి చేతుల్లోనే వుంటారు. వీరి రాజకీయ శక్తిని, కులాధిపత్యాన్ని పరివ్యాప్తి చేయడానికే ప్రయత్నిస్తారు. గ్రామాల్లో వస్తున్న వ్యావసాయక పద్ధతుల్లో, జీవన విధానల్లో వస్తున్న మార్పుల వలన కులాలు కొంత దగ్గరవుతున్నాయి. కాని కులతత్వం తగ్గడంలేదు. కుల పెత్తందారీతనం మారుతున్న సమాజాన్ని బట్టి రూపం మార్చుకుంటూ పోతూ వుంది. "మొబిలిటీ ఇన్ కాస్ట్ సిస్టమ్" M. N. Srinivasa వ్రాసిన వ్యాసంలో రాజకీయాధికారం కులాధిపత్యాన్ని నిలుపుకుంటూ ఎలా మారుతూవచ్చిందో విశ్లేషించారు. బ్రిటిషు యుగం చివరికి వచ్చేటప్పటికి క్షత్రియులు భారత రాజకీయాల్లోకి ఎలా చొచ్చుకువచ్చారో మన పార్లమెంటులోని మెంబర్లను పరిశీలిస్తే అర్థమవుతుంది. అలానే దక్షిణ భారతదేశంలో మరాఠ, రెడ్డి, వెల్లాలు, నాయర్లు ఎలా రాజకీయాధికారాన్ని హస్తగతం చేసుకున్నారో పరిశీలిస్తే అర్థమవుతుంది. రాజకీయాధికారం ద్వారా కులాధిపత్యాన్ని ఎలా స్థిరీకృతం చేసుకున్నారో శ్రీనివాసన్ వివరించారు. దక్షిణ భారతంలో అనేక శూద్ర జాతుల నుండి రాజకీయాధికారం చేపట్టిన కులాలన్ని తమను క్షత్రియులుగానే పిలుచుకున్నారు. అక్కడ తమను ఏ చంద్ర వంశానికో, సూర్య వంశానికో అనుబంధం చేసుకోవడం జరిగింది. క్షత్రియులుగా ముద్రపడిన తరువాత వారి అంతశ్శాఖలను వారు రక్షించుకోవడానికి బలంగానే పనిచేశారు. కౌటిల్యుడూ, మనువు రాజ్యాన్ని కులం పునాదులమీద నడపమన్నారు. ఈ పునాది కొనసాగుతూనే వస్తూ వుంది. మైనారిటీ ప్రజలు మెజారిటీ ప్రజల్ని జయించాలన్నా, పరిపాలించాలన్నా విభజించి పాలించడమే సూత్రం. ఆంగ్లేయులకు ముందు భారతీయ రాజులు ఈ సూత్రానితో సమాజాన్ని విడదీసి పరిపాలించారు. బ్రిటిషువారు యిదే సూత్రాన్ని వీరి దగ్గర నేర్చుకొని వర్ణ, మత, తెగ వంశాలన్నింటినీ విభజించి వారు ఉపయోగించుకున్నారు.

భారత రాజులు తమ రాజరిక అధికారంలో కులాలకుండే స్థాయిలను కొన్ని సందర్భాలలో మార్చారు కూడా. కొందరు రాజులు కొన్ని కులాలకు మద్దతుగా వాటిని అభివృద్ధి చేశారు. కొందరు రాజులు కొందరిని అణిచి వుంచేశారు.

## బ్రాహ్మణాధిపత్యం

బౌద్ధాన్ని ఆదరించిన రాజులు అంతరించాక హిందూ కుల వ్యవస్థ పెద్ద ఎత్తున పెరగడం ప్రారంభించింది. గ్రామీణ ప్రజలు పట్టణాల్లోకి రావడానికి కూడా రాజుల నిర్బంధం వుండేది. పట్టణాలు వ్యాపార కేంద్రంగా వుండేవి. వ్యవసాయ కులాలు ప్రధానంగా పన్ను కట్టేకులాలు కాబట్టి రాజులు, ఆ తర్వాత వచ్చిన బ్రిటిషువాళ్లు వ్యవసాయ కులాలకే ఎక్కువ మద్దతునిస్తూ వచ్చారు. బ్రాహ్మణ అగ్రహార ప్రాంతాలు సాంప్రదాయాలకు కేంద్రంగా వుండేవి. ఇక్కడ రైతులు కౌలుదారుగా వుంటారు. కాబట్టి బ్రాహ్మణాధిపత్యం క్రింద బ్రాహ్మణ సంప్రదాయాలను వారు అనుసరించేవారు.

రాజులుకూడా భూములను బ్రాహ్మణులకే యిచ్చారు కాబట్టి బ్రాహ్మణాధిపత్యం క్రింద కులం, వర్ణం బాగా పోషింపబడేవి. భూమిని కలిగివుండటం రక్షణకు గుర్తుగా వుంటుంది. అది సాంఘిక ఆధిక్యతను కూడా కలిగిస్తుంది. బ్రాహ్మణ ఆధిపత్యానికి, భరతభూమి దాస్యం చేయడానికి కారణం భూమిపై పెత్తనమే. ఈ సాంఘిక ఆర్థిక అంతస్సంబంధాలపై సరైన అవగాహన లేకపోవడం వలననే కేవలం ఆర్థిక వాదులు భూ పోరాటానికి బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాన్ని ముడివేయలేకపోతున్నారు. భూమి అంటే దాన వస్తువు. సర్వం సహా రాజ్యాన్నికూడా క్షత్రియులు అనేక సందర్భాల్లో బ్రాహ్మణత్వానికి ధారబోశారు. క్రింది కులాలను అణచి వుంచాలంటే బ్రాహ్మణ సంస్కృతిని పోషించడమే ముఖ్యమని భూస్వామ్య కులాలు కూడా ఈ కులవ్యవస్థనే కొనసాగించాయి.

## చారిత్రక భౌతికవాదాన్ని అన్వయించి సమైక్యంగా పోరాడాలి

బ్రాహ్మణ కులాల్లో ప్రసిద్ధి చెందిన నంబూద్రిపాద్ బ్రాహ్మణుల గురించి ఎడ్గార్ థర్స్టన్ తన 'కాస్ట్స్ అండ్ ట్రైబ్స్

ఆఫ్ సదరన్ ఇండియా' అనే పుస్తకంలో చెబుతూ యిలా అన్నారు :

"The Nambudris are for the must par landholders or of that class. The Nambudris some times a money-lender" ఇలానే బ్రాహ్మణ కులాల్లోనే పెక్కు శాఖీయులందరూ భూమి మీద పెత్తందార్లుగానే వున్నారు. వారితోపాటు భూస్వామ్య కులాలు భూమి కేంద్రంగా బ్రాహ్మణ సంస్కృతిని పోషిస్తూ వచ్చారు.

బ్రాహ్మణాధిపత్యం, భూస్వామ్యవర్గం అన్ని రంగాల్లో కుల భావాన్ని పోషిస్తున్న ఈనాడు సాంఘిక ఉద్యమాలు, కమ్యూనిస్టు ఉద్యమాలు కలిసి ఒక నిర్దిష్టమైన - ఆచరణాత్మక ఉద్యమాన్ని నడపవలసిన చారిత్రక అవసరం వుంది. భారతదేశంలో చారిత్రకంగా కులంమీద పోరాడిన చార్వాకుల భౌతికవాదాన్ని బౌద్ధుల సాంఘిక సిద్ధాంతాన్ని, సాంస్కృతిక - విప్లవోద్యమకారుల మానవతావాదాన్ని డాక్టర్ అంబేద్కర్, మహాత్మపూలే, పెరియార్‌వంటి సాంఘిక విప్లవకారుల సిద్ధాంతాలను భారత సమాజానికి అన్వయం చేయాలి. మార్క్స్, ఎంగెల్స్ గతి తార్కిక చారిత్రక భౌతికవాదాన్ని భారతదేశానికి అన్వయం చేయకుండా ఆచరణలో కులాన్ని నిర్మూలించటం సాధ్యంకాదు.

---

# కులాలు ఎలా పోతాయి?

డా॥ చందు సుబ్బారావు

---

'కుల మతాలు' అన్న సమాసం సవ్యమైనదికాదు. కులాలు భారతీయ సమాజంలో ఏర్పడ్డ ప్రత్యేక రూపాలు. మతాలు ప్రపంచ వ్యాపితమైనవి, విస్తృతమైనవి, విశాలమైన మానవతా ప్రవర్తనలో అంతర్భాగాలు. మన దేశంలోని కులాలకు మతం మాతృక కావొచ్చును. అంతమాత్రంచేత రెండూ సమాన ప్రతిపత్తిగల ద్వంద్వంగా ప్రయోగించటం బాధ్యతా రాహిత్యం.

ఈ శతాబ్ది ప్రారంభంలో, ఆధునిక సాంకేతిక సమాజ ఆవిర్భావంలో, స్వాతంత్ర్యోద్యమ వికాసం కోసం 'కులమతాలపై' పునస్సమీక్ష ప్రారంభమైంది. కులాల మధ్య సయోధ్య, సహనమూ, మతాల సహ జీవనమూ తదుపదేశికులూ మనకు కొత్తకాదు. బౌద్ధమూ, వీరశైవమూ, వీరవైష్ణవమూ, చార్వాకమూ, నాస్తికమూ కులాలపై పోరాటం సాగిస్తూనే వచ్చాయి. ఈ శతాబ్ది ప్రథమ భాగంలో మార్క్సిస్టు భావ వ్యాప్త సోవియట్ విప్లవ విజయమూ భారతదేశంపై పారించిన భావజాల ప్రభావంలో 'కుల రహిత- మత రహిత సమాజం' సాధ్యమన్న అభిప్రాయానికి తావొచ్చింది. ఆదర్శంగా ప్రారంభమై, అవసరంగా ప్రజ్వలించి, ఆచరణలో వీలైనంత మేర నడిచి నేటికి అలవాటుగా పరిణమించింది.

సదస్సు నిర్వాహకులు విన్నవించినట్లుగా కుల, మతాలు సమ సమాజానికి బెడదగా తయారయ్యాయి. అనటంకంటే సమ సమాజ నినాదమే అవిచ్ఛిన్నంగా సాగుతున్న కులాలకూ అయోధ్యగా విక్రమిస్తున్న మతానికీ ఆటంకంగా వున్నట్లు కన్పిస్తోంది. సోవియట్ పతనాన్ని ఆసరాగా, ఆలంబనగా తీసుకుని కల్తీలేని పెట్టుబడి విధానాన్ని భారతదేశంలో ప్రవేశ పెడుతున్న మన్మోహనుని నరసింహావతారం "అసమానతే ఆదర్శం" అని కుండ బద్దలు కొట్టి వక్కాణిస్తుంది.

## హెచ్చు తగ్గులు మానవజాతి ప్రాథమిక

"మానవ యోచనా స్రవంతిలోని మాలిన్యమదేమొకాని" తాను ఒకరికంటె ఎక్కువ- మరొకరింటే తక్కువ అన్న గుణం ప్రాథమిక లక్షణంగా పాటుకుపోయింది. "అందరూ ఒకటే" అన్న అంశంలో జగన్నాటకానికి కావలసిన 'రంజు'లేదని మత తాత్వికులు హెచ్చు తగ్గుల వర్గీకరణలను ఎప్పటికప్పుడు అవసర సత్యాలుగా · ఆశీర్వదించారు. కేవలం ప్రాణాలతో జీవించేవరకే అందరూ మనుష్యులు... ఆనక ధనిక-బీదలు, తెలుపు-నలుపులు, కుడి-ఎడమలు, బలవంత-బలహీనులు, పండిత-పామరులూ, పాలకపాలితలూ, గుణవంత-గుణహీనులూ అన్న పదాలకు అధ్యాత్మిక ప్రావీణ్యంతో ఆమోదమూ, ఆశీర్వాదమూ తెలిపారు. శక్తి మేరకు డబ్బు సంపాదించుకోవచ్చునన్న పెట్టుబడి జీవనం ఇందుకు వత్తాసు పలికింది. సోవియట్‌లో స్థాపించిన "మోనోలితిక్ వ్యవస్థ" ఓ

organising capacity - [illegible]
[illegible]

దెబ్బయ్యేళ్లపాటు ఈ పద్మవ్యూహంలో వీరాభిమన్యుడిలా పోరాడి అశువులు బాయటంతో "అసమానతే జీవన సత్యం" అన్న సంప్రదాయ నుడికారం నవీన పెట్టుబడి విధానంతో తాదాత్మ్యం చెంది మూడు పువ్వులూ ముప్పయి కాయలుగా వికసించుతోంది.

తిరిగి ప్రజా శ్రేయోభిలాషులు 'మరేం చెయ్యాలి' అని ప్రశ్నించుకోవడం అవసరమూ-ఆనందకరమూ. అయితే చర్చలో ఆనవాయితీగా వచ్చే పద్ధతుల్ని వీడితే తప్ప సత్య సందర్శనానికి చేరువకాలేం.

కులాలు దుర్గుణాలు..మతం మత్తు మందు... వెరసి కుల మతాలు సమాజ విరోధుల శాశ్వత కుట్ర అనుకుంటే మాత్రం ఏనుగును వెనక పెట్టుకుని ఏమీ లేదనుకునే అసందర్భతత్వానికి చోటు లభిస్తుంది.

## కులం అంటే ఏమిటి ?

నవీన సామాజిక శాస్త్రవేత్తల దృష్టిలో కులం అంటే ఏమిటి?

కులం = ఏక పంక్తి భోజనం + ఏకకాండ వివాహం + సమాన రూపు రేఖలూ + ఆహార విహారాది సాంస్కృతిక అలవాట్లూ + ఆర్థిక సమానత్వం + ఒకే వృత్తీ + మత నియుక్తమైన అలవాట్లూ...!

ఇందులో కొన్నిసార్లు కొన్ని లోపించినా ఎక్కువ సార్లు ఎక్కువ లక్షణాలు సమానంగా వుంటాయి. ఒక వేళ పేద కులంలో కోటీశ్వరుడు, నల్లని రంగు వారి మధ్యన తెల్లని స్ఫుర ద్రూపో పుట్టితే కులాన్ని పరిత్యజించి తన సమాన లక్షణ స్థాయికి వీలుగా కులాంతరమో, కుల రహితమో అయి జీవించటానికి ప్రయత్నిస్తాడు. దీనికి విలోమంగా సామాన్యుడు, నిస్సహాయుడు కులాన్ని వీడి నీళ్ళు వదిలిన చేపలా జీవించటం ముఖ్యంగా భారతీయ గ్రామీణ వ్యవస్థలో నూరుపాళ్లు అసంభవంగానూ, పట్టణాల్లో నాల్గింట ఒక వంతు అసంభవంగానూ వుంది.

సామాన్యులూ, మధ్య తరగతి ప్రజలూ వారి ప్రాథమిక జీవ ధాతువులుగా భావించే కొన్ని అలవాట్లను (అవి సైద్ధాంతికుల దృష్టిలో మంచివి కావొచ్చు- అవగుణాలు కావొచ్చు). త్రోసిరాజని మార్పుకు ప్రయత్నిస్తే తిరిగి అదే గాడిలో ప్రజలు పునర్దర్శనమయిచ్చే అవకాశం వుంది.

## మానవునికి ఏది ముఖ్యం ?

మనిషికి తన శ్రేయస్సూ, సౌఖ్యమూ, జీవిత విజయమూ ముఖ్యం. ఇందుకు అతను మూడు దశలను ఆశ్రయిస్తాడు.

1. ప్రాథమిక దశ = నా క్షేమమే ముఖ్యం, కుటుంబమూ, ఆస్తీ అందుకు సహకరిస్తాయి.
2. ఆలోచనా దశ = నీ సౌఖ్యం సమిష్టి సౌఖ్యంతో ముడిపడి వుందన్న విషయ జ్ఞానం వస్తుంది.
   గుంపూ, మందీ, బలమూ, కులమూ, వర్ణమూ, వర్గమూ అందుకు సహకరిస్తాయి.
3. మేథో దశ = దేశమూ, సమాజమూ, ప్రపంచమూ అన్న పరిజ్ఞానమూ వస్తుంది.
   సిద్ధాంతమూ, తత్వమూ, దేశభక్తీ, రాజకీయమూ ఇందుకు సహకరిస్తాయి.

అతికొద్ది శాతం మూడు దశలు చేరుకోగా, ఎక్కువ మంది మొదటి రెండు దశల్లో ఆగిపోవటం వాస్తవమే. అందుచేతనే భారతీయ సమాజం మూడువేల కులాలుగా ప్రవర్ధమానం చెంది అలుపూ సొలుపూ లేకుండా చక్రంలో పడి తిరుగుతూంది. కులాల సంఖ్యకు భారతీయ చరిత్ర దోహదం చేసింది. కులాల ఉనికికి భారతీయ సమాజం దోహదం చేసింది. కులాల హెచ్చు తగ్గుల నిటారు వర్గీకరణకు భారతీయకు హిందూ మతం ప్రాణం పోసింది. కులాల అవలక్షణాలకు భారతీయ రాజకీయ వ్యవస్థ ప్రాణం పోస్తూంది. కులాలు ఇంకా కొనసాగటానికి ఆర్థిక వ్యవస్థ ఆసరాగా నిలబడుతోంది.

## కుల వ్యవస్థలోని మంచి చెడులు

ఈనాటి కుల వ్యవస్థలోని మంచి చెడుల బేరీజు చూద్దాం.

మంచి : పుట్టుకతో ప్రాప్తిస్తుంది, కనుక ఫీ ప్రమేయం లేదు. పుట్టుకకూ, పెరుగుదలకూ, పెళ్లికీ, చావుకూ, వృత్తికీ, ప్రవృత్తికి ఆసరాగా, అండగా వుంటోంది. సామూహిక జీవనంలో తప్ప బ్రతకలేని మానవులకు కుల తిరస్కారం ఆత్మహత్య సదృశంగా పరిణమిస్తుంది. మనిషి వైయక్తిక ఆలోచనలోని దోషాలను సవరించి సామూహిక జీవనంలోని శ్రేయస్సుకు అలవాటు చేస్తుంది.

చెడు : నిటారుగా వర్గీకరించబడటంవలన లాభసాటి కులాలు, నష్ట జాతక కులాలుగా విభజన ఏర్పడింది. 'గట్టి శాతం'గా వున్న ఒక కులాన్ని అస్పృశ్యులుగా దూరంచేసి తన అవసరాలకు వాడుకుంటోంది. చిన్న కులాలు, చేతి వృత్తుల కులాలను ఆ పరిధి దాటకుండా శాశ్వత బలహీనత్వానికి నెట్టివేసింది.

ఈ మంచి చెడులలో మంచిని స్వీకరించినవారు కుల వ్యవస్థకు సవరణలు ప్రతిపాదిస్తూ, బోధిస్తూ, మార్పులు సూచిస్తూ ఎలాగైనా శాశ్వతత్వాన్ని పొడిగించాలని ప్రయత్నించారు, ప్రయత్నిస్తున్నారు.

చెడును స్వీకరించినవారు తిరుగుబాటుతో, ఆగ్రహంతో కుల నిర్మూలనకు చేతనయినంత సాయం చేశారు. చేస్తున్నారు.

## కుల వ్యవస్థపై గట్టి దెబ్బతీసిన అంశాలు

ఈలోగా ఈ శతాబ్దం మరో కొత్త కారణాన్ని తెచ్చింది. ఆధునిక శాస్త్ర, సాంకేతిక పరికరాలు కుల వ్యవస్థపై గట్టి దెబ్బతీశాయి. ఒక మేధావి అన్నట్లుగా : "It is the locomotive and the antomobile which helped destruction of Caste more than any number of reformers put together".

**ఆధునిక విజ్ఞానం :** (1) భూస్వామ్య వ్యవస్థ నుంచి యాంత్రిక వ్యవస్థకు దూకించింది. (2) ఆహార వ్యవహార అలవాట్లను అపరిమితంగా మార్చివేసింది. (3) మనకు తెలియనంతటి ప్రజాస్వామ్య లక్షణాన్ని పెంపొందించింది. కార్లు, రైళ్లు, విమానాలు, ప్రెస్సులు, విద్యాలయాలు, రేడియో, టీవీలు, సినిమాలు కుల పట్టింపుల్ని కూలదోసాయి. (4) ఆధునిక వైద్యం మనుషుల మధ్య భేదాల్ని గుర్తించ నిరాకరించింది. (5) ఆధునిక ఆయుధాలు చేపట్టిన వారిని కులం నుంచి దూరంచేసి కొత్త శక్తిని ప్రసాదించాయి. (6) భారతీయ రాజ్యాంగం కొన్ని అవకతవకలకు తావిచ్చినా కులాలలోని ఆర్థిక వ్యత్యాసాల అదుపునకు దోహదం చేసింది. (7) వయోజన ఓటింగ్ రాజకీయ వ్యవస్థలో కుల వ్యవస్థ లొంగివుండేలా వీలు కల్పించింది. ఎంత స్వార్థ రాజకీయాలు కులాలను రెచ్చగొట్టినా ఏ ఒక్క కులమూ తనంతతానుగా రాజకీయ శక్తిగా పరిణమించలేని అశక్తతను కల్పించింది. (8) ఆధునిక నగరాల అభివృద్ధి నేటికి 25 శాతం జనాభాను ప్రోగుచేసింది. నగర జీవనం కుల వ్యవస్థకు శత్రువుగా వుంటుంది. గ్రామీణ జీవనంలో యాంత్రిక వినియోగం పెరగనందున అక్కడ కుల వ్యవస్థ అవిచ్ఛిన్నంగా సాగుతోంది.

## కుల వ్యవస్థ నిర్మూలన ప్రయత్నాల వైఫల్యం

మళ్లీ మొదలుకొద్దాం– 'కులాలు ఎలా పోతాయి? కుల వ్యవస్థ పోవటానికి నాస్తిక హేతువాదులూ, ప్రగతిశీల సంఘాలూ, మేధావులూ ఆనవాయితీగా చెబుతున్న 'ఆర్గ్యుమెంట్' వైఫల్యానికి రెండు కారణాలున్నాయి.

**ఒకటి :** అలవాటు ప్రకారం యింకా వారు మను స్మృతి ద్రోహాన్ని, భగవద్గీతలోని దోషాన్ని, బ్రాహ్మణ పురోహిత వర్గాల కుట్రనూ ఉటంకిస్తున్నారు. వేదాలూ, ఉపనిషత్తులూ కల్పించిన కుయుక్తిగానే యింకా విషయాన్ని పరిశీలిస్తున్నారు. పరిస్థితి పూర్తిగా మారిందన్న విషయాన్ని గ్రహించటంలేదు. తొలినాటి వర్ణ వ్యవస్థలోని బ్రాహ్మణ్యానికి ఈనాడు సాంస్కృతిక ఆధిపత్యం పోయింది. బ్రాహ్మణులు చాణుక్యులుగా జ్వలించే స్థితిలేదు. బ్రతుకు తెరువుకోసం పధి రూపాయలకు మంత్రం చదివే పురోహితులుగా, నీ క్షేమానికి దేవ శక్తులను ధ్యానించే సేవకులుగా, ఉద్యోగులుగా, బుద్ధి జీవులుగా పరిణమించారు. ఈ సాంస్కృతిక ఆధిపత్యాన్ని విద్యా, వైజ్ఞానికులైన బ్రాహ్మణేతర ఆర్థిక శక్తులు స్వీకరించాయి.

## నేటి పిసపలైన అగ్రవర్ణాలు–శూద్ర వర్ణాలే !

వర్ణ వ్యవస్థలోని రెండవ వారైన క్షత్రియులు రజో గుణ సంపన్నత పోగొట్టుకున్నారు. ప్రజాస్వామ్యం ఎవరు బుద్ధిబలవంతులో వారికి పాలనావకాశం కల్పిస్తుంది. మూడోవారైన వైశ్యులు పూర్తిగా రూపాంతరం చెందారు. వ్యవసాయ వృత్తి నుంచి చిన్న వ్యాపార వృత్తులకూ తదితర ఆర్జనాయుక్తులకూ నిష్క్రమించారు. నాల్గవవారైన శూద్రుల నుంచి పిసపలైన అగ్రవర్ణాలు ఉద్భవించాయి. భూమి, ఉత్పత్తి సాధనాలూ, వ్యాపార కళలూ, పోరాట దళాలూ పూర్తిగా శూద్రుల్లోని అగ్రవర్ణాల కైవసం అయ్యాయి. "హరిజనులపై అగ్రవర్ణాల హత్యాకాండ" అన్నప్పుడో (పాపం శమించుగాక) ఆ అగ్రవర్ణాలు బ్రాహ్మణులూ, వైశ్యులూ కానేకారు! ఆంధ్రదేశంలో రెడ్డి, కమ్మ, కాపు, వెలమ, క్షత్రియులకు ఆ ఘనకీర్తి దక్కుతుంది.

**రెండవ కారణం :** కులాల ఉనికిపై సామ్యవాద, హేతువాద తదితర శక్తులకు సానుభూతి పూర్తిగా లేకపోవటంవలన, కులాలనూ వాటి మాతృక అయిన హిందూ మతాన్ని పరమ నికృష్టమైన అవలక్షణాలుగా భావించటంవలన సమస్యను అవగాహన చేసుకునే శక్తి క్రమంగా దూరమైంది. అగ్రవర్ణాలు, మధ్య తరగతి, బూర్జువాలు, పెటీ బూర్జువాలు, పీడిత తాడితులూ, శ్రామిక వర్గమూ అన్న పరిభాష దాదాపుగా వాస్తవ పర్గీకరణలే అయినా తత్సమాన ప్రజానీకాన్ని Identy చేయటానికి కుల వ్యవస్థ గొంతులో వెలక్కాయలా అడ్డుపడింది.

అగ్రవర్ణాలకూ – బూర్జువాలకూ
మధ్య వర్ణాలకూ – పెటీ బూర్జువాలకూ
శ్రామిక వర్గానికీ – దళితులకూ

దాదాపు 90 శాతం రూప సామీప్యత వున్నదని గ్రహించగలం. గ్రామాల్లోని మాల, మాదిగ, ఎరుకల, ఏనాదులు తప్ప వ్యవసాయ కూలీలు అన్యులెవ్వరూ కారన్న సత్యం తెలిసిందే.

## కులాలు, వర్గాలు అవినాభావ సంబంధం

శ్రామిక వర్గ నియంతృత్వం మాట అటుంచితే, శ్రామికవర్గ విజయానికీ భారతీయ దళిత మహాసభ విజయానికీ తేడా బహు స్వల్పంగా వుంటుంది. అయితే పరిభాష అక్షరాస్యత లేని ప్రజలకు చేరకపోవటంవలన, తెలిసిన తెలుగు పదాలను వినియోగించి జన సమీకరణ చేసేందుకు యితర రాజకీయ పార్టీలకు లభించిన స్వేచ్ఛ వామపక్షాలకు లేకపోయింది. కులాల ఉనికిని తిరస్కరించటంలోని ఉత్తమ లక్షణంకన్నా, ఉనికిని వినియోగించి రాజకీయ శక్తులుగా మార్చే మధ్యమ లక్షణం మన దేశంలో ముందడుగు వేసింది. వెనుకబడిన కులాలు, షెడ్యూల్డ్ కులాలు, తెగలు రాజ్యాంగం కల్పించిన వసతులను వినియోగించుకోవటానికి సుముఖులయ్యారు తప్ప, కుల నిర్మూలనలో సుగుణాన్ని ఆవగింజంతయినా చూడలేదు. పైగా కుల తిరస్కారవాదులైన వామపక్షాలకు విధిగా దూరమయ్యారు. ఆ "పీడిత తాడిత శ్రామిక జనం" లో మనం వుంటామో లేదో అన్న భయంకర సంశయానికి లోనయ్యారు. ముమ్మూర్తులా ఆవరించిన రూపురేఖలు అలవాట్లు "కులాన్ని" ఆత్మగౌరవ చిహ్నంగా భావించాయి తప్ప ఆత్మ న్యూనతా భావాన్ని కల్పించలేదు. పైగా తమలో పుట్టిన పద్మారావులు, సత్యమూర్తులు తమలో పుట్టని పద్మాలకన్నా, సత్యాలకన్నా మెరుగన్న భావం వారిలో బలంగా ఏర్పడింది.

వర్గ పోరాటానికి మూలధాతువైన 'వర్గ శత్రువులను' కులాలు సులభంగా గుర్తించి ముందడుగు వేస్తున్నాయి.

## "క్రింది మెట్లు – పై మెట్లను త్రోసిరాజనాలి"

వర్గ వ్యవస్థ నిర్మూలనకు క్రింది వర్గమే సాధనమని మార్క్సిజం భావించినట్లుగా వర్ణ వ్యవస్థ పోవటానికి క్రింది కులాల పోరాటమే మార్గంగా రాజకీయం కొత్త రూపం ధరిస్తోంది. అపును కులాలు ఎలా పోతాయి? "నిట్టనిలువు కుల వ్యవస్థలోని క్రింది మెట్లు పై మెట్లను త్రోసిరాజన్నప్పుడు పోతాయి" అన్న భావం ఆధునిక రాజకీయ వ్యవస్థలో అంతర్భాగమవుతూంది !!

## అనుబంధం

## వర్గ దృక్పథానికి, కులదృక్పథానికిగల పరిమితులు

ప్రతిసారీ, ప్రతిచోటా వర్గ దృక్పథం, దళిత దృక్పథం పీడిత కుల దృక్పథం మంచినే చేస్తుందనేదేమీలేదు. అందువల్ల ఆయా దృక్పథాలన్నీ మానవీయ విలువలు ప్రాథమికంగా ప్రతిపాదిస్తూ ముందుకు సాగవలసి వుంటుంది. ఈ విషయం వదిలేసి గుడ్డిగా వర్గ దృక్పథం, దళిత దృక్పథం ప్రధానం అంటూ, ఆచరిస్తే చెడు కూడా జరిగే అవకాశాలుంటాయి. ఇది విలువల సమస్య. అందువల్ల ఈ సందర్భంగా విలువల సమస్యలో భాగంగా వర్గం, దళిత అనే పదాల ద్వారా జరిగే విలువల పర్గీకరణను కూడా పరిశీలించాల్సిన అనివార్యత ఉత్పన్నమవుతున్నది.

ఉదాహరణకు పల్లం తిరుపాల్ అనే విద్యార్థి ఒక దళితుడు. అతడు విరసం సభ్యుడుకూడా. అతడు అకాలమరణం చెందాడు. అతన్ని బ్రతికించుకోడానికి కిడ్నీ (లేక మరొకటో) ఆపరేషన్ కోసం బంధు మిత్రులందరూ చేయవలసిన కృషి నెంతో చేశారు. అతని ఆపరేషన కోసం విరాళాల్ని సేకరించాల్సి వచ్చింది. విరసం యూనిట్లూ మిత్రులూ కలసి అతనొక పేదవాడనో, పేద రచయిత అనో పత్రికా ప్రకటన యివ్వాలనుకున్నారు, యిచ్చారు. అందులో ఆ సందర్భంగా విరసం సభ్యుడు అని ప్రకటించకూడదు అనుకున్నారు. బాగా డబ్బుండి దయార్ద్రతతో సహాయం చేసేవాళ్లెవరైనా సాయం చేయవచ్చు. మరెవరైనా చేయవచ్చు. విరసం సభ్యుడని ప్రకటించినా, విరసం తరపున పత్రికా ప్రకటన ప్రకటించినా ప్రయోజనం దెబ్బతింటుంది. విరసం వాడికి మనమేందయ్యా చేసేది అతనికి సాయం. విరసం మిత్రులే చేసుకుంటారు అని ఎవరైనా దాతలు అనుకోవచ్చునను కున్నారు. అందువల్ల కావాలనే విరసం సభ్యుడనిగానీ, విరసం తరపునగానీ పత్రికా ప్రకటన యివ్వలేదు. ఇది చాలా సరైన వాస్తవిక దృక్పథం.

---

"నంబూద్రి బ్రాహ్మణులు నీచమైందిగా భావించి తిరస్కరించిన అధర్వణవేదంతో సహా నాలుగు వేదాలనూ, ప్రపంచం మొత్తానికి చెందిన విద్వాంసులు, మేధావులు లోతుగా పరిశోధించారు"

– వేదభూమిలో శ్రీ నంబూద్రిపాద్.

( ఆఖరు వేదమైన అధర్వణ వేదం ఆర్యావర్తంలో (ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్) క్రీ. పూ. 7–8 శతాబ్దాలలో రూపొందింది. బ్రహ్మావర్త బ్రాహ్మణులు నాలుగో వేదాన్ని గుర్తించరు. అట్టి సనాతన బ్రాహ్మణ శ్రేణి బహుశా సింధు, గుజరాత్ ప్రాంతాల నుండి సరాసరి కేరళకు చేరి వుంటారు– కం. సం. )

"మౌర్య, గుప్త, హర్ష వంటి హిందూ చక్రవర్తుల కాలంలోను, మొగలాయీ చక్రవర్తులతోసహా ముస్లిం పాలకుల కాలంలోనూ ఆర్థిక సాంస్కృతిక రంగాలలో ఉన్నత స్థితి పొందిన భారతీయ సమాజం, ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ కాలంలో ఎందుకిలా పతనం చెందిందో దేశ ప్రేమికులందరూ ఆందోళనలో పరిశీలించాలి".

– వేదభూమిలో శ్రీ ఇ.ఎం.ఎస్. నంబూద్రిపాద్.

---





బ్రాహ్మణిజం – అధర్వణవేదం

# కులాల సమస్యకు పరిష్కారం వుందా?

శ్రీ మహీధర రామమోహనరావు

కులము, వర్ణము అనే వానిని సమానార్థకాలనుగా వర్గము అనేది వానితో భావసారూప్యం కలదిగా భావించడం పరిపాటి అయింది. "చాతుర్వర్ణ్యం మయా సృష్టం! గుణకర్మ విభాగశః!!" (వారి వారి గుణాలు, చేసే పనులనుబట్టి నాలుగు వర్ణాలు చేసేను). అనే గీతా వ్యాఖ్యాన్నిబట్టి కులాలు వృత్తి విభజన ప్రాతిపదికగానే ఏర్పడ్డాయనే భావించాం. వృత్తులనుబట్టి అనేక కులాలు ఏర్పడి వుండడం ఆ ఆలోచనకు బలం యిచ్చింది. అయితే ప్రాంత భేదాలను బట్టి, ఆచార భేదాలనుబట్టి కూడా కొత్త కులాలు ఏర్పడుతుండడాన్నీ, ఒకే కులంవారు వేర్వేరు శాఖలుగా విడిపోయి చిన్న కులాలల్లే వ్యవహరిస్తుండడాన్నీ మనం గణనకు తీసుకోవడంలేదు.

## మన అంచనాలు తల్లక్రిందులు

కులాలకూ, ఆర్థికపరమైన వర్గాలకూ హెచ్చుతగ్గుల పరిగణనలో వున్న సారూప్యతనుబట్టి రెండూ పర్యాయపద బంధాలనుగా భావించాం. వర్గాల మాదిరిగానే కులాలూ, వర్ణాలూ ప్రత్యేక ఉత్పత్తి పద్ధతులతో ముడిపడివుండి, వానితోపాటు మారుతూ అంతరించి పోతాయనుకున్నాం. ఇటీవలి కాలంలో దేశంలో వచ్చిన ఆర్థిక, రాజకీయ పరిణామాల ప్రభావంతో కులాంతర, వర్ణాంతర వివాహాలూ, భోజనభాజనాలూ అధికాధికంగా జనామోదం పొందుతూ రావడం ఆ అభిప్రాయానికి బలం యిచ్చింది. సమాజ నిర్మాణంతో కులానికి వున్న ఆర్థికపరమైన, ఆచారపరమైన పట్టు సడలిపోతూందనీ, పోయిందనీ, ఇక మిగిలింది రాజకీయమైన పట్టు మాత్రమేననీ భావించాం. ఈ మార్పులను తెచ్చిన పెట్టుబడిదారీ ఆర్థిక విధానం మారిపోయి, సోషలిస్టు వ్యవస్థ ఏర్పడడంతో కులాల సమస్య మాసిపోతుందనుకున్నాము. కాని మన అంచనాలు తలక్రిందులయ్యేయి. సమాజంలో కుల భేదాలు కొనసాగడమే కాదు, అవి ద్వేషాలుగా మారి కొట్లాటలు, హత్యలు, విధ్వంసాలు ప్రజ్వరిల్లుతుండడం చూశాక మనం నిలబడి పునరాలోచించుకోక తప్పడంలేదు.

## ఒకే కులంలో దోపిడీ వర్గాలు, పీడిత వర్గాలూ

ఇక్కడ ఇంతవరకు మనం విస్మరించిన ఒక విషయం మనకు ఎదురైంది. ఒకే కులంవారు వేర్వేరు ఆర్థిక స్థాయిలకు చెంది వున్నారన్న యథార్థ స్థితిని పట్టించుకోకుండా కులాలూ, వర్గాలూ ఒకటే అన్నాం. దోపిడీవర్గాలూ, పీడిత వర్గాలూ మాదిరిగానే కులాలలో దోపిడీచేసే, దోపిడీకి గురి అయ్యే కులాలూ అంటూ చూశాం. సమాజ నిర్మాణంలో ఉన్నత కులాలూ, దిగువ కులాలూ అన్న విభజనను దోపిడీ, పీడిత వర్గాలనే ఆర్థిక సూత్రానికి సరిపుచ్చాం. ఇది పరిస్థితిని మరింత క్లిష్టం చేసింది. సామాజిక సంపదలు ఎల్లా వచ్చేయి? ఎల్లా పెరుగుతున్నాయి? అన్నదానిని వివరిస్తూ కారల్ మార్క్స్ "అదనపు విలువ" సిద్ధాంతాన్ని ప్రతిపాదించేడు. దానిని మనం సమాజంలో సాగుతున్న దోపిడీ స్వరూపాన్నిగా చూపించాం.

మానవుడు తాను బతకడానికి, సుఖపడడానికి, నలుగురిలో పైకి రావడానికి నిరంతరం శ్రమిస్తాడు. రెండోవేపున తోడివారు బతకడానికి సుఖపడడానికి శ్రమిస్తాడు. ఇవే అతనిలోని మానవత్వ, దానవత్వ; దేవత్వాల లక్షణాలుగా భావిస్తాం. ఈ మూడు లక్షణాలూనే సమాజాన్ని ముందుకు నడిపిస్తున్నాయి. చేతికి దొరికిన రాయితో చెట్టున వున్న పండును రాలగొట్టి తిన్న మానవ జంతువు ఈనాటి దశకు ఎదిగిందంటే పైన పేర్కొన్న మూడు లక్షణాల ప్రభావమే. ఈ క్రమంలో కోట్ల సంఖ్యలో జనం నలిగిపోయేరు, మాడిమసై పోయేరు. ఈనాటికి ఆ పరిస్థితి వుండనే వుంది. మన దేశంలో కులాలుగా సమాజం విడబడడం ఈ హెచ్చు తగ్గులకు, పీడనకు కారణం అనే భావన ప్రబలం అయింది.

ఏ సామాజిక సంస్కృతిలోనూ, మరే దేశంలోనూ భారత సమాజంలో తల ఎత్తిన కులాల నిర్మాణం వంటిది కనిపించదు. ప్రపంచంలో పని విభజన వర్ణ వ్యవస్థకు ఎక్కడా దారితీయలేదు. మన దేశంలో కూడా కులానికీ, పని విభజనకూ విడదీయరాని సంబంధం వుందనడానికి వీలులేదు. స్వధర్మే నిధనంశ్రేయః "మంచిది" అన్నారేగాని దానిని విధి చేయలేదు. ఈ మాటలోని విశిష్టతకు మనం ప్రాధాన్యం ఇవ్వలేదు. కులానికీ, వృత్తిపనికీ, ధర్మాధర్మ సంబంధం కలిపేము. అదో తప్పు.

## కులం యొక్క ప్రధాన లక్షణం ఏమిటి?

అయితే కులం యొక్క ప్రధాన లక్షణం ఏమిటి? అంతర్వివాహ నిషేధం, బహిర్వివాహ నిషేధం— కులం యొక్క రెండు ప్రధాన లక్షణాలు. క్రమంగా సమాజం విస్తరించి, అనేకానేక వృత్తి పనులు జీవికలు కావడం, ఎవరికివారే కుల లక్షణాలను తమకూ వర్తింపజేసుకున్నారు. వానితో ప్రాంతీయ విభేదాలు కూడా కలిసి కులాలు అనంత శాఖలుగా విడిపోయాయి. విడిపోయిన ప్రతి ఒక్కరూ తమ ప్రత్యేకతను ప్రకటించుకోడానికో, మేము ఎవరికీ తక్కువ కామని చెప్పడానికో, స్వాతంత్ర్య ప్రకటనకో అంతర్వివాహ,

బహిర్వివాహ నిషేధ లక్షణాలను పాటించసాగేరు. విశాలమైన దేశం, అపారమైన ప్రకృతి సంపదల వైవిధ్యం; మానవునిలో వుండే మంచి-చెడులను ఆశ్రయించీ వృత్తి విభజన కుల లక్షణాలను కూర్చుకుంది ప్రాదేశికములైన ఆచార వైవిధ్యాలు అభేదాలను మరింత బిగదీసేయి. ఈ చారిత్రక పూర్వరంగం నుంచి ఆలోచించాలి. అసలు కులం అనేదేమిటి? అవి ఎందుకు ఏర్పడ్డాయి? ఆదినుంచీ కులాలు ఈనాడున్న రూపంలోనే వున్నాయా? ఈనాటి సమాజంలో కులాలు సృష్టిస్తున్న సమస్యలు ఎప్పటికేనా తొలగేనా? అందుకు దారి ఏమిటి? ఎన్నో ప్రశ్నలు మన ముందున్నాయి. దళితులుగా, వెనుకబడిన తరగతులుగా, హరిజనులుగా, గిరిజనులుగా రాజకీయ, ఆర్థిక, సామాజిక సౌకర్యాల కోసం పోరాడుతున్న కాలంలో కూడా ఈ కుల భేదాలు, వైషమ్యాలు వారితో కూడ సెల వేస్తూనే వున్నాయి. ఏమిటిది? వీనికి అర్థం ఏమిటి?

కులం అన్నది కొన్ని కుటుంబాల సమాహారం. కుటుంబం లోపల వివాహం నిషిద్ధం. ఆ కుటుంబానికి వెలుపల వున్న వారితోనే సంబంధం. కాని వారు ఆ కులానికి చెందినవారే అయివుండాలి. అంటే ప్రతి కులంలోనూ పరస్పర వివాహ సంబంధాలు పెట్టుకోగల రెండు కుదుళ్లకు చెందిన కుటుంబాలు వుండాలి. ఈ వేరు వేరు కుదుళ్లకు వేరు వేరు గోత్ర పురుషులుంటారు. ఆ కుదురులోని కుటుంబాలకు ఆయన మూల పురుషుడు. ఆ మూల పురుషుడు ఎప్పటివాడో, ఎక్కడివాడో ఎవరూ ఎరుగరు. అదంత ప్రధానం కాదు. ప్రధానమైనది ఆ కుదురులో అంతర్వివాహం నిషిద్ధం. మరో కుదురునుంచి, గోత్రం వధువునో, వరుణ్ణో ఎన్నుకోవలసిందే.అయితే ఆ కుదురు ఆ గుంపుకు చెందినదే అయివుండాలి. గుంపులు విస్తరించి, దూర సుదూర ప్రాంతాలకు పోయినా, కుదుళ్లు రెండయి, నాలుగయి, ఎనిమిదయి చెదిరిపోయినా గుంపు గుర్తు నిలబడవలసిందే. ఎంతమంది మధ్య జీవించినా ఆ Identity కాపాడుకోవాలి. అదే కులం రూపంలో మన దేశంలో చలామణీ అవుతూంది.

ఆర్యను తెగలు బలవంతులుగా దక్షిణాదికి వచ్చినప్పుడు కలిగిన సంస్కృతి మార్పిడిలో వారి వర్ణాలను దాక్షిణాత్య తెగలు, వీరి కుల గుర్తింపులను ఔత్తురాహులూ అందిపుచ్చుకోవడంలో ఆశ్చర్యం లేదు. దాక్షిణాత్య తెగలలోని పురోహితులు బ్రాహ్మణులయ్యేరు. ప్రభు కుటుంబాలూ, బలవంతులూ చంద్ర సూర్య వంశాలను ఎరువు తెచ్చుకున్నారు. వానికి తమ కులాల్నీ, గోత్రాల్నీ జతపరచుకున్నారు. వీరిని చూసి మిగిలిన వృత్తి పనులవారు ఎవరికివారే కులాల్నీ, కుదుళ్లనీ,గోత్రాల్నీ ఏర్పరచుకున్నారు.

## రక్త సంబంధీకులమధ్య దాంపత్యం నిషేధం ఫలితమే కులం

అంటే- రక్తసంబంధీకుల మధ్య దాంపత్య సంబంధాలు నిషేధించబడిన అతి ప్రాచీన కాలంలోనే మన దేశంలో కులానికి ప్రాతిపదిక ఏర్పడిందనుకోవాలి. వానరుడు నరుడు రూపుదాల్చిన కొత్తనాటి కథ ఇది. ఆ దశలో మానవ జంతువులు వావి వరసలను ఎరగవు. అడవుల్లో దొరికినవి తింటూ, చిన్న చిన్న గుంపులుగా తిండి వెతుక్కుంటూ తిరిగిన ఆ దశలో ఆ గుంపుల్లో నలుగురైదుగురిని మించి వుండే అవకాశం లేదు అంటారు జె.బి.ఎస్. హాల్డేన్. ఈ గుంపులు ఆ విధంగా సంచరిస్తూ, కొత్త గుంపులలోని వారితో సంబంధాలు పెట్టుకోవడం, వారికి కలిగిన సంతానం రక్త సంబంధీకుల సంతానంకన్నా బలంగా, తెలివిగా వుండడం చూసినమీదట ఈ వావి వరసలు వచ్చేయని సమాజ శాస్త్రవేత్తల అభిప్రాయం. ప్రపంచ తెగలన్నింటిలోనూ ఈ వావివరసల నిషేధాలు వచ్చేశాయి. లూయీ హెన్రీ మోర్గన్ వ్రాసిన Ancient Society పురాతన సమాజం పేరున దీనిని ఈ వ్యాసకర్త అనువదించేరు)ని, ఫ్రెడరిక్ ఏంగెల్సు వ్రాసిన Origin of Family, Private Property and State (కుటుంబం, ఆస్తి, రాజ్యాంగాల పుట్టుక పేరున ఈ రచననూ ఈ వ్యాసరచయితే తెలుగులోనికి అనువదించేరు.)ని చదివితే సమాజంలో వచ్చిన ఈ పరిణతిని గురించి బాగా తెలుసుకోవచ్చు. మానవ సమాజంలో రక్తసంబంధీకుల మధ్య దాంపత్య సంబంధాలు నిషేధింపబడిన నాటి తెగలలోని గుంపులకు చిహ్నంగా 'కులం' అనేది వచ్చిందని భావిస్తాను. లేకుంటే అది నేటికీ మన మనస్సులలో ఇంత బలంగా నాటుకుని వుండదు.

## పంచమ వర్ణం ఎవరు?

భారతదేశ సమాజంలో పంచమ వర్ణం ఒకటుంది. వారు ఆంధ్రలో మాల, మాదిగ మొదలైన కులాలుగా విడిపోయి వున్నారు. వీరిలో మాలలు ప్రధానంగా వ్యవసాయ వృత్తిలో వుంటారు. మాదిగలది చర్మకార వృత్తి. ఈ రెండు కులాలూ నివసించేది గ్రామాల వెలుపలనే. ఇతర దేశాలలో బానిసల యెడ అమలుజరిగిన విధి నిషేధాలన్నీ వీరికీ వర్తింపజేయబడ్డాయి. అయితే ఒకటే తేడా, బానిసలలాగా వీరు వ్యక్తుల ఆస్తికాదు- కాని తద్భిన్నంగా వీరు గ్రామం మొత్తానికి ఆస్తి అనవచ్చు. వీరిని చూసే భారతదేశంలో బానిసత్వం వుందా, లేదా యని మార్క్సీయులు గుసాగుస పడుతున్నారు. నేటికీ తేల్చుకోలేకపోయేరు. ఈ కులాలమీద సమాజంలో వున్న తేలిక భావాన్ని తగ్గించడానికీ, వారిని కూడా సామాజిక జీవితంలో కలుపుకు రావడానికీ జాతీయోద్యమం వీరిని హరిజనులుగా, అంబేడ్కరీయుల పునరుద్యమ నోద్యమం వీరిని దళితులంది. హరిజనులన్నా, దళితులన్నా పంచమ వర్ణానికి పర్యాయ పదాలయ్యేయే తప్ప వీరిలోని కుల విభజన రద్దు కాలేదు. బలహీనపడలేదు.

ఎవరీ పంచములు? వీరు ఆర్యన్ తెగల చాతుర్వర్ణ్య విభజనకు వెలుపలివారు. అంటే అనార్య తెగలవారి ఉమ్మడి పేరుగా వాడుకలోకి వచ్చి వుంటుంది.

ఆదిమ కాలంలో తెగలు, గుంపుల మధ్య జరిగిన పోరాటాలలో విజితులు, విజేతలు సర్వ సాధారణంగా

చంపేసేవారు. స్త్రీలను, పిల్లల్నీ, తమ గుంపులో సంఖ్యను పూర్తి చేసుకొనేందుకై కొద్దిమంది మగాళ్ళను మిగిల్చి మిగిలివవారిని చంపేపేవారు. పశువుల్ని పెంచడం, పంటలు పండించటం వంటివి వచ్చేక విజితుల్ని చంపివెయ్యడానికి బదులు బానిసల్నిగా చేసి పనులు చేయించుకోడం ప్రారంభమయింది. మనిషి చేసే పని వలన అతని పొట్ట గడపడమేగాక మిగులు కనబడడం కారణమని మార్క్స్ దీనికి కారణం చెప్పేడు. ఈ విధంగా మనిషిని బానిసలును చేయడం వలన సమాజం ఓ అడుగు ముందుకు వేసిందంటూ–బానిసత్వమే లేకపోతే గ్రీకు నాగరికగతా వుండేది కాదు అన్నాడు.

## అనార్య అదిమ వాసుల నుండే పంచమ కులాలు

ఆర్యులు భారతదేశానికి వచ్చేనాటికి పశుపాలకులైన సంచార జాతులు–వారు భారతదేశంలో అడుగు పెట్టేనాటికి ఇక్కడున్న ఆదిమవాసులు వ్యవసాయం ఎరుగుదురు. వారితో పట్టణ నాగరికత వచ్చేసింది. మొహెంజోదారో (సింధు), లోధాల్ (గుజరాత్) లలో తవ్వకాలు దీనిని నిరూపిస్తున్నాయి. పంటల ప్రయోజనం ఆర్యులకి అర్థం అయింది. కాని పండించడం చేతకాదు. పైగా అదో శ్రమతో కూడిన పని. అందుచేత విజితులైన అనార్య తెగలను వ్యవసాయం పనులకి కేటాయించేరు. వారిని ఊరు ఉమ్మడి బానిసలనుగా గ్రామం వెలుపల వుంచేరు. ఇటువంటి బానిసత్వ పద్ధతిని స్పార్టాలో అనుసరించినట్లు చరిత్ర చెప్తోంది. ఈ అనార్య బానిసతే పంచములు. బానిసలుగా చేయబడిన ఈ అనార్య తెగలకు పూర్వమే ఆర్యను తెగలకే చెందినవారు కొందరు పంచములుగా గ్రామాల బయటకు నెట్టివేయబడ్డారు. వారి వృత్తి చర్మకార వృత్తి సమాజ గతి క్రమంలో మానవుడు లోహాలు తవ్వడం, చర్మాలు బాగుచెయ్యడం, వివిధములైన పనిముట్లు చేయడం వంటివి నేర్చేడు. మనుష్యుని ఇష్టానికే వదిలేస్తే బరువైన పనులకి అసహ్యకరమైన పనులకి ఎవ్వరూ రారు. అల్లాంటి పనులకి బలవంతం చేయవలసే వుంటుంది. కాకపోతే సామాజిక జీవితంలో పురోగతి వుండదు. ఆర్యుల దండయాత్రలు నాటికి వారి కున్నది. పశువుల మందలు, వారు ఆచారంగా పాటిస్తున్న యజ్ఞయాగాదులు పశు నివాసం ప్రధానాలు. రంతి దేవుడనే రాజు చేసిన యజ్ఞంలో చంపిన పశువుల చర్మాల నుంచి కారిన నీరు చర్మణ్యతీ నది అయిందని పురాణ కథ. ఈ చర్మాలతో పని చాలా దుర్వాసనతో అసహ్యంగా వుంటుంది. అందుచేత ఆ పనికి నియమించిన వాళ్ళని కూడా గ్రామాల వెలుపలనే వుంచి వుంటారు. వారికిపుడు వ్యవసాయంలో పనిచేసే కొత్త బానిసలు తోడు అయ్యేరు. వీరంతా పంచములుగా వ్యవహరించ బడ్డారు. చర్మకారవృత్తికి నియమించిన ఆర్యతెగ బానిసలు, వ్యవసాయపు పనులకు నియమించిన అనార్య తెగల బానిసలు భిన్న వృత్తులు గల పంచములుగా వ్యవహరించబడి వుంటారు.

మరో విధంగా గ్రామ ఉమ్మడి బానిసలు ఏర్పడిన క్రమాన్ని ఇంకో విధంగా వర్ణించేడు. అలెక్స్ హైలీ తన రూట్స్ నవలలో.

స్వతంత్ర ప్రజలే దుర్భిక్ష సమయంలో గ్రామాలకు గ్రామాలే తరలి వెళ్ళి తమ తెగకే చెందిన సుఖమయ ప్రాంతాలకు ఆశ్రయం కోరి వెడతారు. ఎంతగా తమ తెగకే చెందిన వారైనా గ్రామాలకి గ్రామాలే తరలి వచ్చినపుడు ఆ కాందిశీకులకి తిండి కాదు కదా ఆశ్రయం చూపడం కూడా కష్టమే. కనుక ఈ కాందిశీకులంతా వూరి వెలుపల వుంటూ, గ్రామస్తులకు పనిపాటలలో సాయపడుతూ రోజులు వెళ్ళదీస్తారు. అనువుకానిచోట, తలపై కప్పైనా లేకుండా, కడుపునిండా తిండిలేక పరాయిచోట బతుకులాగడం సహజంగానే అపరిశుభ్రత, అనారోగ్యం, దీనభావం వారిలో చోటుచేసుకుంటాయి. ఎంత ఉదారబుద్ధి. సమతాభావం వున్నా గ్రామస్తులు వారిని తమలో చేర్చుకోలేరు. ఆ క్రమంతో వారు బానిసలుగా మారడాన్ని హైలీ వర్ణిస్తాడు.

ఈ విధంగా మనదేశంలో అనేక పద్ధతులలో పంచమ వర్ణం అంటూ వచ్చింది. అంటే వ్యవసాయ పనులకోసం చంపకుండా మిగిల్చిన పరాజిత అనార్య తెగల ప్రజలు, అంత క్రితమే అసహ్యకరము, భారములు అయిన పనులతో నిర్బంధంగానే, నియమించిన ఆర్య తెగలకే చెందిన బలహీనులు పంచమ వర్ణం అయ్యేరు. వృత్తిరీత్యా వచ్చిన విభజన కులాల రూపం తీసుకుంది. ఆనవాయితీ ప్రకారం ఏ కులానికాకులమే గొప్పదన్న అహమిక గుర్తింపు కోసం కనబరిచే అహంకారం, ఈ కులాలను బిగతీసింది. వేరు చేసింది. హెచ్చు తగ్గులను తెచ్చింది.

కులాల మధ్య అంతరం సమాజ వ్యవస్థలోని దాంపత్య సంబంధాల నిర్మాణ రూపంగా వచ్చింది. తప్ప వేరు కాదు. ఆస్తులు, ఆర్థిక అంతరువులు, రాజకీయ పెత్తందారీ తనం మొదలైనవి అన్ని సమాజాల్లో లాగానే భారతదేశంలో కూడా "బడిత వున్న వాడిదే బర్రె"గా సంక్రమించినవే. వానికి కులాలను కారణం చూపడం, ద్వేషాలు రెచ్చగొట్టడం, విధ్వంసాలు, హత్యలు సాగించడం స్వార్థపూరిత దుష్ట చర్యలు తప్ప వేరుకాదు. ముఖ్యంగా రాజకీయ వర్గాలు–అధికారంలో వున్నవారూ, లేనివారూ, పెత్తందార్లూ, పెత్తనం కోసం ఆశపడుతున్నవారూ, అతివాదులూ, మితవాదులూ, విప్లవ వాదులూ, మత వాదులూ అన్ని తరహాల రాజకీయ స్పర్శ గలవారూ కులభేదాలతో నిమిత్తం లేకుండా ఈ దౌర్జన్యాలను ప్రోత్సహిస్తున్నారు. దౌర్జన్యకారులకు అండగా నిలుస్తున్నారు. ఈ దుర్మార్గుల ఆటకట్టిన నాడే కుల సమస్యకు పరిష్కారం. అదవా అది ఇప్పటికే పరిష్కారం అయ్యే తెరువులో వుంది.

# కులసమస్యలో యిమిడివున్న అంశాలు – పరిష్కారాలు

శ్రీ బి. ఎస్. రాములు

కాలం గాయాల్ని మాన్పుతుంది. చరిత్ర గాయాల్ని కెలుకుతుంది. మరుపుకూడా జ్ఞాపకశక్తి లాగే మానవుడికి అబ్బిన ఒక జ్ఞాన క్రమం. మరుపు అనుభవాల జ్ఞాపకాలుగా మార్చుతుంది. అనుభవాలకూ దాని జ్ఞాపకాలకూ మధ్య జరిగే క్రమం పచ్చి పుండుకూ మానిన తర్వాత దాని మచ్చకూ గల క్రమంలా వుంటుంది. అనుభవాల నుండి పుట్టే జ్ఞానానికీ, ఆ అనుభవాలు లేకుండానే పొందే జ్ఞానానికీ మధ్యవుండే తేడా జ్ఞాన క్రమాల్లోని తేడాను తెలుపుతుంది. మొదటిది పునాది వున్న జ్ఞానం, రెండోది పునాది లేని జ్ఞానం. వర్గ సమస్యగానీ, కుల సమస్యగానీ, స్త్రీ సమస్యగానీ, జాతుల సమస్యగానీ, ప్రాంతీయ అసమానతల సమస్యగానీ అందులోని ప్రత్యక్ష పీడితులు అనుభవాల ద్వారా పొందే జ్ఞానం ఒకటి. ప్రత్యక్ష అనుభవం లేకుండా పొందే జ్ఞానం మరొకటి. భార్య ప్రసవ వేదన పడుతుంటే ప్రసూతి గది బయట (సమస్య పరిష్కరింపబడుతున్న క్రమానికి బయట) భర్త బాధపడుతున్న స్థాయిలో వుంటుంది.

* * *

అదనపు మిగులును పరాయీకరించడం నుంచి రాజ్యం పుట్టిందంటారు. ఆ మాట కొంత వాస్తవమే. కానీ దాంతో పాటు జ్ఞానాన్ని పరాయీకరించడం నుంచే రాజ్యం పుట్టిందనడం మరింత సమగ్రంగా వుంటుంది. రాజ్యం పుట్టుక, అస్తిత్వం చర్చల్లో, జ్ఞాన శాస్త్రం చర్చల్లో యీ అంశం చేర్చి సమన్వయించి చర్చించవలసి వుంది. ఈ పని చేయకపోతే మార్క్సిజం రాజ్యాధికార వాద అనుభవ వాదంగా, కుదించుకు పోతుంది.

అసలు పీడితవర్గం తరఫున టాటా, బిర్లాలు, భూస్వాములు మాట్లాడి, కమ్యూనిస్టుల కన్నా గొప్ప అవగాహన గల వారని కీర్తి పొందడం ఎందుకు? అది ధర్మకర్తృత్వ సిద్ధాంతం అవుతుంది. ధర్మ కర్తృత్వ సిద్ధాంతం మంచిదే. కాదనను, కానీ అది పీడిత ప్రజలకు, వారి ఆశలకు, నాయకత్వానికి లోబడి వుండాలి. గాంధీ ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని యీ చిన్న సవరణతో ఆచరిస్తే ఎంతో మంచి ఫలితాలుంటాయి కూడా. ముఖ్యంగా వర్గ పోరాటం రూపంలో కన్నా సామరస్య పూర్వకంగా పరిష్కరింపబడే క్రమాలు ఉత్పన్నమవుతాయి.

## శూద్రులు పంచమ కులస్తులు

మన దేశంలో ఉత్పత్తిలో పాల్గొనే నిజమైన శ్రామికులు, శూద్రులు, పంచములు. వేల ఏళ్ళుగా వీరి ఉత్పత్తిని అనుభవిస్తూ తద్వారా పుట్టిన జ్ఞానాన్ని వారికి తిరిగి చేర్చడానికి బ్రాహ్మనిజం నిరాకరించింది. సాధారణ విద్యనూ నిరాకరించింది. తద్వారా ప్రజల్లో ఆయా నిర్దిష్ట రంగాల్లోని, వృత్తుల్లోని జ్ఞానం కూడా పరస్పర సంబంధం, జ్ఞాన మార్పిడి నిరాకరించబడ్డంతో అనుభవ వాదం స్థాయిలో నిలిచి పోయింది. ప్రతి నిర్దిష్ట జ్ఞానం, నిర్దిష్ట జ్ఞానంగానే సమస్త యితర సంబంధాల్ని, శక్తి మార్పిడుల్ని కోల్పోయి నిలిచినపుడు అనుభవవాదంగా కుదించుకు పోతుంది. తద్వారా ఆయా కులాల వృత్తి విద్యల జ్ఞానం ఆయా నిర్దిష్ట అనుభవాల స్థాయిలో కుదించుకు పోయాయి. తద్వారా జ్ఞానం ఎదుగుడు, సమాజం, కుల వ్యవస్థ ఎదుగుదల ఆగిపోయింది. వందల ఏళ్ళు యిలాగే సాగింది. పెట్టుబడిదారీ వ్యవస్థ అవకాశాలు, రిజర్వేషన్లు యీ పరిస్థితిని సడలించాయి. తద్వారా జ్ఞానం ఎదుగుదల, సమాజం, కులవ్యవస్థ ఎదుగుదల ఆగిపోయిన దశ నుండి కొత్త చిగుళ్ళు వేయడం ప్రారంభించింది. కుల చైతన్యం పెరగడానికి కరుడు గట్టిన కుల వ్యవస్థ సడలుతుండడమే కారణం. కుల వ్యవస్థ సడలుతూ కులానికీ, కులానికీ మధ్య, భూస్వామ్య, పెట్టుబడిదారీ పీడన వ్యతిరేక పరస్పర సంబంధం, శక్తి మార్పిడి, జ్ఞాన మార్పిడి, ఐక్య ఆచరణ ఎదిగిన క్రమంలో కుల చైతన్యం పెరగడానికి కూడా యిదే ప్రాతిపదిక.

కుల వ్యవస్థలో కుల చైతన్యం, కుల ప్రాపంచిక, దృక్పథం వుండడం సహజం. ఇందులో అసహజత్వం ఏమీ లేదు. వర్గ చైతన్యం పెరగడం వర్గాలు అదృశ్యమయ్యే క్రమం దగ్గర పడడాన్ని సూచిస్తుంది. అలాగే కుల చైతన్యం పెరగడం కుల నిర్మూలన దగ్గర పడడాన్నే స్పష్టం చేస్తుంది.

## దళిత వాదం సాధించిన విజయం

ఈ రోజు మాక్కూడా రిజర్వేషన్లు కావాలి. మేమూ వెనుకబడిన వాళ్ళమే; మేము అస్పృశ్యులమే అంటూ ఎన్నో కులాలు ముందుకు వస్తున్నాయి. అగ్ర కులాధిక్యతావాదం మీద దళితవాదం సాధించిన ఘన విజయం యిది. పీడిత కుల విషాద తాత్వికతను సంతోష తాత్వికతగా పరిష్కరించడంవల్ల యిది సాధ్యపడుతుంది. మేం అగ్ర కులాల్లో పుట్టడమే నేరమా? అనే అభ్యర్థననీ, ఆక్రోశాన్నీ, పశ్చాత్తాపాన్నీ కలిగించింది పీడితరేల వాదమేగానీ, పీడిత వర్గం వాదం కాదు. కమ్యూనిస్టు పార్టీలను కొన్ని చోట్ల మాల, మాదిగల పార్టీలు అని ప్రజలు అనుకుంటే ఔను అని ఆ కులాల పేర్లను సొంతం చేసుకొంటూ, యితర కులాల్లోని పేదలకూ్కడా ప్రతినిధియే అని చెప్పలేక పోయాయి. పై పెచ్చు మాది మాల మాదిగల పార్టీ కాదు అంటూ ఆ కులాల పేర్లకుండే అస్పృశ్యత తమ కెక్కడ అంటుకుంటుందోననే భయంతో కరపత్రాలు అచ్చువేశాయి. నక్సలైట్ పార్టీలు యిందుకు మినహాయింపు

కాదు. వర్గ వాదులు కుల సమస్యను వర్గ సమస్యలో భాగంగానే పరిష్కరించే ప్రయత్నం చేశారుగాని దాన్ని కుల సమస్యలో భాగంగా పరిష్కరించలేక పోయారు. కనుకనే విఫల మౌతున్నారు.

## 1. వర్గరహిత, కులరహిత ప్రాపంచిక దృక్పథం

ఒక జాతిలో, ఒక ప్రాంతంలో, ఒక కులంలో ఒక మతంలో, ఒక లింగంలో మిగిలిన సభ్యుల కన్నా, పౌరులకన్నా సాపేక్షికంగా అభివృద్ధి చెందినవారు తమ స్వీయ అభివృద్ధిని తమ వాళ్ళందరి అభివృద్ధిగా ప్రచారం చేయడానికి, ఊదరగొడుతుంటారు. అభివృద్ధిని అందరికి పంచే ఉత్పత్తి సంబంధాల అభివృద్ధిని, దాని ఆవశ్యకతను, చర్చని మూలకు నెట్టేస్తుంటారు. అణచివేస్తుంటారు. స్వకులంలో, స్వజాతిలో, స్వప్రాంతంలో, స్వమతంలో అభివృద్ధి ఫలితాలు అందని ప్రజలు, ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సాధనాల అభివృద్ధిని గురించి కాకుండా, ఉత్పత్తి సంబంధాల అభివృద్ధిని నిరంతరం ముందుకు తెస్తుంటారు. తేవాల్సి వుంటుంది.

ఉత్పత్తి శక్తుల, ఉత్పత్తి సాధనాల అభివృద్ధి కనువుగా జాతుల సమస్యను కుల సమస్యను, వర్గ సమస్యను వాటి చరిత్రను రాయడం అంటే స్వజాతి, స్వకుల, స్వప్రాంత పరాయీకరణకు, అణిచివేతకు అనువుగా జాతుల సమస్యను వాటి చరిత్రను రాయడం కూడా. కాగా ఉత్పత్తి సంబంధాల కనువుగా ముఖ్యంగా ఉత్పత్తి సంబంధాల్లో అట్టడుగుకు నెట్టి వేయబడ్డవారి అభివృద్ధి కనువుగా స్వకుల సమస్యను, స్వజాతి సమస్యను, స్వప్రాంత సమస్యను, స్వమత సమస్యను పరిష్కరించే ఆచరణ మాత్రమే నిజమైన అశేష ప్రజల కనువైనదవుతుంది. అదే నిజమైన జాతుల చరిత్ర అవుతుంది.

మనువు చాలా కులాలకు, స్త్రీలకు, విద్యను, స్వేచ్ఛను, మంచి వృత్తుల్ని, సామాజిక గౌరవాల్ని నిరాకరించాడు. వర్తమానంలో పోరాడుతున్న పీడిత వర్గాల, కులాల, లింగాల, జాతుల, మతాల, భాషల, ప్రాంతాల ప్రజల్లోని మరీ వెనుకబడిన ప్రజలు తమ ఆచరణ నుండి ఉత్పన్న మవుతున్న సంపద, జ్ఞాన క్రమం తమది కాకుండా యితరులకెందుకు చేరుతున్నది అని ప్రశ్నించుకొంటున్నారు. మనువు దీన్ని స్వర్గ సుఖాలు కర్మ పునర్జన్మ చూపి వర్తమానం నుండి భవిష్యత్తు వాయిదా వేశాడు. అలాగే కొందరు ఈ ప్రశ్నల్ని సోషలిజం దాకా, నూతన ప్రజాస్వామిక విప్లవం దాకా, జాతుల సమస్య పరిష్కారందాకా వాయిదా వేస్తున్నారు. వర్తమానంలో మా అభివృద్ధి మా సంపద, మా జ్ఞానం, మా ఉద్యోగాలు, మా రిజర్వేషన్లు, మా అవసరాలు, మా నాయకత్వం, మా విద్య అని నిలదీస్తే దాన్ని వర్తమానంలో పరిష్కరించకుండా నిరోధించి నిరాకరించడం, వర్తమాన ప్రజలపట్ల మోసము యథాతథవాదం తప్ప మరేమీ కాదు.

పీడిత కుల సంస్థలు పీడిత కుల పార్టీలు మినహా మిగిలిన దాదాపు అన్ని పార్టీల్లోను, సంస్థల్లోను దోపిడీ కులాల నాయకత్వం కొనసాగుతున్నది. వీళ్ళు తమ సొంత కులాల్లోని పేద ప్రజల్లో దోపిడీ కుల స్వభావాన్ని తొలగించే కృషి అన్నింటికన్నా ముందు చేయాల్సి వుంది. దశాబ్దాలుగా వీరీ కృషిలో ఘోరంగా విఫలమయ్యారు. వారు తమ స్వకులాల పేదల్ని ఆర్గనైజ్ చేయవలసివుంది.

పీడిత కుల సమస్య పరిష్కారానికి ఉత్పత్తి సంబంధాల అభివృద్ధి సిద్ధాంతం ప్రాతిపదిక, కార్మిక వర్గ దృక్పథం ఉత్పత్తి శక్తుల ఉత్పత్తి సాధనాల అభివృద్ధి సిద్ధాంతం ద్వారా సమస్యల్ని పరిష్కరించే ప్రయత్నం చేస్తుంది. ఈ రెంటి మధ్య వైరుధ్యం వుంది.

## 2. మార్క్సిస్టు మౌలిక సూత్రాలు సమాజానికి అతీతమైనవా?

కులం అనేది ఒక ప్రాపంచిక దృక్పథం. వర్ణ దృక్పథం, మన దేశంలో వేల ఏళ్ళుగా ప్రాపంచిక దృక్పథంగా కొనసాగుతూ వస్తున్నాయి. ప్రపంచంలోని అత్యంత ప్రాచీన ప్రాపంచిక దృక్పథాల్లో యిది ఒకటి, కుల దృక్పథం సమస్త ఆచరణలకు, సంబంధాలకు, కుల వ్యవస్థ ప్రతిపాదిత విలువలను ఆపాదిస్తూ పరిశీలిస్తుంది. వర్ణ దృక్పథం కన్నా ఎంతో విస్తృత స్థాయిలో దీన్ని సాధించింది కుల దృక్పథం.

ఆర్.ఎస్.ఎస్. వంటి హిందూ తత్వవాదులు నేడు తమకు కుల దృక్పథం ప్రాతిపదిక కాదంటున్నారు. వారు హిందూ మతం తను ప్రాతిపదిక అంటున్నారు. వారిని వ్యతిరేకించేవారు దాన్ని దోపిడీ కుల దృక్పథం ప్రాతిపదిక గల సంస్థ అంటున్నారు. వామపక్ష వాదులు తమకు వర్గ దృక్పథం ప్రాతిపదిక అంటున్నారు. దళితవాదులు వారిని దోపిడీ కుల దృక్పథం ప్రాతిపదిక గల సంస్థలు అని అంటున్నాయి.

కాంగ్రెస్, జనతాదళ్, సోషలిస్టు పార్టీలు కుల దృక్పథం ప్రాతిపదికను అంగీకరించాయి. బి.జె.పి కూడా అంగీకరించింది. ఆర్.ఎస్.ఎస్., వామపక్షాలు, కుల దృక్పథం ప్రాతిపదికను అంగీకరించటంలేదు. పైగా అని కులాన్ని గుర్తించ నిరాకరిస్తున్నాయి. కాంగ్రెస్ తను సంస్థాగతంగాను, పదవులపంపిణీలోను కుల ప్రాతినిధ్య దృక్పథాన్ని ఆచరించే ప్రయత్నం చేస్తున్నది. జనతాదళ్, సోషలిస్టులు, అరవైశాతం పీడిత కులస్థులకే పదవులు కేటాయించాలని అంటూ ఎంతో కొంత ఆచరించే ప్రయత్నం చేస్తున్నారు. మార్క్సిస్టులు దీన్ని ఎందుకు ఆచరించడం లేదో అర్థంకాని విషయం. వారు మార్క్సిస్టు మౌలిక సూత్రాలను సమాజానికి అతీతమైనవిగా భావిస్తున్నారా?

మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్, మావో మొదలైన వాళ్ళు ప్రతిపాదించిన అంశాలు ప్రశ్నించ డానికి తిరగదోడడానికి వీల్లేని వైతే, వేదాలు అపౌరు. షేయాలు, వాటిని ప్రశ్నించే వీల్లేదు అనే స్థాయికి చెందినవవుతాయి. మార్క్సిస్టు ప్రాథమిక మౌలిక సూత్రాలు ప్రశ్నించ వీల్లేని

వేదమంత్రాల వంటివా? మార్క్సిస్టు మౌలిక సూత్రాలు సమాజానికి సామాజిక మార్పులకు అతీతంగా అతీంద్రియ శక్తులుగా "ఆత్మ" లాగా స్వంత స్వతంత్ర ఆస్తిత్వాన్ని కొనసాగించే అవకాశం వుందా? లేక సమాజంతోపాటు సమాజంలాగే మార్క్సిజం కూడా మౌలిక సూత్రాల్తో సహా సమూలంగా మారుతుందా?

మొదటి రెండు ప్రశ్నలకు ఔను అని జవాబిచ్చే వాళ్ళు మార్క్సిజాన్ని ఒక మతంగా ఆచరిస్తారు. బ్రాహ్మణులు వేదాలు చేజిక్కించుకొన్నట్లుగా వాళ్ళు మార్క్సిజాన్ని చేజిక్కించుకుని నేను చెప్పిందే మార్క్సిస్టు వేదం అంటూ పూజారి వ్యవస్థగా తమ ఆధిపత్యాన్ని కొనసాగించుకోవాల్సిన దుస్థితిలో పడి పోతున్నారు.

మార్క్సిజం మతంగా మారిపోయి, సరిగ్గా చెప్పాలంటే బ్రాహ్మణిజం తాలూకు మతంగా ప్రపంచ వ్యాప్తంగా మారిపోయి చాలా కాలమే అయింది. మతం "చేర్పుల" ద్వారా సవరణల్ని అంగీకరిస్తుంది. మార్క్సిజం యిదే పనిచేస్తే అదీ మతమే అవుతుంది. మతంగా మారితేనే "చేర్పులను" అంగీకరిస్తూ మార్క్సిజాన్ని సమూలంగా మార్చాలనే మార్పుల చర్చను మాత్రం అసహనంగా చూస్తుంది.

మార్క్స్, ఎంగెల్స్ తమకన్నా ముందున్న తమ సమకాలికమైన ప్రతిదాన్ని ప్రశ్నించారు. మనందరం వారిలాగే ప్రతిదాన్ని ప్రశ్నించడం అభ్యసించవలసి వుంది. నా "గతి తర్కతత్వ దర్శన భూమిక" గ్రంథంలో మార్క్సిజం మౌలిక సూత్రాలను మార్క్సిజం ద్వారానే ప్రశ్నించాను.

ప్రతి వస్తువులో విరుద్ధాంశాలుంటాయి. మార్క్సిజంలోనూ విరుద్ధాంశాలుంటాయి. ఐక్యత- ఘర్షణలాగే మంచి చెడు అనేవి కూడా విరుద్ధాంశాలు. మార్క్సిజంలోని మంచి చెడులు విరుద్ధాంశాల ఐక్యతగా ఒకే మార్క్సిజం అనే వ్యక్తిత్వంలో కొనసాగుతాయి. ఐక్యత లేకుండా ఘర్షణ లేదు. రెండూ పరస్పర ఆధారితాలు. అంటే మార్క్సిజంలో మంచి లేకుండా చెడు లేదు. చెడు లేకుండా మంచి లేదు.

## 3. కులానికి ఇతర ప్రాపంచిక దృక్పథాలకూ మధ్య గల వైరుధ్యం

కుల సమస్య దాదాపు స్త్రీ సమస్యంత ప్రాచీనమైనది. స్త్రీ సమస్య వివిధ కాలాల్లో వివిధ రూపాలు తీసుకున్నట్టే కులసమస్య కూడా వివిధ రూపాలుతీసుకుంది. అంతర్జాతీయ స్థాయిలో సోషలిస్టు విప్లవ భావాలు, సామ్రాజ్యవాద దేశాలు స్త్రీ సమస్యను మరెన్నో కొత్త కోణాల్లో ముందుకు తెచ్చాయి. ఈ నేపథ్యంలో కుల సమస్య కొత్త కోణాల్లో, లోతైన విశ్లేషణతో ముందుకు సాగుతున్నది. స్త్రీ సమస్యపై వర్గ సమస్యపై ప్రపంచ వ్యాప్తంగా అన్ని వైపులా పరిశీలనలు సాగాయి. కాగా కుల సమస్య భారతదేశానికే ప్రత్యేకమైంది. అందువల్ల స్త్రీ సమస్యపై, వర్గ సమస్యపై ప్రపంచమంతటా సాగినన్ని ఆందోళనలు పరిశీలనలు, కుల సమస్యపై ఒక్క భారత దేశంలోనే జరగవలసి వున్నాయి.

ఉదాహరణకు, జగిత్యాలకు నాలుగా కిలోమీటర్ల దూరంలోగల పొలస గ్రామాన్ని తీసుకుందాం. అక్కడ పుల్లారెడ్డి గ్రూపు, పీపుల్స్‌వార్ గ్రూపు పదిహేనేళ్లుగా బలంగా వున్నాయి. అయినా రజకులు, దళితులు బట్టలుతికే సమస్యే పరిష్కరింపబడలేదు. అసలది ఎజెండాలోకే తీసుకోబడలేదు. ఇటీవల అంబేద్కర్ యువజన సంఘం ఏర్పడ్డాక దాన్ని ఎజెండాలోకి తెచ్చింది. దళితులు పూర్వంనించీ వారి బట్టలను చెరువులకు తీసుకువెళ్లి, రజకులకు తడిపి యివ్వాలి. వాటిపై మరోసారి నీళ్ల జల్లి రజకులు స్వీకరించి ఉతికి వారి యింట్లో వేసుకుంటారు. అక్కడి నుండి తిరిగి దళితులే వచ్చి తీసుకెళ్లాలి. మిగిలిన కులాలకు, అలాకాదు. రజకులే యిళ్ళకు వచ్చి తీసుకెళ్తారు. తెచ్చియిస్తారు. దళితుల్లో ఒక రిద్దరు ఉపాధ్యాయిలు, ఉద్యోగస్తులు అయ్యారు. ఈ పద్ధతి వారి ఆత్మగౌరవానికి, సామాజిక గౌరావానికి అవమానకరంగా తోచి ఆవేదన చెందారు. అందరి కన్నా ఒక రూపాయి కూలి ఎక్కువ తేసుకొనైనా అందరిలాగే ఉతకమంటే కూడా అది పంచాయతీ సర్పంచి, గ్రామ సభ చర్చల్లో నిరాకరించబడింది. వాళ్ల సొంతంగా ఉతుక్కోవడమో, జగిత్యాలకు పంపడమో చేస్తుండేవారు. ఆ తర్వాత కొన్నేళ్ళకు అంబేద్కర్ యువజన సంఘం ఏర్పడ్డాక తిరిగి ఈ సమస్యగా కులం అందరి సమస్యగా ఎజెండాలోకి వచ్చింది. తెలుగుదేశం, కాంగ్రెసు మండలాధ్యక్షులూ, ఎమ్మెల్లేలూ సముదాయించారు. సబ్-కలెక్టరు దీన్ని స్పష్టంగా అస్పృశ్యతా సమస్య గుర్తించి ఉతికితే అందరికీ ఒకేలా ఉతకండి లేదా అందరికీ మానేయండి అని చెప్పారు. వారు అందరికీ మానేయడానికే నిర్ణయించుకున్నారు. దాంతో దళితవాడల రక్షణ కోసం పోలీసు క్యాంపు పెట్టించాడు సబ్-కలెక్టర్. మూడున్నర నెలలు అలాగే సాగింది. దళిత సంఘాల, రజక సంఘాల, జిల్లా స్థాయి, రాష్ట్ర స్థాయి నాయకులతో సహా అన్ని పార్టీల నాయకులు సమస్యను పరిష్కరించే ప్రయత్నం చేశారు. ఇది రజకుల సమస్యగా కనపడ్తున్నది. కానీ వారు పాత్రధారులు మాత్రమే. నిజానికది గ్రామస్తుల సమస్య. వాళ్లు తమ బట్టలూ, దళితుల బట్టలూ కలిపి తీసికెళ్ళే ఆచరణను నిరాకరించారు. సమస్య అలాగే మిగిలిపోయింది. పాత పద్ధతిలో చెరువుకు తెచ్చివేసే దళితుల బట్టలు మాత్రమే ఉతకాలనే నిర్ణయంతో ఊరి వాళ్లందరూ రజకులకు బట్టలు వేయడం ప్రారంభించారు. ఊరి వాళ్లు మళ్లీ మాలమాదిగలను రెండుగా విడదీశారు. ఇలా సమస్య పరిష్కారం కాకుండానే నీరుకారిపోయింది. ఇది పొలాస సమస్య మాత్రమే కాదు. వేలాది గ్రామాల్లో యిదే స్థితి. నిజామాబాద్ జిల్లాలో పీపుల్స్‌వార్ పార్టీలోని కార్యకర్తలు కొందరు దళితుల పట్టాన యీ సమస్య ఆత్మగౌరవాన్ని ఎంత కలచివేస్తుందో అనుభవించి వుండడాన కొన్ని గ్రామాల్లో కొంత బలవంతంగా ఈ పద్ధతిని మాన్పించి అందరికీ ఒకే పద్ధతిని అమలు పరిచారు. అపుడు పీపుల్స్‌వార్ పార్టీకి వ్యతిరేకంగా ఆ గ్రామాలు దాదాపు తిరుగుబాటు చేసినంత పని చేశాయి.

## వర్గ దృక్పథానికి లోబడే పోరాటం

పీడిత కుల దృక్పథానికి లోబడి వర్గ దృక్పథం ఆచరించబడినపుడే ఈ సమస్యలు పరిష్కారం అవుతాయి. అది పదిహేనేళ్ల విప్లవోద్యమం కావచ్చు. డెబ్బయి ఏళ్ల విప్లవోద్యమం కావచ్చు. పొలాస వంటి సవాలక్ష సమస్యలు ఎదురు కాగానే వ్యతిరేక, పొడసూపడం అంతదాకా సాగిన ఆచరణలో గల ప్రాపంచిక దృక్పథం, దోపిడీ కుల దృక్పథం పరిమితులకు లోబడి సాగిందనే స్పష్టం చేస్తాయి.

పీడిత కులాల ప్రజలు, పీడిత కుల స్త్రీలు శాంతి యుత సహజీవనాన్ని కోరుకొంటారు. వారి యీ ఆకాంక్షే వేల ఏళ్ళుగా కుల వ్యవస్థ కొన సాగుతూ రావడానికి కారణమైంది కూడా. లేనట్టయితే రాజులు, రాజ్యాలు, కుల వ్యవస్థలు, ఏనాడో కుప్పకూలి పోయేవి. అందులో మరీ ముఖ్యంగా స్త్రీలు పిల్లల, పెంపకం, వృద్ధుల పోషణ, కుటుంబ జీవితం, స్థిర నివాసం, ఉత్పత్తి సంబంధాల అభివృద్ధి ఏకకాలంలో జరగడం మొదలైన వాటికి అనువుగా ప్రాపంచిక దృక్పథం, వ్యూహం, ఎత్తుగడలు, ఆచరణ సాగిస్తారు. పర్యవసానంగా రాజ్యహింసకు సాకులు దొరికే రీతిలో కాకుండా, రాజ్యం రాజ్యహింసలే అదృశ్యమయ్యేరీతిలో ముందుకు సాగుతారు. ప్రతి సమస్యను రాజకీయంచేసి రాజకీయ పరిష్కారాల పేరిట రాజ్యాధికార అస్తిత్వాన్ని ఉత్పన్నంచేసే, ప్రస్తుత ఆచరణ అదృశ్యమవుతుంది. ఏ సమస్యనైనా దాన్ని రాజకీయం చేయకుండా దాన్నొక సామాజిక సమస్యగా పరిష్కరించే తాత్విక ప్రాపంచిక దృక్పథం ఒక సమగ్రతలో వెల్లివిరుస్తుంది.

## 4. ప్రజా పోరాటాలు పీడిత కుల పోరాటాల్లోని ఒక పాయ మాత్రమే

"దున్నే వాడికే భూమి" నినాదం ఉత్పత్తి శక్తుల అభివృద్ధి సిద్ధాంతం ప్రాతిపదిక నుండి పుట్టిందే. దీని వల్ల భూమిమీద ఒత్తిడి తగ్గకపోగా భూమి యాజమాన్యం మీద ఒత్తిడి పెరిగింది. పర్యవసానంగా పెట్టుబడిదారీ అభివృద్ధి క్రమంలో తమవంతు వాటా కోసం భూస్వాములు, ధనిక రైతులు ఎగబడ్డారు. అలా వృత్తి ఉద్యోగాల్లో అధిక శాతం అగ్రకులాల వాళ్ళే చేరడాన్ని ఉత్పన్నం చేశారు. తద్వారా లభించిన సామాజిక గౌరవం, అధికారాదాయ వనరులతో కొత్త శక్తిని సంతరించుకొని, దోపిడీ కులాలు, దోపిడీ వర్గాలు, భూయాజమాన్యం, కంట్రోలును మరింత పటిష్టం చేసికొన్నాయి. దోపిడీ కులాల్లో మరింత కులతత్వం పెరగడానికి యిలా కమ్యూనిస్టులు కూడా దోహదం చేశారు.

(సంగ్రహ పాఠం)

# వృత్తిపరంగా మహామారిగా మారిన కుల వ్యవస్థ

శ్రీ గోవాడ నిరీక్షణరావు

భారతదేశ లౌకిక ప్రజాస్వామ్య వ్యవస్థ పురోగమించాలంటే సమసమాజ స్థాపనకు మార్గదర్శకం కావాలంటే, ముందుగా కుల, మతతత్వాలు సమసిపోయి, ఆర్థికపరంగా బడుగు వర్గాలు అభివృద్ధి చెందాలి. అప్పుడే దేశం బాగుపడగలదు.

సమాజ పరిణామంలో భారతదేశంలో శ్రమ విభజనతో ప్రారంభం అయిన కులాలు క్రమ క్రమంగా శాఖోపశాఖలుగా ఒకే కులంలో అనేక శాఖలుగా సమాజాభివృద్ధికి శత్రువుగా, మహామారిగా తయారైంది. భారతదేశంలో వున్నన్ని కులాలు ప్రపంచంలో మరే దేశంలోనూ లేవు. కుల సంఘాలు విచ్చలవిడిగా ఏర్పడి సమాజంలో చీడపురుగులా పట్టి తినివేస్తున్నాయి. ప్రపంచం మారింది. సమాజం మారింది. మారుతోంది. శాస్త్రీయ విజ్ఞానం పెరిగింది. పరిస్థితులు మారినాయి. వృత్తులు మారినాయి. పూర్వం చెప్పులు ఒకే కులం వారు కుట్టేవారు. వారు అంటరానివారు. కాని, యిప్పుడు లాభము కోసం అగ్ర వర్ణాలవారు కూడా చెప్పులు (పాదరక్షలు) తయారు చేస్తున్నారు.

## అసంఖ్యాక కులాలు, అంతులేని శాఖోపశాఖలు

వృత్తిపరంగా బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్రులుగాను, ఆ తర్వాత పంచములుగాను వచ్చాయి. బ్రాహ్మణులో అనేక శాఖోపశాఖలు. నియోగులు, వైదీకులు, ప్రథమ శాఖలు, లింగధారులు (శైవులు) రానురాను నిలువుబొట్టు, అడ్డబొట్టు వగైరాలుగా కొన్ని వందల శాఖోపశాఖలు వచ్చాయి.

ఇక దళితుల్లో (పంచముల్లో) మాల, మాదిగ, మాల దాసరి, మాదిగ దాసరి, పంబలి, జంగం, మాష్టీనులు వగైరా శాఖలు వచ్చాయి. దళితుల్లో ఒకరి నొకరు కనీసం మంచినీళ్ల చెరువుల్లో, నూతు(బావు)ల్లో నీరు తీసుకొనడానికి కూడా వీలులేని ఆంక్షలు వీరిలో వీరికే వుండేవి. కుల తగాదాలు విజృంభించిన సంఘటనలు గలవు.

పశ్చిమ గోదావరి జిల్లా, నర్సాపురము తాలూకా మల్లవరపు లంకలో ఆనాడు పంచముల్లో మోతుబరి భూస్వామియైన, లోయర్‌గ్రేడ్ ఉపాధ్యాయుడైన గొట్టుముక్కల వెంకన్న (వారు తార్వత కాలంలో కాంగ్రెస్ శాసనసభ్యులుగా కృషి చేసినవారు) వారి తండ్రిగారు కలిసి, తమ యింటిముందు గల వుమ్మడి మంచినీళ్ళ చెరువులో మాదిగలను మంచినీళ్లు తీసుకొనకుండగా ఆంక్షలు పెట్టి, వారిపై దౌర్జన్యము చేయడం, అక్కడనే 1928 సం॥లో లేబరు స్కూలు మాస్టరుగా పనిచేస్తున్న అభ్యుదయ కవి, పోలుకొండ భద్రయ్యగారు, జనాన్ని సమీకరించి, సమిష్టిగా ఉద్యమము నిర్మించి, యీ దురంతాల్ని ఎదుర్కోవడం జరిగినది. దాన్ని మచిలీపట్నములో వారపత్రికగా ప్రచురింపబడుతున్న

"దీనబంధు" పత్రికాధిపతి వేమూరి రాంజీరావు పంతులుగారు ప్రచురించి, అప్పట్లో వారి వసతిగృహములో చదువుకొనుచున్న మాబోటి విద్యార్థులను ప్రోత్సహించి, మాల-మాదిగ సమస్యను తీవ్రతరం చేయరాదనే ఉద్దేశంతో, హాస్టల్ విద్యార్థులు కొందరు ఆ గ్రామమునకు వెళ్ళి పాల్గొని, అలనాటి సమస్యను పరిష్కరించడములో ప్రధానపాత్ర యీ వ్యాసకర్త వహించడం, జయప్రదంగా మాల, మాదిగ సమస్య సమసిపోవడం జరిగింది. అలాగే, దివితాలూకా హంసలదీవి సముద్రములో పంచములు (దళితులు) స్నానము చేస్తుంటే అగ్రవర్ణాలు అడ్డగించేవారు. పంచములు స్కూళ్ళకు వెళితే దూరంగా కూర్చోబెట్టేవారు. అగ్ర జాతివారు విదేశాలకు విద్యకై ఓడలమీద వెళ్లితే, వెలివేసేవారు.

## పంచములు చదువుకోడానికి అవకాశాలు కల్పించిన సంఘ సంస్కర్తలు

ఇప్పుడు సైన్స్, టెక్నాలజీ వగైరా అభివృద్ధి చెంది, సమాజాన్ని శాస్త్రీయ దృక్పథంలో పరిశీలన ప్రారంభమైన దశ వచ్చింది. దళితులు చదువుకొనడానికి వీలులేని పరిస్థితుల్లో వీటికి వ్యతిరేకముగా సంఘ సంస్కర్తలు, ప్రముఖులు, సాంఘిక సేవా తత్పరులు బయలుదేరి సమాజంలో మార్పులు తెచ్చుటకు యెనలేని కృషి చేశారు. అలాంటి వారిని ఛాందసులు, మతోన్మాదులు, మఠాధిపతులు, పీఠాధిపతులు వెలివేశారు. వారిలో ముఖ్యులు బందరులో వేమూరి రాంజీరావు పంతులుగారు, గుడివాడలో గూడూరి రామచంద్రరావు పంతులుగారు, రాజమండ్రిలో వీరేశలింగం పంతులుగారు, గుంటూరులో హనుమంతరావు పంతులుగారు, నిడదవోల్లో తాడిమేటి కుటుంబ శాస్త్రిగారు, తణుకులో ముదిగంటి జగ్గన్న శాస్త్రిగారు, తుంగపూడి వెంకటశర్మగారు, అవటపల్లి హనుమంతరావు పంతులుగారు, యిలా ఎంతోమంది గలరు. అది చరిత్రలో చెరిగిపోని విషయం. వారి సాంఘిక సంస్కరణవల్ల తెలుగు దేశంలో పంచములు చదువుకొనుటకు అవకాశాలు కల్గినవి. అలాగే, పంచముడు సంస్కృతము చదువుటకు వీలులేని సమయంలో బందరు తాలూకా, చిట్టి గూడూరు చిన్న ఉపగ్రామంలో ఎస్.టి.జి. వరదాచార్యులువారు సంస్కృత పాఠశాలలో పంచములకు ఉచిత విద్య గరిపిన మహనీయులు: ఇప్పటికీ యీ పాఠశాలలో దళితులకు అవకాశాలు మెండుగా గలవు.

పంచముడు గొడుగు వేసుకొని గ్రామం మధ్య నడవకూడదన్న సంఘటనలు ఆనాడు ఉండేవి. కృష్ణాజిల్లా డోకిపర్రు గ్రామం మధ్య ఒక పంచముడు తాటియాకుల గొడుగు వేసుకొని వెళుతున్నప్పుడు, అగ్ర వర్ణాలవారు, ఆ తాటియాకుల గొడుగును విరగగొట్టి, ఆ వ్యక్తిని కొట్టిన కేసు, గుడివాడ కోర్టులో శిక్షలు కూడా పడిన విషయము గుర్తు చేయక తప్పదు. ఇలాంటి సంఘటనలు వేలకువేలు గలవు.

## జాతీయోద్యమంలో భాగంగా అస్పృశ్యతా నివారణోద్యమం

వీటి అన్నిటికీ వ్యతిరేకంగా మార్పు వచ్చింది, స్వాతంత్ర్య పోరాట కాలంలో, బ్రిటిష్ సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా సాగిన స్వాతంత్ర్యోద్యమంలో దళితుల (పంచముల)తో సహా అందరినీ సమైక్యపరచి ఉద్యమాన్ని నడిపించాల్సిన చారిత్రక అవసరాన్ని గమనించి, మహాత్మాగాంధీ బడుగు వర్గాల సమీకరణకు పూనుకొన్నారు. అంటరానితనానికి వ్యతిరేకంగా, సహపంక్తి భోజనాలు, హరిజన దేవాలయ ప్రవేశాలు మొదలైనవి చేపట్టారు. 1933 సంవత్సరంలో ఘంటసాల గ్రామంలో పూజ్యులు గొట్టిపాటి బ్రహ్మయ్యగారి నాయకత్వంలో ఉన్నవ లక్ష్మీనారాయణ అధ్యక్షతన సభ జరిపి, యీ వ్యాసకర్తచేత ప్రప్రథమముగా హరిజన దేవాలయ ప్రవేశము చేయించిన ఘనత ఘంటసాల గ్రామానికే దక్కుతుంది.

ఈ తరుణంలో సమాజంలో అతి నీచంగా చూడబడుతూ, ఆర్థికంగా బానిసలుగా వున్న బడుగు వర్గాల ఆర్థిక పరిస్థితి బాగుపడితేనేగాని ఈ దుర్భర పరిస్థితి మారదని, ఆర్థిక అభ్యున్నతికి యెనలేని కృషి చేసిన ఘనత కమ్యూనిస్టులకే దక్కుతుంది.

## దళితులకై కమ్యూనిస్టుపార్టీ పోరాటం

గాంధీ మహాత్ముని అస్పృశ్యతా ఉద్యమమూ, మరొక ప్రక్క వామపక్ష పార్టీ కమ్యూనిస్టుల ఆర్థిక సమానత్వ ఉద్యమాలు దళితులలో చైతన్యాన్ని కలిగించాయి. అనేకమంది దళితులు స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు. అదే రీతిగా యీ వ్యాసకర్త స్వాతంత్ర్య పోరాటాల్లో పాల్గొని జైళ్ళ కెళ్లిన చరిత్ర చెప్పక తప్పదు. అనేకులు అనేక త్యాగాలు చేశారు. జైళ్ళకు వెళ్ళారు. ఉరికంబాలకెక్కి అమర వీరులయ్యారు. స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్న వారంతా కుల, మత, వర్గ, వర్ణ విభేదాలు మరచి, అంతా భారతీయులమే అనే భావముతో పోరాటాలు సాగించినప్పుడు యీ కుల వ్యవస్థ అడ్డము రాలేదు.

## విభజించి పాలించే బ్రిటిష్ రాజనీతి

అప్పటికీ, బ్రిటిష్‌వారి పాలనవల్ల, విభజించి పాలించే విధానంవల్ల కొంతమంది పంచములను, అగ్రజాతి వారలను ఆకర్షించి, వారిని ఆర్థికంగా ఆదుకొనడానికి, వారి నికృష్ట జీవితాలను సరిదిద్దడానికనే సాకుతో క్రైస్తవ మతము యిచ్చి, విద్యావంతులుగా చేసి, పదవుల్లో వుంచి,వారిని ఆర్థికంగా అభివృద్ధి పర్చిన విషయాన్ని మరచిపోరాదు. అప్పట్లో కూడా దళితులు అగ్రవర్ణాలు చేసే దాడులు, అవమానాలు, అఘాయిత్యాలు, మానభంగాలు, దోపిడీలు వగైరాలకు గురి అయ్యేవారు. కాని, ఆ విషయాలు అప్పట్లో ప్రజల ముందుకు వచ్చేవికావు. బ్రిటిష్ పాలకులే వాటిని కొంతవరకు అరికట్టేవారు. అప్పుడు యిన్ని దిన, వార, పక్ష, మాస పత్రికలు

లేవు. ప్రజల దృష్టికి వచ్చేవి కావు. భారతదేశ స్వాతంత్ర్యానంతరం దేశంలో కమ్యూనికేషన్లు పెరిగాయి. ఆర్థికాభివృద్ధి పెరిగింది. కాని, దళితుల ఆర్థిక పరిస్థితి మారలేదు. అసంఖ్యాకులు గర్భదరిద్రులుగా దుర్భర జీవితం గడుపుతున్నారు. దళితులపై అగ్రవర్ణాల దాడులు బాగా జరుగుతున్నాయి. వాటికి వ్యతిరేకంగా వృత్తి సంఘాలు ఏర్పడి, వారి సమస్యల కొరకు ఉద్యమాలు నిర్మించి పోరాటాలు సాగిస్తున్నారు.

## భూ సంస్కరణల ఆవశ్యకత

గ్రామీణ ప్రాంతాల్లో వ్యవసాయం ప్రధాన వృత్తి. జాతీయ ఆదాయంలో ప్రధాన ఆదాయం వ్యవసాయం నుండి వస్తుంది. జాతీయ ఆదాయానికి మూలమైన వ్యవసాయ కార్మికులకు, గ్రామీణ పేదలకు అవసరమైన భూసంస్కరణలు అమలు జరగటంలేదు. భూసంస్కరణలు అమలు జరిగితే అసంఖ్యాకంగా వున్న నిరుపేదలకు కొంత భూమి వస్తుంది. భూమి స్వంతంగా పండించుకుంటే ఆదాయం పెరిగి, తమ కాళ్ళమీద నిలబడగల ఆర్థిక సత్తా వస్తుంది. కొనుగోలు శక్తి పెరుగుతుంది. అత్యధిక సంఖ్యాకుల కొనుగోలు శక్తి పెరిగితే పరిశ్రమలు అభివృద్ధి చెందుతాయి. భారతదేశం ముందుకుపోతుంది. ఈ జటిల సమస్య పరిష్కారం కాకుండా దేశం అభివృద్ధి అసాధ్యము.

ఈనాడు పత్రికల ప్రభావం అధికంగా వుండటమేగాక, ప్రతి పల్లెలోనూ, ప్రాంతీయ పార్టీలతో పాటు, ప్రాంతీయ విలేఖరులుండటంతో ప్రతి చిన్న విషయమూ వెలుగులోకి రావడమేకాక, ప్రతి చిన్న సంఘటనలను దళితులు సంఘటిత శక్తితో ఎదుర్కోడానికి యీనాటి పత్రికలు ఉపయోగపడుతున్నాయి. ఇన్నాళ్ళూ జరిగిన ఆరాచకాలు బహిర్గతం కాకపోవడంతో, యిప్పుడు ప్రతి విషయంలో ప్రతివారు స్పందించి, నిత్యమూ అగ్రవర్ణాలవారు దళితులపై సాగించే దాడులను త్రిప్పికొట్టే దానికి అవకాశాలు మెరుగుపడినవి.

## అగ్రవర్ణాలవారి ఈర్ష్య – అసూయ

స్వాతంత్ర్యానంతరము దళితులకు కల్పించిన సంక్షేమ పథకాలు, ఆర్థికపరంగా అప్పులు ఏదో కొంతలో కొంత ఉపయోగపడినా, మధ్య దళారుల బాధతో సక్రమంగా అందవలసినది అందడంలేదు. పైగా రిజర్వేషన్లు, స్కాలర్‌షిప్పు, యితర ఉపకార వేతనాలు వగైరాలు దళితులకు ప్రభుత్వముచే కల్పించబడటంతో, అగ్ర జాతిలో ఈర్ష్య పెరిగిపోయింది. సహనం కోల్పోయి, దళితులపై కక్షతో దాడులు, మానభంగాలు, హత్యలు, దోపిడీలకు అతి బహిరంగంగా పాలుపడుతున్నారు. దీనికి మూలకారణము దళితులు ఆర్థికంగా బలపడక పోవడం, పీడిత ప్రజలందరూ ఏకం కాకపోవడం, సమైక్యత లోపించడమే! ఈనాటి పత్రికాలోకం, వీటిని పతాక శీర్షికలతో బట్టబయలు చేసినప్పుడు ప్రభుత్వ రంగం కదలించడానికి, దళితులు పోరాటాలు సాగించకపోవడంతో, తిరిగి గ్రామాల్లోగల అగ్రజాతులవారు మూక ఉమ్మడిగా దాడులు చేస్తున్నారు. ఇదే, యీ మధ్య జరిగిన కారంచేడు, నీరుకొండ, మున్నగు గ్రామాల్లో సాగిన దుర్మార్గపు చరిత్ర, రక్తపు టేరులుగా కొనసాగిన ఉదంతములు.

## వోట్ల కోసం, సీట్ల కోసం కులతత్వం

లోగడ గ్రామాల్లో అన్ని కులాలవారు వావి-వరుసలతో సంబోధించుకొని, జనజీవనంచేసేవారు. ఈనాడు దళితులపై ఈర్ష్యతో, కక్షతో మానవత్వమే మరచిపోయి మరుభూములుగా తయారు చేస్తున్న విషయము, దాని వెనక వున్న అదృశ్యహస్తము ఓట్ల కొరకు, సీట్లకు, అధికారము కొరకు సాగించే రాజకీయ పార్టీలే దళితులను పావులుగా ఉపయోగించుకొని, ఒక వర్గాన్ని వ్యతిరేకిస్తూ, ఒక వర్గాన్ని చేరదీస్తూ, గ్రామాల్లో కుల సమస్యను తీవ్రతరం చేసి, పబ్బము గడుపుకుంటున్నారు. దళితులు, వెనుకబడిన వారు, చేతివృత్తులవారు భారతదేశంలో అత్యధికులు. జాతీయ ఆదాయానికి వారి శ్రమ శక్తియే మూలాధారము. వారి సమీకరణ, వారి సంఘటిత శక్తి లేనిదే యీ సమాజాన్ని మార్చి సమసమాజాన్ని నిర్మించుట అసంభవం. ఈ మూల విషయాన్ని గుర్తించిన అనేక మంది అభ్యుదయవాదులు, వామపక్షాలు, కమ్యూనిస్టులు, వృత్తి సంఘాలు స్వాతంత్ర్య ఉద్యమకాలంలోనే గుర్తించి, స్థాపించి స్వాతంత్ర్యోద్యమానికి ఎంతో తోడ్పడి ముందుకు తీసుకొనిపోయారు. స్వాతంత్ర్యానంతరం యీ సమస్య యొక్క ప్రాముఖ్యత యింకా పెరిగింది. ఇలా ఏర్పడినవే ట్రేడ్ యూనియన్లు, వ్యవసాయ కార్మిక, మహిళా, యువజన, విద్యార్థి సంఘాలని గుర్తుంచుకోవాలి !

## కాంగ్రెస్ వైఫల్యం

హరిజన, గిరిజన ఆదితర బడుగు వర్గాలపై సాగుతున్న అత్యాచారాలను హత్యాకాండను, మానభంగాలను అరికట్టడానికి సాంఘిక సమానత్వము కోసం మరింత పట్టుదలతో పోరాటాలు నిర్వహించాలి. దీని కొరకు అన్ని రకాల పీడిత ప్రజల్ని వృత్తిసంఘాల్లో సమీకరించి బలపర్చాలి. కులతత్త్వవాదుల స్వార్థపరత్వాన్ని, బడుగువర్గాల్ని చీల్చి, లాభం పొందాలనేవారి ఆటలు కట్టించాలి. కాంగ్రెస్ పుట్టినప్పటి నుంచీ మహాత్మాగాంధీజీ కాంగ్రెస్‌లో చేరినప్పటి నుంచీ భూసంస్కరణలు, అస్పృశ్యతా నివారణ, మద్యపాన నిషేధము, ఖద్దరు ధారణ, భూమిలేని వాడికి భూమి పంచాలని అనేక తీర్మానాలు చేశారు. మరల చేస్తున్నారు. ప్రణాళికల్లో ముచ్చటిస్తున్నారు. ఎన్నికల ప్రణాళికల్లో అందరూ ప్రకటిస్తున్నదేకాని, యింతవరకు కోట్ల బంజరు భూములను, భూస్వాముల చేతుల్లో బినామీగా వున్న భూములుగాని, పేదలకు పంచరు. భూ సమస్యను తీర్చరు.

ప్రధానమంత్రులు, మంత్రులు వగైరాల చేతుల్లో వేలాది ఎకరాల బంజరు భూమిని అంతకన్న విడదీయరు.

## భూమి పంపకం కీలక ప్రాధాన్యత

ఏనాడైతే, భూ సంస్కరణలు చేస్తారో, అన్ని కులాల్లో, అన్ని వర్గాల్లో వున్న పేదలకు భూ పంపిణీ జరుగుతుందో ఆనాడే, వారి ఆర్థిక సమస్య తీరగలదు. ఆర్థికంగా బలపడగలరు. పీడిత ప్రజలంతా ఒక్కటేనని భావించి వారి సంక్షేమానికి కృషి జరుగుతుందో అప్పుడే యీ కుల వ్యవస్థ నాశనము కాగలదు. అంతేగాదు, అన్నికులాలు, అన్నివర్గాలు ఐక్యమై, వర్గ విభేదాలు లేకుండగా పోరాటాలు సాగించాలి. అప్పుడే కుల వ్యవస్థను కూకటివేళ్ళతో పీకివేయగలము.

జబ్బు ఒకటైతే, మందు ఒకటి వేస్తే అలాంటి చికిత్స నిష్ప్రయోజనము. ఎన్ని కోట్లు ఖర్చు పెట్టినప్పటికీ అధి వృధా కాగలదు. ఆర్థికపరంగా దళితులు బాగుపడాలి. దానికి కృషి జరగాలి. దానికిగాను అన్ని కులాల్లో వున్న నిరుపేదలందరికీ భూ పంపిణీ చేయాలి. అదే భారతదేశంలోగల కుల వ్యవస్థకు మూలకారణమైన యీ మహామారి అంతము కాగలదు.

## అంబేద్కర్ అమూల్య కృషి

"భారతరత్న" డాక్టర్ అంబేద్కర్ కూడా కుల వ్యవస్థపై పోరాడి, అర్థికంగా దళితులు బాగుపడినప్పుడే యీ కుల వ్యవస్థ పోగలదని, సమసమాజం ఏర్పడగలదన్నారు. షెడ్యూల్డ్ కులస్తులకు, షెడ్యూల్డు జాతులకు కల్పించిన రిజర్వేషనుల వల్ల సమాజంలో కొన్ని అడ్డంకులు వస్తున్నాయి. అగ్రజాతులవారు, ప్రతి కులానికి రిజర్వేషను కావాలని, కుల సంఘాల ద్వారా పోరాటాలు సాగిస్తున్నారు. ఇలాంటి సమస్య వస్తుందని తలంచే బాబాసాహెబ్ డాక్టర్ అంబేద్కర్ తన చివరి దశలో ఈ రిజర్వేషన్లు తీసివేయాలని ఆందోళన చేశారు. నేడు అదే జరుగుతూంది. రాజకీయ పార్టీలు వీటిని పోషిస్తూ కుల సంఘాల్ని ప్రోత్సహించడం వల్లనే, తిరిగి దళితులపై ఈర్ష్య పెరిగి, దౌర్జన్యాలు, దోపిడీలు, గృహ దహనాలు, మానభంగాలు విచ్చలవిడిగా సాగిస్తున్న నేటి పరిస్థితులకు దారితీస్తూంది.

## పీడిత ప్రజలందరూ ఏకం కావాలి

అందువల్ల పీడిత ప్రజలంతా ఐక్యము కావాలి. ఈ కుల మహామారి పేరుతో ఐక్యతను చెడగొట్టి, విభజించి పాలించే విధానం చోటుచేసుకొని, పరిపాలకులు పీడిత ప్రజలను దోచుకుంటున్న సత్యాన్ని ప్రతివారు గ్రహించాలి.

కొందరు స్వార్థపరులు కులం పేరుతో రెచ్చగొట్టుతున్న సత్యాన్ని కూడా పీడిత ప్రజలు తెలుసుకోవాలి. అందువల్ల ఆఖరిగా నేను మనవి చేసేది, పీడిత ప్రజలంతా ఐక్యమై, సంఘటిత ఐక్య ఉద్యమాన్ని నిర్మించి, పోరాడినప్పుడే ఈ కుల వ్యవస్థ భారతదేశంలో నాశనమవుతుంది. సమసమాజానికి పునాదులవుతుంది. అదే పీడిత ప్రజల అభివృద్ధికీ, పురోగతికాగలదు. భారతదేశం విచ్ఛిన్నం కాకుండగా కాపాడగలదు. ఇది విధిగా జరిగి తీరిలి. దానికి కృషి జరగాలి.

## అంబేద్కర్ సూక్తులు

(1) "కుల వ్యవస్థ మనుష్యులను జాతిరీత్యా విభజించడం లేదు. అది ఒకే జాతిలోని ప్రజలను సాంఘికంగా విభజిస్తోందనే సత్యాన్ని రాజకీయ పార్టీలు గుర్తించాలి."

(2) "పీడిత ప్రజలు తమ హక్కులను సమైక్య వర్గ పోరాటాల ద్వారా మాత్రమే సాధించుకోగలరనే సత్యాన్ని గుర్తించాలి. పీడిత ప్రజలు పోగొట్టుకున్న హక్కులు అడుక్కోవడం ద్వారా సాధించుకోలేరు. దోపిడీదారులను ప్రార్థించడం ద్వారా హక్కులను పొందలేము. నిరంతరమూ పోరాటాల ద్వారానే హక్కుల సాధనకు మార్గం. మేకల్నే కాని, సింహాలను బలి యివ్వరనే నిజాన్ని పీడితప్రజలు గ్రహించాలి".

---

"బ్రాహ్మణుడు ప్రపంచంలో ఉన్న సమస్త వస్తువులకు అధిపతి. వాస్తవానికి, యావత్ ప్రపంచం అతని ఆస్తి. ఇతరులు అతనికి దయాదాక్షిణ్యాలపై ఆధారపడి జీవిస్తారు".

(మనువు)

---

# కుల వ్యవస్థను కూల్చివేద్దాం !

శ్రీమతి హేమలతా లవణం

"సాంఘిక సంస్కరణలనేవి సమాజ పునర్నిర్మాణానికి సంబంధించినవి. వాటిని రాజకీయ సంస్కరణల కంటే ముందు జరిపి తీరాలి. లేకుంటే రాజకీయ విధానాలు సత్ఫలితాలను ఇవ్వలేవు. కులవ్యవస్థపై నిర్మించిన ఏ వ్యవస్థా నిలువలేదు. కుల మనేది ప్రజాశక్తిని నిర్వీర్యం చేస్తుంది"

– అంబేద్కర్

ప్రతి దేశంలోనూ జాతులు, మతాలు ఉన్నాయి. కాని కులాలు లేవు. అన్ని దేశాలలోను వృత్తులను బట్టి, ఆర్థిక వ్యత్యాసాలనుబట్టి వర్గాలు ఏర్పడ్డాయి విశాలమైనవి కావడం వలన కొంతవరకు ప్రమాదం తక్కువ. కాని "కులాల" విషయం ఇందుకు భిన్నం. ఎందుకంటే "కులం" సంకుచితమైన పరిధి. వాటన్నింటికన్నా ఇది మానవ సమాజానికి ఎక్కువ ప్రమాదకరం.

"కుల వ్యవస్థకు అసలు మూలం, ఆర్యుల తెలుపు వర్ణం, అనార్యుల (అప్పటికే భారతాన ఉన్న జాతి) నలుపు వర్ణం. మూలంలో సంఘం రెండే రెండు జాతులుగా ఉన్నది. ఇది ఆర్యులు, అనార్యులు." (హిస్టరీ ఆఫ్ ఇండియా).

## తెలుపు నలుపు వర్ణ భేదం

కులవ్యవస్థను వర్ణించడానికి ప్రయోగించిన పదజాలం వర్ణం, జాతి. అంటే రంగు (శరీర) పుట్టుక. మొదటి రెండు పదాల పుట్టుక, వంశం తెలుపుతాయి. ఆర్య, అనార్యుల మధ్య జాతి భేదాన్ని చూపించడానికే "ఆర్యవర్ణం", "దాస్యవర్ణం"గా ప్రయోగంలోకి వచ్చాయి. ఋగ్వేదంలో ఈ అర్థంలోనే వీటిని ఉపయోగించడం జరిగింది. ఆర్య, అనార్యుల మధ్య రంగు, మతం, ఆచార వ్యవహారాలలో పూర్తి వ్యత్యాసాలతో దండయాత్రికులుగా ఆర్యులు భారతదేశానికి వచ్చినపుడు రాజకీయంగా ఆర్యులు విజేతలు. జాతిపరంగా ఆర్యులు మంచి వర్చస్సు తెలుపు రంగు కలవారు. అనార్యులు "నలుపు". ఈ చిన్న భేదం (అందునా శరీరాకృతిలో) కుల (వర్ణం) వ్యవస్థకు దారితీసింది. ఇప్పుడది మానవుల సహజ సమైక్యతలో చీలికలు తెచ్చిపెట్టింది.

ఇక ఋగ్వేదంలో ఒక విరాట్ పురుషుని వర్ణించి ఆ విరాట్ పురుషుని దేహ భాగాలనుండి మనుషులు వచ్చినట్లు చూపి వారికి ఈ కులం, మతం అంటగట్టడం జరిగింది. ఇది ఈ నాటి కులవ్యవస్థకు గట్టి పునాది వేసింది.

వారి వారి పనులనుబట్టి ఈ విధంగా పేర్లు పెట్టారా? లేక ఆ భాగాలలో నుంచి వారు పుట్టారా? లేక వారు చేసే పనులనుబట్టి వారి తెలివి తేటలను బేరీజు వేసి, ముఖం, బాహువులు, ఊరువులు అన్నింటి కంటే క్రింది స్థానంలో వున్న పాదములు అని ఎక్కువ తక్కువ స్థానాలు వారికి ఇవ్వడం జరిగిందా? ఈ ప్రశ్నలకు ఇప్పుడు జవాబులు అక్కరలేదు. వేల కులాలుగా చీలికలై పోయిన భారతదేశ సమాజాన్ని ఒక్కటిగా చేసి మానవులంతా ఒక్కటేనన్న భావాన్ని పునర్నిర్మించటమే నా ప్రయత్నం.

## "కర్మ" సిద్ధాంతం "ఖర్మ" సిద్ధాంతంగా మార్చారు

ఈ నాలుగు కులాలే కాక అవి ఇంతై, అంతై రెండువేల పై చిలుకుగా అయినాయి ఈనాడు. ఎలా వున్నారు వీరు? తెగలుగా, కులాలుగా, అస్పృశ్యలుగా, సామాజిక గౌరవం లేనివారుగా అణగారిపడి వున్నారు. ఈ స్తబ్దత నుండి చైతన్యవంతులు కాలేనంతటి స్థితిలో వున్నారు. అదే జీవితం తనకు రాసిపెట్టి వుందని, తలరాత, ఖర్మఫలం అని నమ్ముతున్నారు గనుక. నమ్మమని పెవారు చెప్పారు గనుక.

"కర్మ సిద్ధాంతమున నోరు కట్టివేసి
స్వార్థ లోలురు నా భుక్తి ననుభవింత్రు
కర్మమన నేమొ దానికి కర్త యేమొ
ఈశ్వరుని చేత ఋజువు చేయింపవమ్మ".

– (గబ్బిలం కావ్యంలో)

అని జాషువా ప్రశ్నించినట్లే ప్రతి ఒక్కరూ ప్రశ్నించుకున్ననాడు మానవుడిపై రుద్దిన కులం రంగు మాసిపోక ఏమి చేస్తుంది.

శారీరక శ్రమకు ఎక్కువ తక్కువ విలువ కట్టడంలో కూడా కుల తత్వం వుంది. బస్తాలు మోస్తే తక్కువ కూలీ గిడుతుంది. ఇనుపగద ఎత్తితే అది వ్యాయామం అవుతుంది. దానికి విలువ కడుతున్నాం. అందుకే వినోబాబావే చక్కగా అన్నారు. "తిరగలి ఉట్టిదే విసిరితే దానికి శరీర వ్యాయామం అని పేరుపెట్టి, విలువను ఇస్తున్నాము. అదే తిరగలిలో గోధుమలు పోసి విసిరితే, దానిని కూలీ అని, తక్కువగా చూస్తున్నారు." ఈ శ్రమ విలువలలో ఎక్కువ తక్కువలు కూడా మన సమాజంలో "కులాలు," నిలిచి పోవడానికి ఒక కారణము (ఇవి స్త్రీల పనులు ఇవి పరుషుల పనులు అని విభజించినట్లు) నాకు ఒక కులం అంటగట్టడానికి ఎవరినుండి హక్కు?

కుల విభేదం మానవతకు గొడ్డలిపెట్టు, మానవుల వైయక్తిక ప్రతిభ దీనివల్ల నశిస్తుంది. ప్రతిభ, సమర్థతను బట్టి కాక మనిషికి గొప్పదనం "కులాన్ని" బట్టి అంటగట్టడం జరుగుతూంది. ఒక వ్యక్తిలో ఎంతటి మౌలిక ప్రతిభ వున్నా ఆ వ్యక్తి ఆ కులానికి చెందిన వాడైతే వానికి విలువ నివ్వడం,

లేకుంటే విముఖత చూపడం. అందువలన మానవీయ విలువలు మూలాల్ని పోగొట్టుకుంటున్నాయి.

## స్వార్థపర వర్గాలు పోషించిన కుల వ్యవస్థ

మనుష్యులంతా ఒక్కటే. మనిషికి నాడు, నేడు పూసిన, పులుముతున్న కులం, రంగు పుట్టకతో వచ్చింది కాదు. ఋగ్వేదంలో అదిపుట్టింది. మనువు కాలంలో పెరిగింది. ఆ తదనంతరం స్వార్థపు కుల పెద్దల వలన పోషణ పొంది నేడు వేళ్ళు తన్నుకొని నిలిచింది. మనుషుల భావాల్లో దాక్కున్న ఈ విషాదాన్ని భావ విప్లవం ద్వారా పిండి సామాజిక చైతన్యానికి, ఆత్మ గౌరవానికి ఊపిరి పోయవలసిన తరుణం వచ్చింది. సాంఘిక సమానత్వ సాధనే దీనికి మందు. కుల రహిత సమాజ నిర్మాణమే దీనికి పరిష్కారం.

"కులం, మతం దృక్పథాల తేడాలు మనమే సృష్టించుకున్నాము. వాటిని మనమే పోషిస్తున్నాము. మన సాంఘిక వ్యవస్థకు సహాయ సహాయకారిగా వుంటాయని, వానిని మనం సృష్టించాము. ఆ పనిని అవి నెరవేర్చాలి. అలాకాక ఐక్యత బదులు అనైక్యతను పెంచి, సామరస్యం బదులు కక్షలు పెంచి, సంఘర్షణలను కలుగచేస్తూ వుంటే వాటికి సృష్టికర్తలమైన మనం వాటిని సవరించాలి లేదా నిరాకరించాలి. మానవుడు తాను సృష్టించిన వాటికి తానే బానిసై లొంగి పోవడంతో నాగరికతలో విషాదాంకం ప్రవేశించింది."

**– గోరా**

న్యాయం తూర్పున ఉదయించాలని మనం పశ్చిమానికి నడక ప్రారంభిస్తే చీకటి తప్ప వెలుగు కనిపించదు. "న్యాయం" అంటే సౌఖ్యం, సౌభ్రాత్రం : కూడు, గుడ్డ, వృత్తితో పాటు గౌరవం,- పక్షపాతం లేకుండా అందరికీ అందాలి. కులం, మతం కల్పించిన భేదాలు ఒకవేపు, దారిద్ర్యం, సంపద తేడాలు మరో వేపు సాగుతూ, పరుషున కొంకనీతి, స్త్రీకి మరొక నీతి నడుస్తున్నంత కాలం సాంఘిక న్యాయం మన దరిదాపుల వరకే కాదు పెదవులు దాటిరాదు.

"నేనూ మనిషినే" అన్నమాట మానవతా విలువలు కోరే ఉద్యమానికి నీతిసూత్రం. ఈ మాట మన నిత్య జీవితంలో అనేక రంగాలలో వింటూనే వుంటాం. ఒక కార్మికుని నోట, సాంసారిక బాధలో విసిగిన ఓ గృహిణి నోట 'నేనూ మనిషినే' అన్న మాట వినిపిస్తుంది. ఒకరినొకరం మనిషిగా గుర్తించ లేక పోతున్నా.

*"మనిషి పక్షిలాగ ఎగరగలుగుతున్నాడు*
*చేపలాగ ఈదగలుగుతున్నాడు*
*మనిషిలా ఎందుకు నడవలేడు?!"*

**– మాక్సింగోర్కీ.**

'మంచీ-చెడు' అని రెండే కులాలు - అన్నారు మహాకవి.

## కుల వ్యవస్థను బలపరుస్తున్న ప్రభుత్వ విధానాలు

ఈనాటి ప్రభుత్వ విధానాలు కూడా 'కుల' వ్యవస్థను కూలత్రోసే విధంగా కాక వాటిని మరింత బలంగా కూర్చుతున్నాయి. అనేక జాతులకు, కులాలకు "కేవలం ఆర్థిక సహకారం కొరకు" గుర్తించి పెంచుతున్నాయి. పెద్ద కులం, చిన్న కులం అనే భేదాలు సాంఘిక గౌరవానికి, న్యాయానికి పీడ పురుగులు.

"ఒకనాడు నా ఇద్దరి పిల్లలు తమ రంగు, జాతిని బట్టి కాక, తమ ప్రవర్తనను బట్టి గౌరవాదరాలు, న్యాయం పొందుతారని నేను కలగన్నాను"

**–మార్టిన్ లూథర్ కింగ్**

కులం, వర్ణం, జాతి అర్థరహితమైన తేడాలు మానవ జీవితం మధ్య. తూర్పు-పశ్చిమ జర్మనీల మధ్యగోడను పెళ్ళగించినట్లు యీ కులపు గోడలను పడగొట్టి విశ్వ మానవతను రక్షించాలి.

"ఎల్లలోకం ఒక్క ఇల్లై" అనే భావ బీజాన్ని రెండు వేలేండ్ల నాడే బుద్ధుడు నాటాడు యీ దేశాన. మానవుని అంతరాంతరాల సహజ గుణం 'సమిష్టి' అనేది సత్యం.

"పుట్టుకతో మానవులంతా ఒక్కటే. వారి, వారి గుణాలను బట్టి మాత్రమే మనిషి మనిషికి తేడా".

**– అన్నారు కురల్**

"ఆత్మ గౌరవం ఉద్యమాన్ని చేపట్టి కులాలకు, కుల వ్యవస్థకు చెంపదెబ్బ కొట్టిన సంస్కర్త ఈ.వి. రామస్వామి పెరియార్. "ప్రపంచంలోని మతాలన్నీ గుడ్డి నమ్మకంపైనే రూపుదాల్చాయి. హేతుబద్ధంగా ఆలోచించి తరచి చూచినట్లయితే ఏ మతమూ నిలవదు" ..న్నారు.

బ్రహ్మనాయుడు అన్ని కులాల వారి మధ్య చాపకూడు ఏర్పరచి, వీర కన్న మదాసును కుమారునిగా పెంచుకొని కుల వ్యవస్థకు సిగ్గు తీశారు.

"మీదే కులం!" అన్న ప్రశ్నే తప్పుగా భావించాలి. "నేను విశ్వ మానవుణ్ణి" అని చెప్పుకొని గర్వపడాలి.

"I am a man, nothing more, no one can claim to be more.'

**– భగత్ సింగ్**

# కాలదోషం పట్టిన కుల వ్యవస్థను సమూలంగా తొలగించాలి

శ్రీ చండ్ర రాజేశ్వరరావు

కమ్యూనిజం సిద్ధాంత పత్రిక నిర్వాహకులు, కుల వ్యవస్థ పుట్టు పూర్వోత్తరాలపై చర్చా వేదికను ఏర్పాటు చేసినందుకు, అభినందనీయులు, విద్యాధికులు, ప్రజోద్యమ నిర్వాహకులు ఈ చర్చలో పాల్గొంటున్నారు. వివిధ దృక్కోణాల నుండి భారతదేశం నేడెదుర్కొన్న ఈ క్లిష్ట సమస్యను పరిశీలించి, భారతదేశాన్ని కుల తత్వవాదం నుండి రక్షించి, ముందుకు తీసుకు పోవటానికి ఈ చర్చా వేదిక ఉపయోగ పడుతుంది. అందుకు భారతదేశ సర్వతో ముఖాభివృద్ధికి ఆటంకంగా వున్న కుల వ్యవస్థనే తొలగించాల్సిన అవసరం నేడు మన ముందుకు వచ్చింది.

కుల వ్యవస్థ, అంటరానితనం విచిత్రమైనవి. ఇవి ప్రపంచంలో ఎక్కడా లేవు. అంటరాని వాళ్ళనబడే వాళ్ళను, వెనుకబడి వున్న కులాల ప్రజలను నీచంగా చూడటం, వారి మీద దౌర్జన్యాలను జరపటం, వేల సంవత్సరాల నుండి మన దేశంలో జరుగుతూ వుంది. కుల వ్యవస్థకు వ్యతిరేకంగా సాంఘిక సమానత్వం కోసం) పోరాటం అనాదిగా జరుగుతూ వచ్చింది. అయితే ఇప్పుడు ఈ పోరాటం తీవ్రతరమయింది. అందుకే ఈ పీడిత ప్రజలమీద దౌర్జన్యాలు గూడ ఎక్కువ అవుతున్నవి.

## వివిధ జాతుల ప్రజల మిశ్రమం

భారతదేశ చరిత్ర చూస్తే ఒక విషయం బోధపడుతుంది. భారతదేశంలో జరిగినంతగా, మరెక్కడా వివిధ జాతుల ప్రజల మిశ్రమం జరగలేదు. అంతే గాక ఆర్థికంగా ఎదుగూ బొదుగూ అంతగాలేని గ్రామీణ వ్యవస్థ, 4000 సంవత్సరాలు భారతదేశంలో స్థిరంగా వుండినది. అందుచే ఆర్యులు మన దేశంలోకి రావటంతో ఏర్పడిన వర్ణ వ్యవస్థ, ఘనీభవించి క్రీస్తు శకం 200–400 సంవత్సరాల నాటికి కుల వ్యవస్థగా మారి పోయింది. భారతదేశాన్ని కుల వ్యవస్థ అనే ఉక్కు చట్రంలో మనుస్మృతి బిగించింది.

ఆర్యులు క్రీస్తు పూర్వం సుమారు 2000 సంవత్సరాల నాటికి వచ్చారు. అప్పుడు వర్ణాలు లేవు. అప్పటికి భారతదేశంలో వున్న ప్రజలను జయించిన తర్వాత వారిని ఇముడ్చుకోవలసిన అవసరం వచ్చింది. అంతేగాక పశు పాలకులుగా వచ్చిన ఆర్యులు స్థిర నివాసాన్ని ఏర్పరచుకొని గ్రామాలను ఏర్పాటు చేశారు. ప్రారంభంలో ఇది పుట్టుకను బట్టిగాక, గుణం, అనగా చేసే పనిని బట్టి వుండేది వుండేది. అంత కట్టుదిట్టంగా వుండేది గాదు. అందుచే సంఘర్షణ తర్వాతనైనా, ఒక వర్గం వారు ఇంకొక వర్గంలోకి మారటానికి అవకాశం వుండేది. తర్వాత మనుస్మృతితో ఉక్కు చట్రం లాంటి వృత్తి ప్రాతిపదికపై కుల వ్యవస్థగా మారి పోయింది.

## పంచములు ఎలా ఏర్పడ్డారు?

ఆర్యులకు లొంగకుండా వున్న ప్రజలు కొందరు అడవులు, కొండల్లోకి పోయి తలదాచుకున్నారు. వారే నేటి గిరిజనులు. అలా పోకుండానే వర్ణ కుల వ్యవస్థల్లో ఇమడలేని వారు ఊరుబయట అంటరాని వాళ్ళుగా పరిగణింపబడ్డారు. వారికి నీచమైన వృత్తులు కల్పించబడినవి.

అయినా అంటరాని వారుగా చూడబడే వారు, వెనుక బడి వున్న కులాల ప్రజలు, కుల వ్యవస్థ దోపిడీ దౌర్జన్యాలకు వ్యతిరేకంగా నిరంతరం పోరాడుతూనే వచ్చారు. ఈ పోరాటం మత రూపాలు గూడ తీసుకున్నది. కొన్ని విజయాలు సాధించారుగాని, కుల వ్యవస్థ అనే ఉక్కు చట్రాన్ని తీసి పారవేయటం జరగలేదు.

## పురుషులకు స్త్రీలు బానిసలు

దీనితో పాటు మరొక విషయాన్ని గూడా ముచ్చటించాలి. మను ధర్మ శాస్త్రం, భారత ప్రజలలో సగం మందిగా వున్న స్త్రీల ఎడల గూడ అన్యాయం చేసింది. స్త్రీల హక్కులను హరించి, వారిని పురుషులకు బానిసలను చేసింది.

వేదాలు, అరణ్యకాలు, ఉపనిషత్తులు, భారత, రామాయణాలు, పురాణాలు మొదలైన హిందూ మత గ్రంథాల్లోనూ, భారతదేశ చరిత్రలో ఇందుకు సంబంధించిన సమాచారం కోకొల్లలుగా వుంది. "కుల వ్యవస్థకు కాల దోషం పట్టింది" అనే వ్యాసంలో ఈ వివరాలను నేను లోగడ ఇవ్వటం జరిగింది. స్థలా భావంవల్ల వాటిని ఇక్కడ పునరుల్లేఖించటం లేదు.

భారతదేశ సర్వతోముఖాభివృద్ధికి నేడు కుల వ్యవస్థ పెద్ద అంతరాయంగా తయారవటమేగాక, దీనికి కాల దోషం గూడ

పట్టింది. నేడు భారతదేశంలో గమనింపదగిన పారిశ్రామికాభివృద్ధి జరగటం, ఆధునిక విద్యా విధానం వ్యాపించటం వలన, వృత్తికి కుల ప్రాతిపదిక అంతరించుతూ వుంది. అన్ని కులాలవారు కొంచం ఎక్కువగానో తక్కువగానో, అన్ని వృత్తులు చేస్తున్నారు.

షెడ్యూల్డు కులాలు, వెనుకబడి వున్న కులాలు, గిరిజనులలో సైతం ఆదునిక విద్యా విధానం అభ్యసించిన వారు ముందుకు వచ్చారు. ప్రభుత్వోద్యోగాల లోనూ, ఫ్యాక్టరీలలోనూ పనులు చేస్తున్నారు. అందుకు భారత రాజ్యాంగంలోని రిజర్వేషను పాలసీ కొంత వరకైనా సహాయం చేసింది.

## కుల వ్యవస్థకుగల వృత్తి ప్రాతిపదిక అంతరించింది

కుల వ్యవస్థకు గల వృత్తి ప్రాతిపదిక అంతరించుతూ వుంది. అయినా వేల సంవత్సరాల నుండీ ప్రజలలో నర నరాన జీర్ణించుకు పోయిన కుల తత్వ భావాలు, మనస్సులో నుండి తొలగించడం తేలికగాదు. అందుకు అన్ని రంగాలలోనూ సాంఘిక న్యాయం కోసం నిరంతర పోరాటం చేయవలసి వుంది. సైద్ధాంతికంగాను, రాజకీయంగాను గట్టి పోరాటంచేసి ప్రజల మనోభావాలను మార్చవలసి వుంది. క్రమంగా కుల వ్యవస్థ పట్టును బలహీన పరచి, కుల వ్యవస్థను సమూలంగా రద్దు చేయవలసిన సమయ మాసన్న మయింది.

అయితే కొన్ని రాజకీయ పార్టీలు, రాజకీయ నాయకులు కులతత్వాలను సంకుచిత రాజకీయ అవసరాల కోసం వాడుకోవటం వలన, సాంఘిక న్యాయంకోసం జరుగుతున్న పోరాటం బలహీన పడుతున్నది. అందుచే సమాజంలో అట్టడుగున యున్న పీడిత ప్రజల పోరాటాన్ని, భారతదేశ అభ్యుదయాన్ని కాంక్షించే అన్ని పార్టీలు, ప్రజా సంస్థలు, ప్రముఖులు బలపరచాలి, సంకుచిత రాజకీయ ప్రయోజనాలకోసం, కుల తత్వాలను పెంచరాదు.

## కులాన్నీ, వర్గాన్నీ ఒకటిగా చూడరాదు

నేడు భారతదేశంలో కులాలు, వర్గాలు 'ఓవర్ లాప్' అయిన మాట వాస్తవం. అయినప్పటికీ కులాన్ని, వర్గాన్ని ఒకటిగానే చూడటం సరిగాదు. కులతత్వాన్ని వ్యతిరేకిస్తూ, సాంఘిక న్యాయాన్ని బలపరిచే అన్ని శక్తులను సమీకరించి ఐక్య పోరాటాన్ని సాగించటం ఎంతేని అవసరం.

అంతేగాక ఆర్థిక, రాజకీయ సామాజిక రంగాల్లో ఈ పోరాటాన్ని సమన్వయ పరచి సాగించాల్సి వుంది. అన్నింటికి సమాన ప్రాముఖ్యతను యివ్వాలి.

గతంలో ఆర్థిక, రాజకీయ రంగాలలో కుల వ్యవస్థకు వ్యతిరేకంగా జరిగే పోరాటానికి కమ్యూనిస్టులం ప్రాముఖ్యత నిచ్చేవారం. దళిత వర్గాలు, వెనుకబడి వున్న కులాల ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచి, రాజకీయ హక్కులు సాధించితే, సామాజిక రంగంలో గూడ తమ కాళ్ళపై నిలబడి పోరాడటానికి వారికి సహాయకరంగా వుంటుందని అనుకునేవారు. అందుకే భూమి సమస్య, కూలి సమస్య సంక్షేమ పథకాలు, రిజర్వేషన్ పాలసీలకు ప్రాముఖ్యత ఇచ్చేవారం.

## మన ఆలోచనలోవున్న లోపం

ఎక్కడైనా సాంఘిక దౌర్జన్యాలు జరిగితే, వాటి మీద దౌర్జన్యపరులకు వ్యతిరేకంగా స్థానికంగా పోరాడేవారు. పార్టీ కార్యక్రమాలలో అంటరానితనాన్ని పాటించేవారు గాదు. ప్రజల్లో అంటరానితనానికి వ్యతిరేకంగా చైతన్యాన్ని కల్గించే వారం. కులాంతర వివాహాలు జరుగుతూ వుంటే వానిని ప్రోత్సహించేవారం. అంతేకాని సాంఘిక న్యాయం, కుల వ్యవస్థను తొలగించి ఒక ప్రత్యేక సమస్యగా తీసుకొనేవారం గాదు. మన ఆర్థిక, రాజకీయ పోరాటాలు సాగించితే నేటి ఆదునిక యుగంలో కుల వ్యవస్థ క్రమంగా బలహీనపడి, ఆఖరికి అంతరిస్తుందని ఆశించేవారు.

## అంబేద్కర్ ప్రముఖ పాత్ర

డాక్టరు బి.ఆర్. అంబేద్కర్ మహనీయుడు సాంఘిక న్యాయాన్ని ముందుపెట్టి పోరాడారు. చివరకు కుల వ్యవస్థ నిర్మూలించితేనేగాని దళితులకు విముక్తి జరగదనే నిర్ణయానికి వచ్చారు. చివరకు హిందూ మతాన్ని వదిలివేసి, కుల వ్యవస్థను వ్యతిరేకించే బౌద్ధ మతాన్ని స్వీకరించారు. లక్షలాది దళితులను మహారాష్ట్రలో బౌద్ధమతంలో చేర్చారు. భారత రాజ్యాంగ రచనలో ప్రముఖపాత్ర నిర్వహించిన డాక్టరు అంబేద్కర్ గారు, దళితులకు అప్పటికి సాధ్యమైనన్ని హక్కులను అందులో పొందుపరిచారు.

## సమన్వయ పూర్వకమైన పోరాటం

నేడు దళిత ప్రజల వెనుకబడి వున్న కులాల పోరాటాన్ని ఆర్థిక, రాజకీయ, సామాజిక రంగాలతో సమన్వయ పరచి డడపాల్సిన సమయం ఆసన్న మయింది. ఒకదానికి మరొకదానిని పోటీ బెట్టాల్సిన అవసరం లేదు. అప్పుడే దళిత ప్రజల ఉద్ధరణ జరుగుతుంది. కుల వ్యవస్థను బలహీనపరుస్తూ, చివరికి దాన్నే సమూలంగా తొలగించ గలుగుతాము.

ఈ విషయాన్ని 1992 ప్రారంభంలో హైదరాబాదులో జరిగిన భారత కమ్యూనిస్టు పార్టీ మహాసభ కూలంకషంగా చర్చించింది. సాంఘిక న్యాయం కోసం గట్టి పోరాటం జరపటంతోపాటు, కుల వ్యవస్థను తొలగించాల్సిన అవసరాన్ని గుర్తించింది. అందుకు కులాంతర వివాహాలను

ప్రోత్సహించాలని నిశితంగా చెప్పింది. వీటిని తన రాజకీయ తీర్మానంలో పొందు పరిచింది. ఈ భాగాన్ని ఈ క్రింద పొందుపరచుచున్నాను.

## దళితవిముక్తికి కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమం

(ఎ) దళిత, వెనుకబడిన వర్గాల, ఎస్.సి., ఎస్.టి., తదితరులకు సామాజిక న్యాయాన్ని సాధించేందుకు పోరాటాన్ని ముందుకు తీసుకు వెళ్ళాలి.

(బి) వెనుకబడిన తరగతులకు 27 శాతం రిజర్వేషన్, అగ్రవర్ణాలలోనిపేదలకు 10 శాతం రిజర్వేషన్ ప్రాతిపదికగా రిజర్వేషన్ విధానానికి సంబంధించిన వివరాలు, దాని అమలుకు సంబంధించిన పద్ధతులపై జాతీయ ఏకాభిప్రాయాన్ని సాధించాలి. దాని అమలులో ఎలాంటి జాప్యం లేకుండా చేయ డానికి యీ విధంగా చేయాలి.

(సి) ఎస్.సి., ఎస్.టి.ల రిజర్వేషన్‌ల కొనసాగింపు, వారి జీవన పరిస్థితుల, విద్యాప్రమాణాల మెరుగుదలకు ఉద్దేశించబడిన అన్ని పథకాలను వారి న్యాయ ప్రయోజనాలపట్ల సానుభూతి కలిగిన నిబద్ధతగల అధికారుల ద్వారా అమలు చేయాలి.

(డి) అస్పృశ్యతా శాపానికి వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని ఉద్దీపింప చేయాలి. అస్పృశ్యతను పాటించే వారిపై కఠినమైన, చట్టపరమైన చర్యలు తీసుకోవాలి. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ జయంతి ఉత్సవాలను జరపడం ద్వారా పై కృషిని సాగించాలి.

(ఇ) వర్ణాంతర వివాహాల క్రమాలను ప్రోత్సహించడం.

(ఎఫ్) కుల వ్యవస్థ, ప్రజల ఐక్యతపైనా, సర్వతో ముఖాభివృద్ధిపైనా, దాని ప్రతికూల ప్రభావాలకు వ్యతిరేకంగా నిర్విరామ సైద్ధాంతిక ప్రచారోద్యమం కొనసాగింపు.

(జి) వివక్షతకు వ్యతిరేకంగా మైనారిటీల హక్కుల కోసం, వారి భద్రత కోసం పార్టీ పోరాడుతుంది.

# హిందూ మతంలో కులాల పరిణామం

**ఎస్. జి. సర్దేశాయి**

హిందూమతంలో కులాలు అనేక పద్ధతులలో అభివృద్ధి చెందాయి. ఆదిమ ఇండో–ఆర్యన్ తెగల్లో వర్గ తారతమ్యాలు ప్రారంభమయ్యాయి.

రెండవ కారణం : "పరిశుద్ధమైన ఆర్యరక్తం గురించి" గొప్పలు చెప్పుకుంటూ, వివిధ తెగలమధ్య రక్త సంబంధాలను నిషేధిస్తున్నవారు కూడా ఏమీ చేయలేని స్థాయిలో ఆర్య, అనార్య తెగలమధ్య రక్త సంబంధాలు పెరిగాయి. ఈ రక్త సంబంధాలను కొంతవరకూ (ప్రాచీన సమాజాల్లో) చట్టం, ఆచారం ఆమోదించాయికూడా. సుధాసు, దివోదాసు, ఋగ్వేదంలో కన్పించే మహర్షి వశిష్ఠుడు నిస్సందేహంగా పరిశుద్ధమైన ఆర్యులు కారు. ఈ జాతి సాంకర్యం మరోరకంగా కూడ జరిగింది. పై కులాల ఆర్యుల ఇళ్ళల్లో దాసీలుగా పనిచేస్తున్న స్త్రీల ద్వారా ఇది జరిగింది. ఈ దాసీలు అనార్యులు లేదా తక్కువ కులాలకు చెందినవారు. దాసీగా వుండటమంటే ఉంపుడుకత్తెగా ఉండటంకూడా. ఈ దాసీల సంతానం అనేక తక్కువ కులాలుగా విభజింపబడ్డారు.

మూడవ కారణం : చేతివృత్తులు, వ్యాపారం అభివృద్ధి చెందడంచేత కూడ కులాలు పుట్టుకొచ్చాయి.

నాలుగవ కారణం : అసంఖ్యాకమయిన ఆదిమ జాతులవారు కులాలుగా హిందూమతంలో లీనమయ్యారు.

కులం జన్మచేతనే వస్తుంది. మరోరకంగా రాదు. హిందువుగా ఉండాలంటే హిందువుగానే పుట్టాలి. ఏదో ఒక కులానికి చెందకుండా ఎవరూ హిందువుగా ఉండరు. ఏదో ఒక కులానికి చెందాలంటే తప్పకుండా ఆ కులంలో పుట్టాలి. వ్యక్తిగతంగా ఎవరూ హిందువు కాలేరు."

('ప్రాచీన భారతదేశంలో ప్రగతి, సాంప్రదాయం గ్రంథం, నుండి')

# మారుతున్న సమాజంలో కులాలు-వర్గాలు

శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావు

సమకాలీన భారతదేశ సమాజం కులాలు, వర్గాలతో సంకీర్ణంగా ఉంది. కులం, పాత సమాజంయొక్క సృష్టి. ఆధునిక వర్గం మారుతున్న సమాజంయొక్క సృష్టి. వేల సంవత్సరాలుగా మన సమాజం స్తబ్ధతలో ఉన్నందున మత సిద్ధాంతాలు, సాంప్రదాయాలు, కుల కట్టుబాట్లు, ఆచారాలు నూతనంగా రూపొందుతున్న సామాజిక గ్రూపులు, వర్గాలపై గట్టి ప్రభావాన్ని కలుగజేస్తున్నాయి. కుల సమస్యగాని, వర్గ సమస్యగాని సూక్ష్మీకరించి చూడటంద్వారాకాక పలుకోణాల నుండి పరిశీలించడం ద్వారానే వాస్తవాన్ని గ్రహించగల్గుతాం. పాత వ్యవస్థ శిథిలమవుతోన్నది. కొత్త వ్యవస్థ ఆవిర్భావం, వివిధ పరివర్తన దశల ద్వారా ముందుకు సాగుతున్నది. సమాజానికి పునాదిగా ఉన్న ఆర్థిక వ్యవస్థలో పారిశ్రామికీకరణ, వర్తక, వాణిజ్య విస్తరణలతో పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం ఆధిపత్య స్థానానికి చేరుకుంటున్నది. అయినా మనదేశ ఆర్థిక వ్యవస్థను మొత్తంగా పరిశీలిస్తే పెట్టుబడిదారీ విధానం పూర్వపు దశలు కూడ కొనసాగుతూనే వున్నాయి. మన సమాజాన్ని వేధిస్తున్న సమస్యలు జటిలంగా మారటానికి ఇవన్నీ కారణాలే.

ప్రస్తుతం మనం పరిశీలిస్తున్న అంశం "మారుతున్న సమాజంలో కులాలు-వర్గాలు". ప్రాచీన నాగరికత విలసిల్లిన కొన్ని దేశాలలో కుల వ్యవస్థ అవతరించి కొంతకాలం జీవించి అంతరించి పోయినట్లు చరిత్రకారులు పేర్కొంటున్నారు. భారతదేశంలో మాత్రం కులవ్యవస్థ (కొన్ని మార్పులు, సంస్కరణలు ఉన్నప్పటికీ) దాదాపు 3 వేల సంవత్సరాలుగా కొనసాగుతోంది. భారతదేశ ప్రత్యేక లక్షణాలలో కుల వ్యవస్థ ఒకటి. జాతి భేదంతోనో, వర్ణ భేదంతోనో తోటి మానవునిపై దౌష్ట్యం సాగిస్తున్న దేశాలు, సమాజాలు ప్రపంచంలో లేక పోలేదు. కాని భారతదేశంలో కులవ్యవస్థ లాంటి అమానుష మైన సంఘం మరెక్కడా కానరాదని సుప్రసిద్ధ బ్రిటిష్ సామాజిక శాస్త్రవేత్త, లండన్‌లోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ రేస్ రిలేషన్స్ డైరెక్టరు ఫెంప్ మాసన్ కొంతకాలం క్రితం వెలువరించిన ఒక గ్రంథంలో పేర్కొన్నారు. ఆయన మాటల్లో... "మానవ అసమానత గల వ్యవస్థలన్నింటిలోనూ భారతీయ వ్యవస్థ అతి ప్రాచీనమైనది. అత్యంత వ్యవస్థీకృత మైనది, మిక్కిలి జటిలమైనది. 2 వేల సంవత్సరాలకుపైగా అది జీవించి ఉంది. ఇంకా బలంగానే వుంది.... అమెరికాలోని దక్షిణ రాష్ట్రాలలో సాగిన బానిసత్వాన్ని మించిన, లేదా నేటి దక్షిణాఫ్రికాలో కొనసాగుతున్న వర్ణ వివక్షతను మించిన అత్యంత దారుణమైన, నగ్నమైన వ్యత్యాసం, ప్రజల మధ్య వివక్షత అక్కడ పాదుకుని ఉంది."

- స్వాతి భట్టాచార్జి 'కులవ్యవస్థ')

భారతదేశంలో వర్ణ వ్యవస్థ ఆవిర్భావం, కులాలు, ఉపకులాల పరిణామాన్ని చారిత్రక దృష్టితో పరిశీలించవలసిన అవసరం ఉంది. ఇటీవల కాలంలో అలాంటి పరిశోధన పెరగటం హర్షదాయకం. ఆయా ప్రాంతాలలో, లేదా రాష్ట్రాలలో ఏయే చారిత్రక దశలలో కొత్త కులాలు ఆవిర్భవించాయి. వాటి పుట్టుకకు గల సామాజిక, ఆర్థిక కారణాలను పరిశీలించడం ద్వారానే కులాలకు సంబంధించిన శాస్త్రీయ అవగాహనను పెంచగల్గుతాం.

## భారతదేశ ప్రత్యేక లక్షణాలు

కుల వ్యవస్థ భారతదేశ సమాజంయొక్క ప్రత్యేక లక్షణంగా పేర్కొన్నాం. విభిన్న దొంతరలతో కూడిన కులవ్యవస్థ సుదీర్ఘకాలం భారతదేశంలో కొనసాగటానికి గల కారణం ఏమిటి? భారతదేశ సమాజ పరిణామం యొక్క ప్రత్యేక లక్షణాలను అన్వేషించటంలోనే దీనికి సమగ్రమైన సమాధానం దొరుకుతుంది. నేటికీ చర్చనీయాంశాలుగా వున్న ఈ సమస్యలపై మార్క్స్ అనుసరించిన పరిశీలన పద్ధతిని (మెథడాలజీ) పరిచయం చేయడం సమంజసమని అభిప్రాయపడుతున్నాను. దీనర్థం మార్క్స్ వ్యక్తం చేసిన ప్రతి అభిప్రాయాన్ని అంగీకరించాలని కాదు. ఆయన పరిశీలనా పద్ధతి ప్రస్తుతాంశం.

## స్వయంపోషక ఆర్థిక విధానం

భారతదేశంలాంటి కొన్ని దేశాలలో ప్రాచీన సమాజానికి ప్రత్యేక లక్షణాలు ఉన్నాయి. స్వయంపోషక గ్రామీణ వ్యవస్థ ప్రాథమిక యూనిట్. అదొక చిన్న ప్రపంచం. ప్రతి గ్రామంలోను వృత్తులు ఉన్నాయి. పంద్రెండు వృత్తులను మార్క్స్ ప్రస్తావించారు. కొన్ని గ్రామాలలో వ్యవసాయం సాముదాయకంగా చేస్తారు. మరికొన్ని గ్రామాలలో వారి సొంత భూఖండాలలో సేద్యం జరుగుతుంది. గ్రామంలో సమిష్టి ప్రయోజనాలకు పశుపోషణకు, మేతకు, ఇతర అవసరాలకు ఉమ్మడి భూములు ఉన్నాయి. ప్రతి గ్రామంలోను బానిసత్వం, కులవ్యత్యాసాలు రెండు ఉన్నాయి. ఈ గ్రామీణ వ్యవస్థలో చేతివృత్తులు, వ్యవసాయం విడదీయరాని విధంగా

విచిత్రంగా కలిసి వుంటాయి. వ్యవసాయ భూములకు కావలసిన నీటికాలవల నిర్వహణ నీటి సరఫరా పనులను కేంద్ర ప్రభుత్వం నిర్వహించేది. అంటే పై నుండి కేంద్రం నియంత్రణ అమలులో ఉండేది. క్రింద మాత్రం ఉత్పత్తి విధానం గ్రామీణ వ్యవస్థలో వికేంద్రీకరణ స్వభావం కల్గివుండేది. తూర్పుదేశాల కేంద్రీకృత తరహా నియంతృత్వానికి ఇది పునాది. వ్యక్తి వికాసాన్ని నిరోధించింది యీ వ్యవస్థ. ఇటువంటి ప్రత్యేక లక్షణాలుగల సమాజాన్ని దృష్టిలో పెట్టుకొని మార్క్స్ ఆసియా ఉత్పత్తి విధానం (ఏసియాటిక్ మోడ్ ఆఫ్ ప్రొడక్షన్) అనే భావనను ప్రతిపాదించాడు. దీని అర్థం ఇది అన్ని ఆసియా దేశాలకు వర్తిస్తుందని కాదు. లేదా కేవలం ఆసియా దేశాలకే పరిమితమైనదికాదు. ఇదొక తరహా ఉత్పత్తి విధానంగా ఆయన భావించాడు. మార్క్స్ 1853 నుండి 30 సంవత్సరాలపాటు తన జీవితం చివరి రోజుల వరకు సాగించిన పరిశోధనలో ఇది ఒక ముఖ్యాంశంగానే ప్రస్తావించి ఎంగెల్స్ తోను, ఇతర సహచరులతోనూ చర్చించాడు. ఎంగెల్స్ తన లేఖలలోనూ, ఆ తరువాత ఏంటీడూహరింగ్ గ్రంథంలోనూ ఈ భావనను చర్చించారు.

ఎదుగుబొదుగులేని సమాజం, స్తబ్దతలో పడి వున్న సమాజం పెట్టుబడిని సమకూర్చుకొనే చారిత్రక అవసరాన్ని ఎలా నెరవేరుస్తుంది? సోషలిజానికి ఎలా పురోగమిస్తుంది? పరివర్తన దశలు ఏమిటి? అన్న అంశాలను మార్క్స్, ఎంగెల్స్‌లు చర్చించారు. అందుచేతనే ప్రతి సమాజాన్ని నిర్దిష్టంగా అధ్యయనం చేయాలని నొక్కి వక్కాణించారు. "ఆసియా ఉత్పత్తి విధానం" గురించి సమగ్ర నిర్వచనం వారిచ్చారా? భారతదేశ చరిత్రను మార్క్స్ కూలంకషంగా పరిశీలించాడా? ఇవి చర్చనీయాంశాలుగా ఉన్న మాట వాస్తవం. వారలా చెప్పినట్టు ఆధారాలు లేవు. ఇక్కడ విషయమేమిటంటే సామాజిక శాస్త్రవేత్తలాగా వారు అనుసరించిన విశ్లేషణా పద్ధతి.

## కులప్రాతిపదికగాగల శ్రమ విభజన పోవాలి

భారతదేశ పురోగతికి పాత గ్రామీణ వ్యవస్థ ఆటంకంగా వుంది. అది బద్దలు కావాలి. వ్యవసాయం చేతివృత్తుల మధ్య గ్రామీణ వ్యవస్థలో నెలకొనివున్న ఐక్యత విచ్ఛిత్తి చెందాలి. కులం ప్రాతిపదికగా ఏర్పడి వంశపారంపర్య శ్రమ విభజన అంతం కావాలి. భారతదేశంలో బ్రిటిష్ పాలన ప్రారంభమయ్యే వరకు విదేశీ దండయాత్రలు ఎన్ని జరిగినా రాజకీయ రంగంలో ఎన్ని మార్పులు వచ్చినా సమాజంలోని ఇతర రంగాలలో ఎలాంటి మౌలిక మార్పులు రాలేదు. అదే గ్రామీణ వ్యవస్థ కొనసాగుతూ వచ్చింది. ప్రాచీన భారతదేశ చరిత్రలో సంభవించిన మత సంఘర్షణలు, కులాలమధ్య ఘర్షణలు, వర్గపోరాటాలు, ఇతర అంశాలను కూడా వారు చర్చించారు. ప్రాచీన సమాజాల విచ్ఛిత్తిని అధ్యయనం చేసేందుకు భారత దేశం ఒక ప్రయోగశాలగా ఉపకరిస్తుందని మార్క్స్ చివరి రోజులలో అభిప్రాయపడ్డారు.

దురదృష్టవశాత్తు మార్క్స్, ఎంగెల్స్ అనుసరించిన పరిశీలనా పద్ధతి వారి అనంతరం మార్క్సిస్టులలో కొంతకాలంపాటు మాత్రమే సాగింది. ముఖ్యంగా ఏసియాటిక్ మోడ్ ఆఫ్ ప్రొడక్షన్ భావనపై చర్చకు 1931లో ఆనాటి కొమింటర్న్ నాయకత్వం స్వస్తి చెప్పింది. ఆ భావనపై నాడు సాగిన చర్చలను ఎ.యం.బెయిలీ, జోసెఫ్ లోబెరా సంయుక్త సంపాదకత్వాన వెలువడిన 350 పేజీల గ్రంథం "ది ఆసియాటిక్ మోడ్ ఆఫ్ ప్రొడక్షన్"లో విపులంగా పొందుపరచారు.

అలా ఎందుకు జరిగింది? దాని పర్యవసానాలు ఏమిటి? దానివల్ల సిద్ధాంత రంగంలో జరిగిన నష్టం ఏమిటి? మొదలైన అంశాలను మార్క్సిజం చరిత్రకారులు పరిశీలించాలి.

## కుల వ్యవస్థకు వ్యతిరేకంగా భారత కమ్యూనిస్టు పార్టీ పోరాటం

కులవ్యవస్థ అమానుషత్వాన్ని, అస్పృశ్యతను భారత కమ్యూనిస్టు పార్టీ ఏర్పడిన తొలిదినాల నుండి ఖండించింది. కులవ్యవస్థ నిర్మూలన తన ధ్యేయంగా ప్రకటించింది. కుల రహిత, వర్గ రహిత సమాజంకోసం కృషిసల్పుతూ వస్తున్నది. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం, వ్యవసాయక విప్లవం, వర్గపోరాటాలతో కుల వ్యవస్థ వ్యతిరేక పోరాటాన్ని మేళవించి మహోద్యమాన్ని నిర్మించాలని 1930లోనే కమ్యూనిస్టు పార్టీ ప్రకటించింది. నాడు పార్టీ ఆమోదించిన ప్లాట్‌ఫారమ్ ఆఫ్ యాక్షన్ నుండి ఒక భాగాన్ని దిగువ యిస్తున్నాం.

"మన దేశంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదం పాలన ఫలితంగా లక్షలాది బానిసలు, సామాజికంగా వెలివేయబడ్డ అస్పృశ్యులు, అన్ని హక్కులను కోల్పోయి ఇంకా నికృష్ట జీవనాన్ని గడుపుతున్నారు. బ్రిటిష్ పాలన, భూస్వామిక వ్యవస్థ, అభివృద్ధి నిరోధక కులవ్యవస్థ, మతం పేరుతో వంచన, గతకాలపు బానిసత్వ సంప్రదాయాలు - ఇవన్నీ భారత ప్రజల గొంతును నులిమివేస్తున్నాయి. వారి విముక్తి బాటకు అవరోధంగా నిలబడ్డాయి. వీటి పర్యవసానంగా, 20వ శతాబ్దంలో భారతదేశంలో తోటి మానవులను కలుసుకునే హక్కులేని, సమిష్టి బావుల నుండి నీరు త్రాగలేని, ఉమ్మడి పాఠశాలలో చదువు సాగించలేని అస్పృశ్యులు ఇంకా ఉన్నారు."

"బ్రిటిష్ పాలనకు, భూస్వామ్య విధానానికి వ్యతిరేకంగా కార్మికులందరితో కలిసి ఐక్య విప్లవ సంఘటనలో చేరవలసిందిగా అస్పృశ్యులకు భారత కమ్యూనిస్టు పార్టీ విజ్ఞప్తి చేస్తుంది. మన దేశంలో కష్టజీవులను చీల్చే బ్రిటిష్ వారి కుతంత్రాలకు, అభివృద్ధి నిరోధకుల మోసాలకు లోనుకావద్దని కోరుతున్నది."

"బానిసత్వం, కులవ్యవస్థ, కుల అసమానత్వాలను అవి ఏ రూపంలో కొనసాగుతున్నప్పటికీ వాటిని సంపూర్ణంగా నిర్మూలించేందుకు భారత కమ్యూనిస్టు పార్టీ పోరాడుతున్నది. (సామాజిక, సాంస్కృతిక రంగాలన్నింటితోసహా). మనదేశ కష్టజీవుల, అస్పృశ్యుల పరిపూర్ణ సమానత్వానికి భారత

కమ్యూనిస్టు పార్టీ పోరాడుతున్నది." - (బి.టి.రణదివె రచన "కులం, వర్గం మరియు ఆస్తి సంబంధాలు" నుండి)

మాటల్లోనేకాక, ఆచరణలో కుల, మత, జాతి భేదాలను అధిగమించి వర్గ ప్రాతిపదికపై కష్టజీవులను, ప్రజాతంత్ర వాదులను కమ్యూనిస్టు పార్టీ సమీకరించిన ఉజ్వల ఘట్టాలు ఈ 60 సంవత్సరాల చరిత్రలో చాలా ఉన్నాయి. బొంబాయి కార్మికవర్గ సమ్మెలు, బెంగాల్‌లో తేభాగా ఉద్యమం, తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటంలాంటివి కొన్ని ఉదాహరణలు మాత్రమే.

భారతదేశంయొక్క ప్రత్యేక లక్షణాలను, కులవ్యవస్థ యొక్క ప్రత్యేక సమస్యలను కమ్యూనిస్టు పార్టీ, మార్క్సిస్టు మేధావులు లోతుగా అధ్యయనం చేయలేదనే విమర్శ ఉంది. మార్క్సిజాన్ని యాంత్రికంగా అర్థం చేసుకుని, వర్గ సమస్యకు అత్యంత ప్రాధాన్యత ఇచ్చి, కుల సమస్యను కేవలం ఆర్థిక, రాజకీయ పోరాటాలకు పరిమితం చేశారనే విమర్శ ఉంది. ఇటీవల కాలంలో ముఖ్యంగా 1980 దశకం నుండి తిరిగి ఈ సమస్య - కుల, వర్గ సంబంధాలు, వాటి సమస్యలు - పై తీవ్ర చర్చ సాగుతున్నది. పలువురు మేధావులు అధ్యయన పత్రాలను తీసుకొచ్చారు. సైద్ధాంతిక రంగంలో, సామాజిక కార్యాచరణలో గతంలో వ్యక్తమయిన బలహీనతలను అధిగమించే ప్రయత్నం వామపక్ష పార్టీల నాయకుల రచనలలో, మేధావులలో వ్యక్తమవుతున్నది.

## కులం – వర్గం ఒకటేనా?

దీనికి ప్రతిగా నేడు మరికొన్ని వాదనలు ముందుకు వస్తున్నాయి. భారతదేశంలోని ప్రత్యేక పరిస్థితులలో కుల పోరాటమే వర్గపోరాటమంటున్నారు. కుల సంఘాలకు ప్రాధాన్యత యివ్వాలంటున్నారు. ఈ వాదనలలో తీవ్ర బలహీనతలు ఉన్నాయి. ఈ ధోరణి శ్రమజీవుల ఐక్యతను, ప్రజాతంత్ర శక్తుల తోడ్పాటును సాధించలేదు.

భారతదేశంలో పారిశ్రామికీకరణ ఆరంభమయిన నాటి నుండే ఆధునిక కార్మికవర్గం అవతరణ ప్రారంభమయింది. వర్తక, వాణిజ్యాల విస్తరణ, సేవారంగం, పరిపాలనా రంగం పెరగటంతో లెక్కలేనన్ని కార్మికులు, ఉద్యోగులు గణనీయ మైన శక్తిగా తయారయ్యారు. వ్యవసాయరంగంలో పెట్టుబడిదారీ సంబంధాలు పెరగటంతో గ్రామసీమలలో కొత్త వర్గ సంబంధాలు రూపొందుతున్నాయి. సామాజికంగా కొత్త గ్రూపులు, వర్గాలు రూపొందుతున్నా యనేది కఠోర వాస్తవం. ఆ ప్రాతిపదికపైనే ట్రేడ్ యూనియన్లు, ఇతర ప్రజాసంఘాలు ఏర్పడి పనిచేస్తున్నాయి. ఉమ్మడి సమస్యలపై - అవి ఆర్థిక కోర్కెలే కావచ్చు - కార్మికులను, ఉద్యోగులను సమైక్యపరచి దేశవ్యాపిత కార్యాచరణను ట్రేడ్ యూనియన్లు నిర్వహిస్తున్నాయి.

విద్యావ్యాప్తివల్ల అన్ని కులాలు, వర్గాలు నుండి కొత్త మేధావి వర్గం రూపొందుతున్నది. దీని ప్రభావాన్ని తక్కువ అంచనా వేయరాదు.

గ్రామాలలో మార్పులు ఇంత వేగంగాను లేవు, లోతుగాను లేవు. కాని అన్ని కులాలలో వర్గ వ్యత్యాసాలు సుస్పష్టంగా వ్యక్తమవుతున్నాయి. ముఖ్యంగా రైతాంగ కులాల్లో వర్గ వైరుధ్యాలు బాహాటంగా ముందుకు వస్తున్నాయి. కుల కట్టుబాట్లు, సంప్రదాయాలు సడలుతున్నాయి. వర్గ పోరాటాలు, రాజకీయ పోరాటాలు పలురూపాలలో సాగుతున్నాయి.

రెండోవైపు పట్టణ ప్రాంతాలలోనూ, గ్రామాలలోనూ కులచైతన్యం పెరుగుతున్నది. కులసంఘాలు తిరిగి పుట్టుకు వస్తున్నాయి. కుల ఘర్షణలు జరుగుతున్నాయి. కుల సిద్ధాంతాలు వ్యాప్తి చెందుతున్నాయి. దీనిలో రాజకీయ ప్రేరణ ఉంది. వర్గ ప్రయోజనం ఉంది. మొత్తంగా చూస్తే కులవర్గం సమ్మిళిత క్రమం సాగుతున్నది. కాని ఏ అంశం బలంగా ముందుకు వస్తున్నది?

## కదిలిపోతున్న కులం పునాదులు

కులంయొక్క సామాజిక పునాదులు కదలిపోతున్నాయి. వంశ పారంపర్య వృత్తులకు ఆయా కులాలు వారు కట్టుబడి లేరు. ఎన్నికలు, వయోజన ఓటింగ్ హక్కు ప్రజాస్వామిక రాజకీయ చైతన్యాన్ని పెంపొందిస్తున్నాయి. అట్టడుగున ఉన్న కులాల్లో, వర్గాలలో ఆత్మగౌరవం, మానవ మర్యాదలు, మానవహక్కుల కొరకు పోరాడే భావం, కొత్త సామాజిక చైతన్యం వ్యక్తమవుతున్నాయి. అగ్రకుల దురహంకారానికి, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా సాగే పోరాటంలో హరిజనులకు, గిరిజనులకు అండగా ఇతర ప్రజాతంత్ర శక్తులు నిలబడుతున్నాయి. అస్పృశ్యతను నిరసించే ఉద్యమం వ్యాప్తి చెందుతున్నది.

అక్షరాస్యతా ఉద్యమం క్రింద కులాల్లోనేగాక, స్త్రీలలో కూడ కొత్త చైతన్యాన్ని రగుల్చుతోంది. కర్మ, పునర్జన్మ సిద్ధాంతాల పట్టు ఇంకా కొనసాగుతున్నప్పటికీ పైన పేర్కొన్న ప్రజాతంత్ర భావాలు, నూతన జాగృతి, పెరుగుతున్న వర్గ చైతన్యాన్ని తక్కువ అంచనా వేయరాదు. వర్గ చైతన్యం ప్రాథమిక స్థాయిలోనే కావచ్చు. కాని అది బలపడుతున్నది. కాని పక్షంలో విశాలమైన ప్రాంతాలలో భూమి కొరకు, నివేశన స్థలాలు కొరకు, ప్రజాస్వామ్య హక్కులకొరకు, ఆర్థిక కోర్కెల కొరకు, నేడు మనం చూస్తోన్న ప్రజా కార్యాచరణ సాధ్యమయ్యే పనికాదు.

సామాజిక వివక్షత, పీడనలు అవి ఏ రూపంలో కొనసాగుతున్నా వాటికి వ్యతిరేకంగా ప్రజలను చైతన్యపరచేందుకు, సమీకరించేందుకు ప్రజాతంత్ర శక్తులు ఐక్యంగా పనిచేయవలసిన అవసరం ఉంది. దానికి పరిస్థితులు నేడు చాలా అనుకూలంగా వున్నాయి.

---

**( తరువాయి 54వ పేజీ )**

# కులవ్యవస్థపై జాతీయోద్యమ ప్రభావం

**శ్రీ పరకాల పట్టాభిరామారావు**

జాతీయోద్యమం అంటే – జాతీయ స్వాతంత్ర్యోద్యమం – జాతీయ పునరుజ్జీవనోద్యమం రెండింటి సమ్మేళనం అని నా భావన. కమ్యూనిస్టు ఉద్యమం కూడా జాతీయ విముక్తి పోరాటంలో అంతర్భాగమే.

మధ్య యుగాలనాటికి ఘనీభవించిపోయిన కుల వ్యవస్థపై "భక్తి ఉద్యమ" రూపంలో క్రింది కులాల వారి తిరుగుబాటు జరిగింది. కబీర్, తులసీదాస్, సూరదాస్, రామదాస్, తుకారామ్, నానక్ మొదలైన భక్త కవులు ఆనాటి యజ్ఞాలు, యాగాలు మొదలైన వైదిక కర్మకాండలకు, బ్రాహ్మణ పురోహిత వర్గాల, అగ్రకులాల నిరంకుశత్వానికి, కులతత్వానికి, ఛాందసత్వానికి, మతమౌఢ్యానికి వ్యతిరేకంగా ఈ తిరుగుబాటు నడిపారు. "భగవంతుడు ఒక్కడే. అతని దృష్టిలో అందరూ సమానులే. కుల హెచ్చుతగ్గులు లేవు" అని వీరు ప్రబోధించారు.

కబీరు ముస్లిమ్ చేనేత కార్మికుడు, నామ్‌దేవ్ బ్రాహ్మణేతరుడు, దర్జీపని చేసి జీవించాడు. తుకారామ్ శూద్ర కులంలో పుట్టాడు. రామదాస్ మహారాష్ట్రలో హరిజనుడు. అలాగే మహారాష్ట్రలో మంగలి కులంలో జన్మించిన "సేన" కూడా భక్తకవి. బెంగాల్‌లో విద్యాపతి, రాజస్థాన్‌లో మీరాబాయి, పంజాబ్‌లో గురునానక్, ఆంధ్రదేశంలో బ్రహ్మనాయుడు మొదలైన వారందరు కులవ్యవస్థను నిరసించారు. బ్రహ్మనాయుడు "మాల కన్నమదాసును మనసైన సుతుడుగా" భావించాడు. అన్ని కులాలు కలిసి ఏకపంక్తిని భుజించే "చాపకూడు" సిద్ధాంతాన్ని లేవదీసి అమలు జరిపించాడు.

**(53వ పేజీ తరువాయి)**

## సమైక్య పోరాట ప్రాధాన్యత

భారతదేశంలో సామాజిక విప్లవ క్రమం వినూత్న తరహాలో జరిగే సూచనలు కన్పిస్తున్నాయి. మనదేశ చరిత్రలో, ప్రాచీన సమాజంలో సైతం సామాజిక న్యాయం కొరకు మత రూపంలో, కులరూపాలలో గొప్ప ఉద్యమాలు నడిచాయి. మారుతున్న ఆధునిక సమాజంలో కుల పీడన, వర్గ దోపిడీలకు వ్యతిరేకంగా మానవీయత ప్రజాస్వామ్యం కొరకు సకల రంగాలలో – సామాజిక, ఆర్థిక, రాజకీయ, సైద్ధాంతిక, సాంస్కృతిక – పోరాటం జరగాలి. దీనిలో దళితులు, గిరిజనులు, గ్రామీణ పేదలు, రైతులు, కార్మికులు, మధ్యతరగతి సెక్షన్లు, మేధావులు, ఇతర ప్రజాతంత్ర శక్తులు ప్రధానపాత్ర వహిస్తాయి.

ఆ విధంగా భారతదేశంలో అట్టడుగు కులాల వారిలోను శ్రమించి జీవించే వర్గాలలోను భక్తకవులు పెద్ద సంచలనం తీసుకువచ్చారు. కుల పీడనకు, కుల హెచ్చుతగ్గులకు కుల నిరంకుశత్వానికి వ్యతిరేకంగా గొప్ప ప్రభావాన్ని కల్గించారు. వీరందరు సంస్కృతంలోకాక ప్రజల భాషలలో, దేశీయ భాషలలోను తమ సాహిత్యాన్ని రచించారు.

## కుల వ్యవస్థపై వేమన తిరుగుబాటు

ప్రజాకవి వేమన ఆంధ్రదేశంలో కుల, మత ఛాందసత్వాలకు వ్యతిరేకంగా పోరాడాడు. వేమన 1700 ఆ ప్రాంతాలలోనివాడు.

"కులము గల్గువారు
గోత్రంబు కలవారు
విద్యచేత విర్రవీగువారు
పసిడి కల్గువాని బానిస కొడుకులు"

అని హెచ్చుకుల, గోత్రాలు కల్గి విద్యచే విర్రవీగు వారిని తీవ్రంగా ఖండించి వీరందరూ ధనిక వర్గాలకు బానిసలుగా వ్యవహరిస్తున్నారని యీసడించాడు.

"మాల వానినేల మహిమీద నిందింప
నొడల రక్తమాంస మొకటికాదే
వానిలోన మెలగు – వాని కులంబేది
విశ్వదాభిరామ ..........

అని మానవులందరిలోను ఒకే రకమైన రక్తమాంసాలున్నాయని అందరూ సమానులేనని వేమన ప్రబోధించాడు. కుల విభేదాలను సమూలంగా నాశనం చేయాలని పిలుపు యిచ్చాడు.

"ఉర్వివారికెల్ల నొక్క కంచము పెట్టి
పొత్తుగుడిచి కులము పొలయ
తలకు జేయిపెట్టి తాగజేసినమ్మ చెప్పరా
విశ్వదాభిరామ........"

కుల వ్యవస్థ వెనుక ధన వ్యవస్థ రాజ్యం చేస్తున్నదనీ, వేమన స్పష్టంగా చెప్పడం ఆశ్చర్యం కల్గిస్తుంది.

కులము లేకయున్న కలిమిచే వెలయును
కలిమిలేనివాడు కులము దిగును
కులముకన్న మిగులు కలిమి ఎక్కువ నమ్ము
విశ్వదాభిరామ వినురవేమ

తెలుగుదేశంలో హేతువాదానికి, మానవతా వాదానికి వేమన మార్గదర్శి. కులవ్యవస్థను ఎదుర్కొని పోరాడిన మహనీయుడు.

భారత జాతీయ పునరుజ్జీవనానికి పితామహుడు అనదగిన స్వామి వివేకానంద కుల హెచ్చుతగ్గులను, అంటరానితనాన్ని తీవ్రంగా ఎదుర్కొన్నాడు. శూద్ర రాజ్యం - సామ్యవాదం రాక తప్పదన్నాడు. అట్టడుగు కులాల "ఊర్ధ్వ చలనం" జరగాలన్నారు.

వీరేశలింగం ఆంధ్రదేశంలో గొప్ప సంఘసంస్కర్త మాత్రమేకాదు. కులవ్యవస్థకు వ్యతిరేకంగా ఆయన పోరాడాడు. అనాటి బ్రాహ్మణ ఛాందసవాదులను, మఠాధిపతులను ఎదుర్కొని "సహపంక్తి భోజనాలు" ద్వారా అన్ని కులాల వారు కలిసి ఒకే పంక్తిలో భోజనం చేయడానికి నాంది పల్కారు. ఒక్క బ్రాహ్మణ కులంలోనేగాక అన్ని కులాల్లోను ఉన్న సాంఘిక దురాచారాలను ఎదుర్కొన్నాడు. అతి బాల్య వివాహాలు, నిర్బంధ వైధవ్యం, వేశ్యావృత్తి, మద్యపానం, మూఢనమ్మకాలు, అవినీతి, లంచగొండితనాలకు వ్యతిరేకంగా పోరాడాడు. వర్ణాంతర, కులాంతర వివాహాలను ప్రోత్సహించి ఆధ్వర్యం వహించాడు. భారత కోకిల - భారత జాతీయోద్యమ నాయకు రాలు శ్రీమతి సరోజినీ నాయుడు (బెంగాలీ బ్రాహ్మణులు) ముత్యాల గోవిందరాజుల నాయుడులకు (కాపు కులస్తులు)కు హైదరాబాద్‌లో వివాహం జరిపించింది కందుకూరి వీరేశ లింగంగారేనన్న విషయం ఈ కాలంలో వారికి చాలామందికి తెలియకపోవచ్చు. ఆంధ్ర జాతీయోద్యమంలో, జాతీయ పునరుజ్జీవనోద్యమంలో ఈ వర్ణాంతర వివాహం ఒక ప్రముఖ ఘట్టం. ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలను సంఘ సంస్కర ణోద్యమం ద్వారా ఏకంజేసిన మహనీయుడు కందుకూరి వీరేశలింగం. ఆ తరువాత వారి ఆదర్శాన్ని అనుసరించి తెలం గాణా ప్రాంతంలో సాంఘిక, సాహిత్య, భాషా పునరుజ్జీవ నోద్యమాలను శ్రీ మాడపాటి హనుమంతరావు, శ్రీ సురవరం ప్రతాపరెడ్డి తదితరులు ముందుకు తీసుకువెళ్ళారు.

వీరేశలింగం తన ఉద్యమంలో అంటరానితనానికి వ్యతిరేకంగా కూడా పోరాటం సాగించారు. అంటరానితనాన్ని ఆయన, ఆయన సతీమణి పాటించలేదు. మండువేసవి, ఒక హరిజన బాలుడు రాజమండ్రి ఇన్నీస్‌పేట వీధిలో శోషవచ్చి నడిరోడ్డుపై పడిపోయి ఉన్నాడు. అతడు అంటరానివాడని ఎవరూ దగ్గరకు వెళ్ళడంలేదు. ఇంక కొంచెంసేపు ఉంటే అతడు వడదెబ్బకు మరణించేవాడే. వీరేశలింగంగారి సతీమణి శ్రీమతి రాజ్యలక్ష్మి ఒంటెద్దు బండిలో ఆ మార్గాన ఏదో మీటింగుకు వెడుతున్నారు. ఈ దృశ్యం చూసి ఆమె మీటింగు మానుకొని ఆ బాలుని ఎత్తి తన బండిలో వేసుకొని తమ ఆనందోద్యానికి తీసుకువెళ్ళి శైత్యోపచారాలు చేసి బ్రతికించి అతని యింటికి పంపారు. ఆనాడు అదొక గొప్ప విప్లవం. గొప్ప తిరుగుబాటు. అంటరానితనాన్ని రూపుమాపడానికి జరిగిన కృషికి చిహ్నం.

ఆనాటి బ్రాహ్మణ ఛాందస వర్గాలు వీరేశలింగంగారిని, మతభ్రష్టునిగానే కాదు కులభ్రష్టునిగా కూడా యెంచి కుల బహిష్కారాలు చేసిన విషయం విదితమే.

వీరేశలింగంగారి అనుయాయులు బ్రహ్మర్షిగా పేరొందిన రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు వేశ్యావృత్తికి వ్యతిరేకంగా పోరాడిన వారేకాదు, కులతత్వానికి వ్యతిరేకంగా పోరాడినవారు. దళిత వర్గాల సముద్ధరణకు పాటుపడ్డారు. ఒంగోలు రైలు స్టేషన్‌లో అడుక్కుతింటున్న యానాది బాలికను తీసుకువచ్చి పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించి కంభంపాటి తారకం అనే అగ్రకుల బ్రాహ్మణునికిచ్చి వివాహం చేశారు. కంభంపాటి తారకంగారిని వారి కుటుంబం వారు యింటికి రానివ్వలేదు. వీధి అరుగుపై అన్నం పెట్టారు. కుల వ్యవస్థకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో ఎందరో ఎన్నో యిడుములు పడ్డారు. వీరేశలింగం, రఘుపతి వెంకటరత్నం నాయుడు గార్లచే ప్రభావితుడైన పిఠాపురం మహారాజ శ్రీ సూర్యారావు పిఠాపురం, కాకినాడలలో పెద్ద విద్యాకేంద్రాలను నెలకొల్పడమేకాక హరిజన బాలబాలికలకు హాస్టళ్ళు (బహుశ ఆంధ్రదేశంలో అదే తొలిసారి కావచ్చు) స్థాపించారు. ఎందరో హరిజన యువకులు విద్యావంతులయ్యారు.

## "మంచి అన్నది మాల అయితే - మాలనే అగుదున్"

తెలుగు సాహిత్యంలో హేతువాద యుగానికి ఆద్యుడు, మహాకవి గురజాడ అప్పారావుగారు కుల వ్యవస్థకు, అంటరానితనానికి వ్యతిరేకంగా పోరాడారు. వర్ణాశ్రమ ధర్మం ఎంత అధర్మమైనదో గురజాడ "లవణరాజు కల" అనే గేయ కావ్యంలో యిలా చెప్పారు :

మలిన వృత్తుల మాలవారిని
కులము వేర్పిన బలియురొకదే
శమున కొందరి వెలికి దోసిలి
క్రూరకర్మలకున్
మలిన దేముల మాలలనుచును
మలిన చిత్తుల కధిక కులముల
నెల ఒసంగిన వర్ణ ధర్మ
మధర్మ ధర్మంబే...

మనుషులలో రెండు కులాలున్నాయి. ఇన్ని కులాలు లేవు. మంచిచెడ్డలు రెండే రెండు కులాలు అని మహాకవి గురజాడ మహోన్నతమైన భావాలను వెల్లడించి అంటరానితనంపై ధ్వజమెత్తాడు.

మంచిచెడ్డలు మనుజులందున
యెంచి చూడగ రెండే కులములు
మంచి అన్నది మాల అయితే
మాలనే అగుదును.

వర్ణ వ్యవస్థను, కుల వ్యవస్థను శాసించే కులపెద్దలకు, మతాధిపతులకు గురజాడ చేసిన సవాలు తిరుగులేనిది.

కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు గార్లతో పాటు ఆంధ్ర జాతీయ పునర్వికాసానికి మూల పురుషులైన వారిలో కొమర్రాజు లక్ష్మణరావుగారు ఒకరు. తన విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి ద్వారా తెలుగునాట విజ్ఞాన

చంద్రికలను వెలయించడంతోబాటు కుల వ్యవస్థకు వ్యతిరేకంగా, సాంఘిక సంస్కరణలకోసం పాటుపడ్డారు.

1907లో నందిగామల్లో జరిగిన కృష్ణాజిల్లా రాజకీయ మహాసభలోను, సంఘ సంస్కరణల మహాసభలోను కొమర్రాజు లక్ష్మణరావుగారు ప్రముఖ పాత్ర వహించారు. ఈ సభలో హరిజనులు ఎక్కడో దూరంగా కూచున్నవారిని చేయిపట్టి తీసుకొనివచ్చి సభ మధ్యలో కూచోబెట్టారు.

ఋగ్వేద కాలంలో కుల వ్యవస్థ లేదని, వృత్తులను బట్టి కూడా కుల వ్యవస్థ లేదని లక్ష్మణరావుగారు నిరూపించారు.

"కులవ్యవస్థ దేశాన్ని అధోగతి పాల్జేసింది. ధర్మ శాస్త్రాలలో పేర్కొన్న నాలుగు కులాలు - నాలుగువేల కులాలైనాయి. ప్రతి వృత్తి ఒక కులంగా మారి, సమాజం అంతా కులాలై చీలిపోయి శాఖోపశాఖలుగా మరెన్నో ఉప కులాలలో నిండిపోయి సంఘీభావం నశించిపోయింది. ప్రతీ కులము ఇంకా కొన్ని కులాల మీద ఆధిపత్యం స్థాపించుకోవడం కోసం మతాన్ని, మతాచారాలను ధర్మశాస్త్రాలను ప్రయోగించారు. సంపన్న కులాలవారు చిన్న కులాలవారిని అనేక బాధలకు గురిచేసేవారు. అన్నింటికంటే ఘోరాతిఘోరం కొందరిని అంటరానివారుగా పరిగణించి, సాంఘిక వ్యవస్థలో వారిని దూరంగా బహిష్కరించారు...." అని నేటి కులవ్యవస్థ అంటరానితనాల దారుణ ఫలితాలను కొమర్రాజు లక్ష్మణరావుగారు నిశితంగా ఖండించారు. వర్ణ వ్యవస్థను, కుల వ్యవస్థను లక్ష్మణరావుగారు వ్యతిరేకించడం, వితంతు వివాహాలను ప్రోత్సహించడం, తన కుమార్తెకు యుక్త వయస్సు రాకుండా పూర్వాచార పద్ధతిని వివాహం చేయాలని తన తల్లి పట్టుబట్టినా వినక త్రోసివేసి తన కుమార్తె అచ్చమాంబను (డాక్టర్ అచ్చమాంబను) వైద్య విద్యాభ్యాసానికి లండన్ పంపించడం, దీనితో తల్లి గంగమ్మ కుమారునితో తెగతెంపులు చేసుకొని వెళ్లిపోవడం జరిగింది. కొమర్రాజు లక్ష్మణరావుగారు చనిపోయినా తల్లి చూడడానికి కూడా రాలేదట. లక్ష్మణరావుగారు ఆనాడు ఎంత గృహ సంక్షోభాన్ని ఎదుర్కొన్నారో దీనినిబట్టి స్పష్టం. వేదాలు అపౌరుషేయాలనీ, పరమ పవిత్రమైనవీ నెత్తిమీద పెట్టుకొని పూరేగడానికి కాక ప్రాచీన కాలంనాటి సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల పరిశీలనకు విమర్శనాత్మక దృష్టితో చూడాలని ఆయన చెప్పటమేకాదు, తన సంస్కృత పాండిత్యంతో అలాచేసిన మహనీయుడు. కొమర్రాజు లక్ష్మణరావుగారి సోదరి అబలాసచ్చరిత్ర మూల గ్రంథ రచయిత అయిన బండారు అచ్చమాంబగారు హరిజన బాలలను తన యింట పెంచుకున్నారు.

## సమకాలీన స్థితి దృష్ట్యా చూడాలి

జాతీయ పునరుజ్జీవనోద్యమంలో ఆంధ్రదేశంలో కుల వ్యవస్థకు వ్యతిరేకంగా వీరేశలింగం, గురజాడ, కొమర్రాజు, రఘుపతి వెంకటరత్నంనాయుడు మున్నగువారు సాగించిన పోరాటం, ఆనాటి కరడు గట్టిన కుల, మత ఛాందసవాదుల తీవ్ర ప్రతిఘటన మధ్య జరిగిన విషయం గుర్తు పెట్టుకోవాలి. వీరు సాహిత్యంలో, సమాజంలో సంస్కరణల కోసమే కాదు, సమాజాభివృద్ధికి తీరని ఆటంకంగా కుల వ్యవస్థ, కుల విభజన, కుల అసమానత్వాలు, కుల పీడన అన్నింటికంటే దారుణంగా అంటరానితనం ఉన్నదని తాము గ్రహించడమే కాదు. తాము ఆచరణలో కుల వ్యవస్థను అధిగమించడానికి తమ తమ పద్ధతులలో తీవ్రంగా ప్రయత్నించారు. సహపంక్తి భోజనాలు, వర్ణాంతర వివాహాలు, అస్పృశ్యతను పాటించకపోవడం మున్నగునవి ఆనాడు సంఘంలో ఎంత సంఘర్షణను, కల్లోలాన్ని లేపాయో మనం తక్కువ అంచనా వేయకూడదు. బ్రహ్మనాయుడు చాపకూడు సిద్ధాంతం కుల వ్యవస్థను కూల్చివేసిందా? వీరేశలింగం సహపంక్తి భోజనాలు, కులాంతర వివాహాలు కుల వ్యవస్థను రూపుమాపాయా? ఆనాటి తొలి హరిజన హాస్టళ్లు అంటరానితనాన్ని అంతం చేశాయా? అని నేడు ప్రశ్నించడం సులువే కావచ్చు. ఈనాటి మారిన పరిస్థితుల దృష్ట్యా కాదు ఆనాటి కరడుగట్టిన కుల వ్యవస్థ పరిస్థితుల్లో హరిజనుడు కనబడితే సచేల స్నానం చేసే పరిస్థితిని, శూద్రకులస్థుడు కనబడితే తినే తినే అన్నాన్ని అవతల పడవేసే స్థితిని, పల్లెటూళ్ళలో సవర్ణుల వీధిలో అంటరానివారిని నడవనీయని పరిస్థితిని మనం వూహించాలి. అప్పుడే ఆనాటి ఆంధ్రదేశంలో ఈ మహనీయులు తెచ్చిన భావ విప్లవం, సాంఘిక విప్లవం కుల వ్యవస్థకు వ్యతిరేకంగా జరిపిన పోరాటం యొక్క ప్రభావం, దాని ప్రాధాన్యత మనకు బోధపడుతుంది.

## జాతీయోద్యమ కాలంలో

ఆ తరువాత జాతీయోద్యమ కాలంలో కుల వ్యవస్థకు వ్యతిరేకంగా జరిగిన పోరాటానికి వీరేశలింగం యుగంనాటి పోరాటం ప్రాతిపదికలు వేసిన విషయం గుర్తించాలి. ఆనాటి సంఘ సంస్కరణోద్యమ ప్రభావం, కులాలకు, కుల వ్యవస్థకు వ్యతిరేకంగా యువతరాన్ని తీర్చిదిద్దించి వారిలో వచ్చిన సాంఘిక చైతన్యం, నూతన సంస్కారం, భావాలు, రాజకీయ చైతన్యం పొందడానికి, స్వాతంత్ర్యోద్యమంలో దూకడానికి, కుల, మత రహిత సమాజదృష్టి పెంపొందడానికిది దోహదం చేసింది.

1905 వందేమాతరం ఉద్యమం ఆంధ్రదేశంలో గొప్ప రాజకీయ చైతన్యాన్ని కల్గించింది. బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశ పర్యటన ఎంతోమంది యువకులను దేశభక్తులుగా, జాతీయోద్యమ అభిమానులుగా ఆ తరువాత స్వాతంత్ర్య సమర యోధులుగా చేసింది. రాజమండ్రిలో జరిగిన పాల్ బహిరంగసభలోనే ఆంధ్ర జాతీయకవి చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు ప్రఖ్యాతమైన "భరతఖండంబు చక్కని పాడి యావు" అన్న గీతాన్ని ఆశువుగా చెప్పారు. వీరేశలింగంగారి సంఘసంస్కరణోద్యమంతో, మేల్కొంచి చిలకమర్తిని అటు పిమ్మట వందేమాతరం ఉద్యమంతో ఎంతగానో ప్రభావితం చేసి దేశభక్తి కవితల నుప్పొంగజేశాయి. చిలకమర్తివారు రాజారామమోహన్‌రాయ్ పేరిట జాతీయ పాఠశాలను

నెలకొల్పి హరిజన బాలురను తొలిసారిగా యితర సవర్ణ కులస్థుల బాలురతో కలిపి తమ పాఠశాలలో చేర్చుకున్నారు. పంచమ కులస్థుల బాలురను చేరిస్తే తమ పిల్లలను పాఠశాలకు పంపించబోమని మిగిలిన కులాలవారు దండెత్తారు. అప్పుడు అంటరానితనానికి వ్యతిరేకంగా తీవ్ర ప్రచారంచేసి, అది ఏ విధంగా సమాజాన్ని, దేశాన్ని నాశనం చేస్తుందో చెప్పి, అది హిందూ మతానికి ఎంత కళంకం తెచ్చిందో చెప్పి దానిని పారద్రోలాలని ఘంటాపథంగా చిలకమర్తి వారు, ఆయన అనుయాయులు పోరాటం జరిపారు. అందుకు తమపై ఆనాటి మతాధిపతులు, కులాధిపతులు సంఘ బహిష్కార పత్రాలు జారీ చేయించి తమకు నిప్పు, నీళ్లు పుట్టకుండా చేసిన కుల, మత దౌష్ట్యానికి, పెత్తందారీతనానికి వ్యతిరేకంగా తీవ్ర ప్రతిఘటన చేశారు. టంగుటూరి ప్రకాశంగారు బారిష్టరు చదువడానికి లండన్ వెళ్ళి రాజమండ్రి తిరిగి వచ్చినప్పుడు మతాధిపతులు వారిని కులంలోంచి వెలివేసి, బహిష్కార పత్రాలు జారీ చేసినప్పుడు ఈ పోరాటం తారాస్థాయి నందు కుంది. చిలకమర్తివారు ఆనాటి బహిష్కరణలకు వ్యతిరేకంగా జరిపిన పోరాటంలో ప్రముఖ స్థానం వహించారు. శ్రోత్రీయ బ్రాహ్మణ కుటుంబంలో జన్మించి, నీళ్లతో నిప్పుల్ని కడిగే శుద్ధ ఛాందస బ్రాహ్మణ ఆచార వ్యవస్థలోంచి బైటపడటానికి ఆనాటి వీరేశలింగం, రఘుపతి వెంకటరత్నంనాయుడు, చిలకమర్తి తదితరులు జరిపిన పోరాటం స్త్రీ పునర్వివాహం, స్త్రీ విద్య, వేశ్యావృత్తి నిర్మూలనతోనే ఆగిపోలేదు. హరిజన కులంలోంచి బాలురనుతెచ్చి, విద్యాలయాల్లో చేర్చి అంటరానితనాన్ని పోగొట్టాలన్న ఉద్యమానికి కూడా విస్తరించిన విషయం గమనించాలి. జాతీయోద్యమం యిచ్చిన స్ఫూర్తి - కుల వ్యవస్థకు అంటరానితనానికి వ్యతిరేకంగా జరిగే పోరాటాన్ని మరొక అడుగు ముందుకు వేయించింది. వీరేశలింగంగారు జాతీయోద్యమంలోకి రాలేకపోయినా, ఆనాటి తొలి దేశీయ మహాజనసభ (జాతీయ కాంగ్రెస్ సభలు)లలో పాల్గొన్నారు. వాటి సరసనే జరిగిన సాంఘిక సంస్కరణ మహాసభలకు ఆధ్వర్యం వహించి అంటరానితనానికి వ్యతిరేకంగా కుల వ్యవస్థకు, వివక్షణలకు వ్యతిరేకంగా ఆ సభలలో తీర్మానాలు చేయించి, వాటిని రూపుమాపడానికి ప్రారంభమైన ఉద్యమానికి స్ఫూర్తి యిచ్చారు.

చిలకమర్తివారు తన స్వీయ చరిత్రలో వ్రాసుకొన్న ఈ వాక్యాలు ఆనాటి భావ సంఘర్షణనే కాదు. కుల, మత తత్వాలకు, వ్యతిరేకంగా జరిగిన పోరాటాన్ని ప్రతిబింబి స్తున్నాయి. వారు ఇలా అన్నారు :

"బ్రాహ్మణ బ్రహ్మణేతర సమస్య రూపుమాసి పోవలయును. అందరము భారతమాత అనుంగుబిడ్డలమే యన్న భావము ప్రబలవలెను. హిందువులు, మహమ్మదీ యులు, బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు, నిమ్న జాతులు వేలకొలది. ఏండ్ల నుండి యిక్కడే పుట్టి, ఇక్కడనే పెరిగి, యిక్కడి గాలి పీల్చి, యిక్కడి నీరు త్రాగి, యిక్కడి పాడి పంటలను అనుభవించి భారత మాతృస్తన్యము పానము చేసి యిచ్చటనే వర్ధిల్లిరి. పరస్పర ద్వేషములు వినాశకరములు గాని శ్రేయోదాయకములుగావు. పేద సాదలను భేదముండ కూడదు".

రాముడు, కృష్ణుడు మొదలగు మన దేవుళ్ళందరు బ్రాహ్మణేతరులేసనీ, వేద విభజన చేసిన, పంచమవేదం భారతం రచించిన వేదవ్యాసుడు పల్లెదాని కొడుకు, మహాపవిత్రమైన గాయత్రి మంత్రాన్ని రచించిన విశ్వామిత్రుడు బ్రాహ్మణే తరుడు, ఆళ్వారులు బ్రాహ్మణేతరులు, అంటరానివారు - వీరందరు మన దేవతలు, పూజ్యులే. అందుచేత కుల భేదాలను తీసి గట్టునపెట్టండి అని చిలకమర్తివారు ఉద్బోధించారు.

## ఉన్నవ వారి మాలపల్లి

1919-21 సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని కారాగార శిక్ష ననుభవిస్తూ సుప్రసిద్ధ జాతీయోద్యమ ప్రముఖులు ఉన్నవ లక్ష్మీనారాయణగారు జైలులోనే రచించిన మాలపల్లి నవల ఆంధ్రదేశంలో కుల వ్యవస్థకు, అంటరాని తనానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో ఒక మహత్తర అధ్యాయం. మాలపల్లెను ఆయన మునిపల్లెగా, ధర్మక్షేత్రంగా ఆనాడు జాతీయోద్యమంలో తీర్చిదిద్దారు. కులాల అడ్డుగోడ లను కూల్చివేయడానికి, అంటరానితనాన్ని రూపుమాపడానికి ఉన్నవవారు ఈ నవల ద్వారా చేసిన మహత్తర కృషిని తక్కువ అంచనా వేయగలమా?

జాతీయోద్యమంలో భాగంగానే గాంధీజీ హరిజనోద్య మాన్ని ప్రారంభించారు. భారతదేశంలోసాగుతున్న స్వాతం త్ర్యోద్యమాన్ని చీల్చడానికి బ్రిటిష్ సామ్రాజ్యవాదులు అనేక మాయోపాయాలను పన్నారు. కుల, మత విభేదాలను వినియోగించుకొని విభజించి పాలించే నీతిని అవలంబించారు. దీనికి వ్యతిరేకంగా తిలక్, గాంధీజీలు పోరాడారు.

బాలగంగాధర్ తిలక్ "స్వరాజ్యం నా జన్మహక్కు" అన్న నినాదంతో భారత జాతీయోద్యమంలో సమరశీలమైన ఒక మలుపు తీసుకొని వచ్చారు. "గీతా రహస్యం" అనే మహాగ్రంథాన్ని ఆయన మాండలే జైలులో రచించి - భగవద్గీతలోని, కర్మయోగ సిద్ధాంతానికి నూతన నిర్వచనం యిచ్చారు. ఆకర్మణ్యత్వాన్ని, క్రియా శూన్యతను పారద్రోలి భారతీయ తత్వశాస్త్రంలో "కర్మ" సిద్ధాంతానికి ఒక విప్లవాత్మకమైన దృక్పథాన్ని తీసుకువచ్చారు. ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వ నిర్బంధకాండకు వ్యతిరేకంగా ప్రజా సమీకరణకు మార్గంగా తిలక్ మహాశయుడు ప్రారంభించిన "గణేశ ఉత్సవాలు" "శివాజీ ఉత్సవాల"లో కుల మత విభేదాలను అధిగమించి అన్ని కులాల వారిని, అన్ని మతాల వారిని సమీకరించారు. పూనా, బొంబాయి మొదలైనచోట్ల ఈ ఉద్యమాలలో ముస్లిములనేకాక హరిజనులను పాల్గొనేటట్లు చేశారు. అంటరాని తనాన్ని తీసివేయాలని పెద్ద ఎత్తున ఆయన ప్రబోధించారు. 1894 సంవత్సరంలో ఆయన జరిపిన గణపతి ఉద్యమాల గురించి, అంటరానితనాన్ని

నిర్మూలించడానికి చేసిన కృషి గురించి ఒక సంఘటనను ఆయన ఇలా వివరించారు.

"1894వ సంవత్సరమున గణపతి ఉత్సవాలలో మాదిగ వాడొకడు తన గణపతి విగ్రహాన్ని తీసుకువచ్చాడు, కాని వానిని ఉత్సవములో జేరనియ్యలేదు. అతడు నాతో వచ్చి చెప్పుకొనెను. నేను నా గణపతిని పెట్టుకొన్న బండిలో అతని విగ్రహాన్ని పెట్టుకొనవలసిందని చెప్పాను. ఈ సంగతి పత్రికలలో ప్రచురించబడెను. కాని నన్నెవరూ బ్రాహ్మణ వర్గము నుండి బహిష్కరించలేదు. అంటరానితనాన్ని తీసిపార వేయాలి. కొంతకాలానికి భోజన ప్రతిభోజనాలు, సంబంధ బాంధవ్యాల గురించి కూడా ఆలోచించి పరిష్కరించవలసి ఉంటుంది. పరిష్కరించక తప్పదు. కులాచారములు మారి తీరవలయును. ఎన్నడో అనాది కాలములో నిరంకుశులగు బ్రాహ్మణులు ఈ ఆచారాన్ని ఏర్పరచినమాట వాస్తవము కాదని నేను అనను. ఇది యొక తరహా రోగము. ఈ రోగమును కూకటి వ్రేళ్లతో పెకలించి వేయవలయును".

*— తిలక్ ప్రసంగం కృష్ణాపత్రిక నుండి*

## హరిజనోద్యమం; పూనా ఒడంబడిక చారిత్రక పాత్ర

హరిజనులకు, ముస్లింలకు ప్రత్యేక నియోజకవర్గాలను ఏర్పరచి వారిని జాతీయపోరాటం నుండి వేరుచేయాలని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు వేసిన ఎత్తుగడ నాటి బ్రిటిష్ ప్రధాని రామ్సేమేక్డనాల్డ్ (1932) ప్రకటించిన కమ్యూనల్ ఎవార్డు. దీనికి వ్యతిరేకంగానే గాంధీజీ ఆమరణ నిరాహారదీక్ష వహించారు. చివరకు హిందూమత నాయకులు దళిత ప్రజల నాయకుడు డాక్టర్ అంబేద్కర్ ప్రభృతులు సంతకాలు చేసిన పూనా ఒడంబడిక జరిగింది. గాంధీజీ నిరాహారదీక్ష విరమించారు. ఇది భారత జాతీయోద్యమంలో ఒక మూలమలుపు తీసుకొని వచ్చింది. భారతదేశంలోని అంటరానివారిని జాతీయోద్యమానికి దూరం చేయాలనే బ్రిటిష్ సామ్రాజ్య వాదుల ఎత్తుగడను ఇది భగ్నం చేసింది. దేశవ్యాపిత హరిజనోద్యమం జాతీయోద్యమంలో భాగంగా పెద్ద ఎత్తున జరిగింది. ఎక్కడికక్కడ హరిజన సేవా సంఘాలు ఏర్పడ్డాయి. ఆంధ్రదేశంలో 'కాశీనాథుని నాగేశ్వరరావు ప్రభృతులు ఈ ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించారు. కాంగ్రెస్ కార్యకర్తలు - అగ్రకులాలకు చెందిన వారు - హరిజన పేటలకు వెళ్ళి వారిలో విద్య విజ్ఞానాలు వ్యాపింపజేయడానికి, అంటరానితనాన్ని పోగొట్టడానికి అది వరకు ఎన్నడూ లేనంత బృహత్తర ఉద్యమాన్ని ప్రారంభించారు. హరిజన దేవాలయ ప్రవేశం కోసం దేశమంతటా అనేక సత్యాగ్రహ పోరాటాలు సాగాయి. అనేక హరిజన హాస్టళ్ళు ప్రారంభించబడ్డాయి. అందులో అనేకమంది హరిజన యువకులు విద్య విజ్ఞానాలు పొంది పైకి వచ్చారు. అన్నింటికంటే ముఖ్యంగా అగ్రకులాల వారిలో అంటరానితనం అన్నది హిందూ మతానికి, హిందూ సమాజానికి ఒక పెద్ద కళంకం అన్న భావాన్ని కల్గించడానికి హరిజనోద్యమం ఎంతగానో తోడ్పడింది. హిందూ సనాతన వాదులకు అస్పృశ్యతను పాటించే వారికి హరిజనోద్యమ కారులకు ఆనాడు భీషణ పోరాటం జరిగింది.

గాంధీజీపై హిందూ సనాతనవాదులు హత్యాప్రయత్నం చేసిన ఘటన జరిగి. గాంధీజీ హరిజన పత్రికలో వ్రాసిన ఒక ఘటన ఇక్కడ పేర్కొనడం అవసరం.

హరిజనోద్యమ సందర్భంలో గాంధీజీ ఆంధ్రదేశంలో పర్యటించుతూ పశ్చిమగోదావరిజిల్లాలోని తణుకులో బహిరంగ సభ జరిపారు (1920). ఆ సభకు వచ్చిన హరిజనులు దూరంగా కూర్చున్నారు. వారు సభకు మధ్య వచ్చి కూచుంటే కాని తాను మాట్లాడనని గాంధీజీ పట్టుపట్టారు. హరిజనులు సభ మధ్యకు వచ్చి కూచున్నారు. అంటరానితనాన్ని 'మొదలంటా' పెరికి వేయాలని, అదొక జాతీయ మహాపాపమని గాంధీజీ అన్నారు. సభ జయప్రదంగా ముగిసింది. అనేకమంది గాంధీజీ హరిజనోద్యమానికి బంగారు నగలు, నాణ్యాలు కూడా యిచ్చారు.

ఆ తరువాత గాంధీజీకి ఒకలేఖ వచ్చింది. తణుకులో మీరు హరిజనులను సభ మధ్య కూచోబెట్టారు బాగానే ఉంది. కాని ఆ తరువాత సభకు వచ్చినవారు తణుకు కాల్వలో పసిబిడ్డ బాలాది స్నానాలు చేసి అంటరానివారిని తాకినందుకు శుద్ధి చేసుకున్నారు. మీ వెనుక ఇటువంటి కపటనాటకాలు జరుగుతున్నాయి. అని ఆ లేఖలో ఉంది. దీనికి జవాబుగా హరిజన పత్రికలో గాంధీజీ ఒక వ్యాసం వ్రాశారు. ఇది 'మానసిక పరివర్తనకై, భావ పరివర్తనకై జరుగుతున్న సుదీర్ఘ పోరాటమనీ, తరతరాలుగా యుగ యుగాలుగా వచ్చిన ఈ అంటరాని తనమనే జాతీయ మహాపాపాన్ని తొలగించడానికి బృహత్తర పోరాటం సాగించాలనీ అన్నారు. ఆనాటి ఈ కపట నాటకాన్ని తీవ్రంగా ఖండించారు.

గాంధీజీ సాగించిన హరిజనోద్యమం అంటరానితనాన్ని రూపుమాపడానికి, హరిజనులను సమాజంలో ఒక భాగంగా చూడడానికి, అటువంటి భావపరివర్తన కలిగించడానికి, ఆ తరువాత అంటరానితనాన్ని నిషేధించడానికి ప్రధాన ప్రాతిపదిక వేసిన విషయాన్ని చరిత్రకారులు ఎవరూ కాదనలేరు.

జాతీయోద్యమ ప్రభావంతో అనేకమంది ఆంధ్రకవులు అస్పృశ్యతకు వ్యతిరేకంగా ఎన్నో గేయాలు, పాటలు, పద్యాలు రచించారు. అందులో మంగిపూడి వెంకటశర్మ, గరిమెళ్ళ సత్యనారాయణ, జాలా రంగస్వామి, మాదిరపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి మొదలైనవారు ఎందరో ఉన్నారు.

"జాతికి వెన్నెముక యనందగు అంత్య జాతులను సంఘమునకు దూరముచేసి, మనకు గానివారినిగా చేసుకొనుటకన్న యాత్మహత్య వేరొకటిలేదు అని తమ "నిరుద్ధ భారతము"లో మంగిపూడి అంటే - గరిమెళ్ళ వారు "నిమ్నజాతుల

నెత్తుమోయి - వారు నీరసించిన యెడ - ఇక నీకు గోయి" అన్నారు.

పంచములని యీసడించడం పంచమహాపాతకములతో సమానమని గరిమెళ్ళ అన్నారు.

మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రిగారు ప్రఖ్యాతమైన "అంటరాని వారెవరంటే మా వెంటరానివారు" అన్న హృద్యమైన గేయం చెప్పారు.

శిష్లా సత్యనారాయణ, రాజశేఖర్, జంధ్యాల పాపయ్య శాస్త్రి, నెల్లూరి వెంకట్రామనాయుడు, గుర్రం జాషువా, కుసుమ ధర్మన్న, నక్కా చినవెంకయ్య మొదలైన ఎందరో కవులు ప్రఖ్యాత గేయాలు వ్రాశారు.

## కమ్యూనిస్టు ఉద్యమం

1934లో ఆంధ్రలో ఆవిర్భవించిన కమ్యూనిస్టు ఉద్యమం మొదటి నుండి కులవ్యవస్థకు, అంటరానితనానికి వ్యతిరేకంగా పోరాటాన్ని సాగించింది. వర్ణాంతర వివాహాలను ప్రోత్సహించింది. గ్రామసీమలలో ఆనాటికి యింకా ప్రబలంగా ఉన్న అంటరానితనాన్ని పోగొట్టడానికి హరిజనుల చేతి మంచినీళ్ళు త్రాగడం, వారి యిండ్లలో భోజనాలు చేయడం, వారికి తమ యిళ్ళలో భోజనాలు పెట్టడం, హరిజన యువకులను ఆటపాటల్లో మిగిలిన సవర్ణ యువకులందరితో కలపడం, రాత్రి బడులలో వారికి విద్యా విజ్ఞానాలు కల్గించడం మున్నగు కార్యక్రమాలను యువజనోద్యమం ద్వారా పెద్ద ఎత్తున నిర్వహించారు. ఇక్కడ ఈ వ్యాస రచయిత స్వీయానుభవం ఒకటి చెప్పాలి.

పశ్చిమగోదావరిజిల్లా భీమవరం తాలూకాలో యువజన సంఘాల తరఫున సంక్రాంతి ఆటల పోటీలు జరుపుతున్నాం. క్షత్రియ యువకులు మిగిలిన అన్ని కులాల యువకులతో బాటు హరిజన యువకులు కూడా చెడుగుడు బ్యాచీల్లో ఉన్నారు. చెడుగుడు ఆడేటప్పుడు చేతులను పట్టుకోవడమే కాక కాళ్ళు కూడా పట్టుకొని ఆడాలి. దానితో క్షత్రియ కుటుంబాల పెద్దలు ఈ పోటీల్లో హరిజన యువకులు ఉంటే ఆడవద్దని తమ కులం యువకులపై ఆంక్ష విధించారు. కాని యువజన సంఘం కుల పెద్దల అభ్యంతరాలను ఆటంకాలను త్రోసివేసి అన్ని కులాల యువకులను ఏకంచేసి హరిజన యువకుల కాళ్ళు పట్టుకోరాదనే ఆంక్షను తొలగించి వేసింది. ఆటల పోటీల ద్వారా కుల విభేదాలను, కుల హెచ్చుతగ్గులను ఆ విధంగా అంతం చేయగల్గింది. ఇటువంటి ఉదాహరణలు ఎన్నెన్నో!

## వర్గ సంఘాలు – కుల సంఘాలు

కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన వ్యవసాయ కార్మిక సంఘాలను నిర్మించడానికి పూనుకున్న తొలి రోజుల్లో (1930 దశకం రెండవ అర్థభాగం) షెడ్యూల్డు కాస్ట్ ఫెడరేషన్, క్రిష్టియన్ ఫాదర్ల ప్రాతికూల్యం ప్రతిఘటన ఎదురయ్యాయి. అన్ని కులాల్లోని వ్యవసాయ కార్మికులను వర్గ ప్రాతిపదికపై వ్యవసాయ కూలీ సంఘాలలో చేర్పించి వారినందరిని సమైక్యపరిస్తేనే కూలీ రేటు, పాలేర్ల జీతాలు, పిచ్చి కుంచాలు, నాము పద్ధతులు వగైరా దోపిడీ విధానాలకు వ్యతిరేకంగా పోరాటాలు, సమ్మెలు జయప్రదం అవుతూండేవి. కాని, కుల పెద్దలు, కుల సంఘాల నాయకులు, క్రైస్తవ ఫాదరీలు సవర్ణ -అవర్ణ వ్యవసాయ కూలీల కలయికకు అనుకూలంగా ఉండటానికి బదులు తమ పెత్తనాలకు ఎక్కడ భంగం కల్గుతుందోనని ఇటువంటి వర్గ సంఘాల నిర్మాణాన్ని వ్యతిరేకించుతూ ఉండేవారు. గ్రామీణ భూస్వామ్య ధనాఢ్య వర్గాల తెరవెనుక ప్రోత్సాహం కూడా వీరికి ఉండేది. సమ్మెలను చెడగొట్టడానికి సవర్ణ - అవర్ణ వ్యవసాయ కూలీల మధ్య భూస్వామ్యవర్గాలు చీలికలు తెచ్చేవారు. కులతత్వాన్ని కుల అహంకారాన్ని రెచ్చగొట్టేవారు. దురదృష్ట వశాత్తూ ఆనాటి షెడ్యూల్డు కాస్ట్ ఫెడరేషన్‌నాయకులు ఈ భూస్వామ్య వర్గాల కుట్రలను గ్రహించేవారు కాదు. అదే సమయంలో కమ్యూనిస్టు పార్టీ, కమ్యూనిస్టుపార్టీ వర్గ సంఘాలు - కుల అహంకారానికి, కుల నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ఎక్కడ ఎప్పుడు ఏ సంఘటన వచ్చినప్పటికీ దళితుల పక్షాన, అంటరాని వారి పక్షాన నిలబడి పోరాడేవారు. అదే సమయంలో గ్రామ కక్షలకు వ్యతిరేకంగా రైతు కూలీ సామరస్యాన్ని కూడా కాపాడుతూ రైతాంగాన్ని ఒప్పించి వ్యవసాయ కార్మికుల కోర్కెలను అంగీకరింప జేయడం జరుగుతుండేది.

ఈ విధంగా జాతీయోద్యమ కాలం నుండి కమ్యూనిస్టుపార్టీ గ్రామసీమలలో కుల వ్యవస్థకు వ్యతిరేకంగా, కుల నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాడుతూనే వచ్చింది. వర్గ సంఘాల రపాతిపదికపై సమాజంలో అట్టడుగు ప్రజానీకం తరఫున నిలబడి పోరాడిన గర్వించదగిన, చరిత్ర కమ్యూనిస్టుపార్టీకి ఉంది.

జమీందారీ విధానానికి భూస్వామ్య విధానానికి ఒక్క మాటలో ఫ్యూడల్ వ్యవస్థకు వ్యతిరేకంగా జరిపిన పోరాటమే - కాంగ్రెస్ కంటే భిన్నమైన రీతిగా, గ్రామీణ పేద ప్రజలలో కమ్యూనిస్టుపార్టీ సాంఘిక, రాజకీయ చైతన్యం తీసుకు రాగల్గింది.

## రెండు ప్రధాన జాతీయ కర్తవ్యాలు

అసలు బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి, ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాన్ని జోడించిన ఘనత భారత కమ్యూనిస్టు ఉద్యమానిదే ననడం నిర్వివాదం. ఈ పోరాటంలో అంతర్భాగంగానే ఆనాడు ఈనాడు కూడా అట్టడుగు కులాల వారిని, పీడిత ప్రజలను హరిజన, గిరిజన తదితర వెనుకబడిన వర్గాలకు కమ్యూనిస్టు ఉద్యమం తన శక్తి వంచనలేకుండా సమీకరించుతూంది. ఇందులో వైఫల్యాలు, అపజయాలు ఉండే ఉండవచ్చు.

స్వాతంత్ర్యానికి పూర్వం భారతదేశ ఎజెండాలో ఉన్నది భారత జాతీయ విముక్తి పోరాటం వలన బానిసత్వం నుండి భారత ప్రజల విముక్తి. ఈ పోరాటంలో ఏ మేరకు ఏ ప్రజానీకం

ఏయే వర్గాలు పాల్గొన్నాయో ఆ వర్గాలు రాజకీయంగా చైతన్యం పొందాయి. ఆనాడు కుల దృష్ట్యా ఎవరూ ఈ పోరాటం గురించి ఆలోచించలేదు. దేశభక్తి, జాతీయ భావం, త్యాగదీక్షలు ఆనాటి పోరాటానికి గీటురాళ్ళు. ఎవరు త్యాగం చేస్తే వారే ధీరులు, వీరులు ప్రజల నాయకులు.

గాంధీజీ ఏ కులం? నెహ్రూ ఏ కులం? భగత్ సింగ్ ఏ కులం? అల్లూరి సీతారామరాజు ఏ కులం? బందరు జెండా వీరుడు తోట నర్సయ్య ఏకులం? ఆ రోజుల్లో ఎవరూ కుల దృష్టితో జాతీయోద్యమాన్ని బేరీజు వేయలేదు. బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం ప్రధాన లక్ష్యం. లాఠీలు, జైళ్లు, తుపాకులు, ఉరికంబాలు ఆనాటి దేశభక్తియుత పోరాటానికి అగ్ని పరీక్షలు, గీటురాళ్ళు. అలాగే కమ్యూనిస్టు ఉద్యమం, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన సాగిన కార్మిక, కర్షక, తదితర పీడిత ప్రజల ఉద్యమాలలో, జమీందారీ, జాగీర్దారీ భూస్వామ్య వ్యతిరేక పోరాటంలో ప్రాణాలర్పించిన వేలాది అమరవీరులు, త్యాగధనులు - ఎవరు ఏ కులం? అన్న దృష్టితో ఎవరూ చూడలేదు. అందులో అన్ని కులాల వారు ఉన్నారు. ఎవరు ఎక్కువ త్యాగం చేశారు? ఎవరు ఎక్కువ విప్లవదీక్ష ప్రదర్శించారు అన్నదే ఆనాడు ఈనాడు కూడా పరిగణనలోకి వచ్చే విషయం.

కాని దురదృష్టవశాత్తు ఈనాడు జాతీయోద్యమాన్ని, కమ్యూనిస్టు ఉద్యమాన్ని తెలంగాణా సాయుధపోరాటాన్ని కూడా కులరీత్యా విభజించి చూసే ప్రగతిశీల విరుద్ధమైన ధోరణి వ్యక్తమౌతూంది. ఈ ఉద్యమాలన్నింటికి అగ్రవర్ణాలవారే నాయకత్వం వహించారనీ, అందుచేత ఈ ఉద్యమాలకు దళిత ఉద్యమాలకు లేదా కుల వ్యవస్థ వ్యతిరేక పోరాటాలకు ఎట్టి సంబంధం లేదనీ, వారు దళిత ప్రజల విముక్తికి ఎటువంటి కృషి చేయలేదని ఒక అవాస్తవిక వాదం వినపడుతూంది.

ఇది చారిత్రక దృష్టితోకాక, వేర్పాటువాద దృష్టితో, సంకుచిత కుల దృష్టితో చూడటం తప్ప వేరు కాదు. ఆనాడు భారత ప్రజల ప్రధాన లక్ష్యం సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక ప్రజాతంత్ర విప్లవ పోరాటం, విముక్తి పోరాటం. అది ఆనాడు భారతదేశం చరిత్రలో ప్రప్రథమ ఎజెండా. మిగిలిన అన్ని సామాజిక విముక్తి పోరాటాలు దళిత ప్రజల విముక్తి, స్త్రీల విముక్తి, కుల, మత ఛాందసత్వాలకు వ్యతిరేక పోరాటాలు- అందులో అంతర్భాగాలుగా మాత్రమే సాగాలి, సాగుతాయి, సాగినాయి కూడా.

## జాతీయోద్యమంలో డాక్టర్ అంబేద్కర్ పాత్ర

డాక్టర్ అంబేద్కర్ స్వాతంత్ర్యోద్యమ కాలంలో - సామ్రాజ్యవాద వ్యతిరేక ఫ్యూడల్ వ్యతిరేక పోరాట కర్తవ్యాలను - దళిత విముక్తి పోరాట కర్తవ్యాలను ఏ మేరకు జోడించారో, ఆ మేరకు ఆయన ఆనాటి భారతదేశ విముక్తి పోరాటంలో సానుకూల పాత్ర నిర్వహించారు. పూనా ఒడంబడికపై డాక్టర్ అంబేద్కర్ సంతకం చేయడం అటువంటి సానుకూల పాత్ర. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల వ్యూహాన్ని (కుల, మత రీత్యా భారత ప్రజలను విడదీయాలన్న) దెబ్బకొట్టడంలో డాక్టర్ అంబేద్కర్ ఆనాడు ఆ మేరకు చారిత్రక పాత్ర నిర్వహించారు. జాతీయ విముక్తి పోరాటాన్ని, దళిత విముక్తి పోరాటాన్ని సన్నిహితపరిచారు. అది డాక్టర్ అంబేద్కర్ గర్వించదగిన విషయం. అంతే తప్ప కొందరు అంటున్నట్లు పశ్చాత్తాపపడ వలసిన విషయం కాదు. కానేరదు.

భారత జాతీయోద్యమం, భారత జాతీయ పునరుజ్జీవనోద్యమం, భారత కమ్యూనిస్టు ఉద్యమం ఇవి సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో, ఫ్యూడల్ వ్యతిరేక పోరాటంలో హరిజన, గిరిజన తదితర పీడిత ప్రజల విముక్తి పోరాటాన్ని, కుల వ్యవస్థ వ్యతిరేక పోరాటాన్ని జోడించడంలో మరింత క్రియాశీల పాత్రను నిర్వహించాలనడం వేరు. ఈ చారిత్రాత్మక ఉద్యమాలు దళిత ప్రజల విముక్తిని విస్మరించాయనడం, వారికి అపచారం చేశాయనడం వేరు. అలా అనడం అవాస్తవికం, చరిత్ర విరుద్ధం, అపచారం. చారిత్రక క్రమాన్ని తారుమారు చేయడం, భారత జాతీయ కర్తవ్యాలను విస్మరించడం మాత్రమే అవుతుంది.

## నేటి ప్రప్రథమ ఎజెండా : సామాజిక విముక్తి పోరాటం

స్వాతంత్ర్యానంతరం సామాజిక విముక్తి పోరాటం ప్రధాన కర్తవ్యం. ప్రప్రథమ ఎజెండా.

ఈ 45 సంవత్సరాలలోను భారత జాతీయ విముక్తి పోరాట లక్ష్యాలను, కర్తవ్యాలను పెట్టుబడిదారీ భూస్వామ్య పాలక వర్గాలు అలక్ష్యం చేశాయి. ఏ దరిద్ర నారాయణుల విముక్తి గురించి గాంధీజీ కలలుగన్నారో ఆ కలలు, ఆ లక్ష్యాలు పూర్తిగా నెరవేరలేదు. ఈనాటికీ దేశప్రజలలో సుమారు సగభాగం - నేటికీ 40 శాతం. దారిద్ర్యరేఖకు దిగువనే ఉన్నారు. నిరక్షరాస్యత నిరుద్యోగం, పేదరికం, ఆర్థిక, సాంఘిక అసమానతలు, సాంఘిక పీడన కొనసాగుతున్నాయి. దీనికి కారణం సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట లక్ష్యాలు నెరవేరినప్పటికీ, పెట్టుబడిదారీ భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు విజయవంతం కాలేదు. అసంపూర్తిగా ఉండి పోయాయి. పట్టణ, గ్రామీణ ధనాఢ్య వర్గాల చేతుల్లోనే సంపద కేంద్రీకృతం అయింది. అంతకంటే ముఖ్యంగా స్వాతంత్ర్యానంతరం పాలకవర్గాలు కుల, మత, ప్రాంతీయ తత్వాలను తమ రాజకీయాధికారం కోసం పనిగట్టుకొని రెచ్చగొడుతున్నాయి. గ్రామీణ భూస్వామ్య వర్గాలు కులరీత్యా అణచివేత అత్యాచారాలు సాగిస్తున్నారు. వ్యవసాయ విప్లవం, భూమి పంపకం అసంపూర్తిగానే ఉండిపోయింది.

(తరువాయి 61వ పేజీలో)

# కులవ్యవస్థ–పుట్టుపూర్వోత్తరాలు

**శ్రీ కొల్లా వెంకయ్య**

ప్రపంచంలో ఆయా దేశాల పరిణామ క్రమములో అనేక దేశాలలో పురోహితులు (మేధావులు), క్షత్రియులు (పోరాడే వారు), వైశ్యులు (వ్యాపారము, యితర వృత్తులు) చేసేవారనే తేడాలున్నట్టు సామాజిక శాస్త్ర వేత్తలు వ్యక్తం చేస్తూ వచ్చారు. ఇవి కుటుంబాలు ఆయా సమయాలలో నిర్వహించే వృత్తులు తప్ప ప్రారంభములో చేపట్టిన వృత్తినే కుటుంబాలు స్థిరంగా చేబట్టాలనే నియమము ఆయా దేశాలలో లేదు. ఈ పరిస్థితి ఆచరణలో మార్పు చెందుతూ వచ్చినప్పటికీ ఆయా కుటుంబాల కులములో మన దేశంలో మార్పు లేదు. ఈ కుల విభజనను మార్క్సు మహాశయుడు శ్రమ విబజనగా తమ రచనలలో వ్యక్తం చేశారు. ఇండియా, ఈజిప్టులలో వ్యాప్తిలో నున్న మోటుతరహా శ్రమ విభజన, వారి పరిపాలనా వ్యవస్థ మతాలలో ప్రతి ంబిస్తుందని ఒక వ్యాసములో 1846లోనే వ్యక్తం చేశారు. (వాల్యుం-1 పేజీ 43). ఈజిప్టులో యీ కుల వ్యవస్థ ఏ రూపంలో వుండేదో తెలియదు. "ఇండియాలో కుల వ్యవస్థ అనేది ప్రత్యేకమైన శ్రమ విభజనకాదా?" అని ఒక లేఖలో ఆయన ప్రశ్నించారు. (వాల్యుం-1 520వ పేజి). ఈ కుల వ్యవస్థ అనేది ఆయా వుత్పత్తి విధానాల సామాజిక అంశంగానే గాక, ఆర్థిక అంశంగా కూడ పని చేస్తుందని భావించాల్సి వుంటుందన్నమాట. మార్క్సు మహాశయుడు తమ "పెట్టుబడి" అనే మహా గ్రంథంలో భారతదేశ గ్రామీణ వ్యవస్థను గురించి వివరించాడు.

## కుల వ్యవస్థ రూపు తొడిగిన తీరు

ఆదిమ దశలో ఈజిప్టు తప్ప మిగతా అరేబియా దేశాలు పట్టణ నాగరికతను కలిగి వున్నారనీ, వారు నిరంతరము తిరుగుతుండే (nomads) వారి సహాయముతో ప్రపంచ ములో దూర ప్రాంతాలకు వ్యాపారాన్ని చేబట్టినట్లు, మెసపుటోమియా భారతదేశములోని సింధునదీ ప్రాంతము యీ తిరుగుజాతుల దాడులకు గురవుతూ వచ్చినట్లు కొందరు సామాజిక శాస్త్రవేత్తలు వ్యక్తం చేశారు. తమ పశువులతో ఒక ప్రాంతము నుండి మరొక ప్రాంతమునకు తిరిగే ఆర్యజాతులు గుర్రాలమీద, రథాలమీద వచ్చి సింధునదీ ప్రాంతముపై దాడులు చేసి అక్కడ ప్రాథమిక దశలో వున్న వ్యవసాయాన్ని, పురాలను (పట్టణాలను) నాశనం చేసినట్లు ఋగ్వేదమే చాటి చెప్పుతూంది. శంబరుడనే వానికి 99 పురాలున్నట్లు వాటినన్నిటినీ నాశనము చేసినందుకు ఋషులు ఇంద్రుని స్తుతించారు (ఋగ్వేదం). వారు యిక్కడ స్థిరపడే క్రమములో తమ నాయకుడైన ఇంద్రుని తమకు పశువులను, బానిసలను యిమ్మని ఋషులు పదే పదే ప్రార్థించి నట్లు ఋభువులు అనార్య జాతి వారైనప్పటికీ, సత్కర్మలను ఆచరించారు. కాబట్టి వారికి వారు "దేవత్వమును" ప్రసాదించినట్లు (పేజి 444), పశు సంపదకై ఋషులు యింద్రుని ప్రార్థించటమేగాక యిద్దరు ఋషులు తమతో వున్న మూడవ ఋషిని బావిలో త్రోసి, దానిపై బండి చక్రమును పెట్టి అతని పశువులను హరించినట్లు (పేజి 276) ఋగ్వేదం వ్యక్తం చేస్తుంది. క్రమంగా ఆర్యులు ఇతర జాతులను జయించి తమ గృహాలలో బానిసలుగా యిముడ్చుకొన్నట్లు, ఆ బానిసలు ఋషులపై తిరుగుబాట్లు చేసినట్లు కూడ ఋగ్వేదం ద్వారా వ్యక్తమవుతుంది. తమ గర్భదాసులైన త్రైతనుడు మొదలగువారు తనను చిత్రహింసలకు గురిచేసి నదిలో త్రోసారనీ, తనను రక్షించమనీ దీర్ఘతముడనే ఋషి నదులను ప్రార్థించినట్లు యీ ఋగ్వేదములో వివరింపబడ్డది. (పేజి 440). ఆర్య జాతులు సింధు ప్రాంతములోని జాతులను జయించి నివాసములను ఏర్పరచుకొనే క్రమములో మరల కుల వ్యవస్థ రూపురేఖలు తొడిగినట్లు ఋగ్వేదము 10వ మండలములోని పురుష

(60వ పేజీ తరువాయి)

## రెండు పోరాటాలను జోడించాలి

అందుచేత నేటి ఆర్థిక, సాంఘిక విముక్తి పోరాట కర్తవ్యాలను, కుల వ్యవస్థకు వ్యతిరేకంగా జరిగే పోరాటాన్ని జోడించడం ద్వారానే రెండు పోరాటాలు విజయవంతంగా ముందుకు సాగుతాయి. ఈ రెండు పోరాటాలు విడివిడిగా జయప్రదం కాలేవు. ఆర్థిక పీడన, కుల పీడన నేటి దోపిడీ వ్యవస్థకు రెండు ముఖాలు. ఒకే నాణేనికి రెండు వైపులు. అందుచేత నేటి దోపిడీ వ్యవస్థకు, కుల వ్యవస్థకు వ్యతిరేకంగా జాతీయ ప్రజాతంత్ర విప్లవం పరిపూర్తిని కోరే శక్తులన్నీ సమైక్యం కావాలి. గుత్త పెట్టుబడిదారీ విధానానికి ఫ్యూడల్ అవశేషాలకు, సాంఘిక అనర్థతలకు వ్యతిరేకంగా సకల వామపక్ష ప్రజాతంత్ర శక్తులు సమైక్యం కావాలి. అంతేకాని కుల వ్యవస్థకు వ్యతిరేకంగా కుల ప్రాతిపదిక పైననే పోరాడాలనడం చరిత్ర గుణపాఠాలను విస్మరించడమే కాగలదు. కుల వ్యవస్థకు వ్యతిరేకంగా నేడు జరుగవలసిన పోరాటం - ఒక జాతీయ పోరాటం. అది ఒక పాక్షిక పోరాటం కాదు. కాజాలదు. దళితుల పోరాటం దళితుల పోరాటం మాత్రమే కాదు. అది ఒక జాతీయ పోరాటం.!

సూక్తం స్పష్టం చేస్తుంది. ఈ సూక్తంలో కుల వ్యవస్థ విరాట్ పురుషుని అవయవాలుగా అభివర్ణించింది. విరాట్ పురుషుని తల బ్రాహ్మణులనీ, భుజాలు క్షత్రియులనీ, తొడలు వ్యాపారులనీ, శూద్రులు యీయన పాదాల నుండి పుట్టారనీ చెప్పింది. పురుష సూక్తం నాటికే హెచ్చు తగ్గులతో కూడిన సమాజము రూపొందినట్లు వ్యక్తం చేస్తుంది. ఈ కుల వ్యవస్థ స్థిరపడే క్రమములో రూపొందిన మంత్రతంత్రాలూ, ఆచారాలను యితర వేద సాహిత్యం వ్యక్తం చేస్తుంది. ఈ ప్రాంతములో స్థిర నివాసములు ఏర్పడ్డ తరువాత ఆ సమాజాలలో ఆధిపత్యము విషయమై బ్రాహ్మణ, క్షత్రియ వర్ణాల మధ్య వివాదమేర్పడ్డట్లు ఉపనిషత్తులు వ్యక్తం చేస్తున్నాయి.

## వ్యవసాయ అవసరాలు

ఆనాటి సమాజ అవసరాలు పెరిగే కొలదీ యీ జన సమూహము గంగానదీ ప్రాంతానికి విస్తరించి వ్యవసాయమును విస్తరింపజేయుట ప్రారంభించింది. కాని బ్రాహ్మణ ఆధిపత్యాన యజ్ఞ యాగాదుల్లో సాగే పశుబలీ, గృహ బానిసలు, సైనికుల తిరుగుబాట్లు వ్యవసాయ విస్తరణకు ఆటంకంగా పరిణమించ టంతో బౌద్ధ, జైన మతాలు పశుబలికి వ్యతిరేకంగా ముందు కొచ్చాయి. గౌతమ బుద్ధుడు పారిపోయి వచ్చిన బానిసలనూ, సైనికులను తమ బౌద్ధ ఆరామాలలో చేర్చుకొని పశు హింసకు, బ్రాహ్మణ ఆధిపత్యానికీ వ్యతిరేకంగా పెద్ద ఎత్తున ప్రచారం ప్రారంభించి నాటి సమాజములో విప్లవ పాత్ర నిర్వహించారు. వ్యవసాయ విస్తరణ సమయములో నూతన గ్రామాలు రూపొందుతున్న పరిస్థితులలో బ్రహ్మణ్యం తీవ్రమైన మార్పులకు గురికావలసి వచ్చింది. గౌతమ బుద్ధుడు రాజు అజాత శత్రువునితో కలిసి చర్చ సాగించిన తరువాత పారిపోయి వచ్చిన సైనికులూ, స్త్రీలు తమ బౌద్ధ ఆరామాలలో చేరరాదన్నారు. ఆయన సమాజములో బ్రాహ్మణులకంటే క్షత్రియులదే ఆధిక్యత అని ప్రబోధిస్తూనే బౌద్ధ ఆరామాలలో మాత్రం కులవ్యత్యాసాలు పనికిరావని నిషేధించారు. అందువల్ల బౌద్ధసాహిత్యములో కుల వ్యక్షములో ముందున్న బ్రాహ్మణుని రెండవ స్థానానికి నెట్టి క్షత్రియులను అగ్రస్థానములో నిలబెట్టింది.

## ఫ్యూడల్ కుల వ్యవస్థ వికృతరూపం

కుల ధర్మాన్నీ, కుల వ్యవస్థనూ కాపాడటము రాజధర్మమని బ్రాహ్మణ్యమే ప్రబోధించింది. మహాభారతము యీ రాజధర్మముతోపాటు బ్రాహ్మణ-క్షత్రియ ఐక్యత యొక్క అవసరాన్ని ప్రబోధించింది. కౌటిల్యుడు, మనువు మొదలగు బ్రాహ్మణ శాస్త్రవేత్తలు గ్రామాలలో పాటించవలసిన నియమాలను పెద్ద ఎత్తున ప్రచారంలో పెట్టారు. చాణుక్యుడు రూపొందించిన అర్థశాస్త్రం ఏ కులంవారు గ్రామంలో ఎక్కడుండాలో నిర్ధారించింది. పాషండులు స్మశానాల వద్ద వుండాలని తేల్చింది. అగ్రకులాల వారి కందించే పుప్పు. తదితర వస్తువులపై పన్నులుండరాదని శాసించింది. శూద్రులు, స్త్రీలు వేదము వింటే సీసం కరిగించి వారి చెవులలో పోయాలని మనుధర్మశాస్త్రం నిర్దేశించింది. బ్రాహ్మణులు నేరాలు చేసినప్పటికీ వారిని శిక్షింపరాదనీ, సామాన్య నేరాలు చేసిన శూద్రుల చేతులు నరకటం, ముక్కు, చెవులు కొయ్యటం, బండకొయ్య వెయ్యటం సాధారణమైన శిక్షలుగా ధర్మ శాస్త్రాలు ప్రబోధించాయి. గ్రామ గ్రామాన యీ ధర్మశాస్త్రాలకు గనియైన పురోహితుడు న్యాయ విచారణకు అధ్యక్షుడు. సమాజములో ఫ్యూడల్ వర్గాలకొక న్యాయం; శూద్రులు, మ్లేచ్ఛులు, పంచములకు మరియొక న్యాయం. కులానికొక న్యాయం. ఈ శిక్షాస్మృతులే నాటి సమాజములో పీడిత ప్రజల అసంతృప్తి ఎంత వున్నత స్థాయిలో వున్నదో చెప్పకనే చెప్పుతున్నాయి. ఎంత హింసను ప్రయోగించినా వర్ణ సంకరము ఆగలేదని వారే వ్యక్తం చేశారు. హింస ద్వారా కూడా తమలో యిమడని జాతులను మ్లేచ్ఛులన్నారు. తమ ఆరోగ్యమును కూడా లెక్కచేయకుండా శవదహనం, స్మశానాలను శుభ్రపరుచుట మొదలగు మంచి పనులను చేసే వారిని పంచములన్నారు. ఫ్యూడల్ వర్గాలకు మహారాష్ట్రలో వారి నీడ సోకరాదనీ, తమిళనాడులో వారు చూడరానివారనీ, దేశంలో వీరు అంటరానివారని పంచములకు వ్యతిరేకంగా ప్రబోధాలు చేశారు. దేవుడైన రాముడే శూద్రుడైన శంభుకుడు తపస్సు చేసినందుకు వానిని వధించినట్లు రామాయణము పెద్ద ఎత్తున ప్రచారంలో పెట్టింది. కుల వ్యవస్థను తామే సృష్టించి నట్లు కృష్ణ భగవానుడు చాటినట్లు భగవద్గీత ప్రబోధిస్తుంది. కుల వ్యవస్థను కాపాడటమే హిందూ ధర్మమైంది.

దేశమును పీడికి దండెత్తి అధికారాన్ని చేబట్టిన మహమ్మదీయులు తమ మహమ్మదీయ మతాన్నీ, వ్యాపారానికై వచ్చి అధికారాన్ని చేపట్టిన బ్రిటిష్ పాలకులు తమ క్రైస్తవ మతాన్నీ దేశములో ప్రచారములో పెట్టారు. కొన్ని ఆశలు కొలిపి వీరు శూద్రులను, పంచములను తమ మతాలలో చేర్చుకొన్నప్పటికీ కుల వ్యవస్థవల్ల వీరికి సంక్రమించిన అసమానత అంతంకాలేదు. క్రైస్తవ మతములో చేరిన మాల మాదిగలకు హిందూమతములోనే వున్న మాల, మాదిగలకు అంటరానితనములో అంత తేడా లేదు. దేశములో ప్రబలిన తాత్విక వివాదాల ఫలితంగా హిందూ మతప్రవక్తలు కొందరు కుల వ్యత్యాసాలను తిరస్కరించినప్పటికీ వీటిని కాపాడిన రాముడు, కృష్ణభగవానులను పూజించుటకు వెనుకాడరు. కుల వ్యత్యాసాలు పనికిరావని ప్రచారం చేసిన గాంధీగారు కుల వ్యవస్థ వుండవలసిందేనంటారు. దేశములో పారిశ్రామికీకరణ, పట్టణ నాగరికతల ఫలితంగా పట్టణాలలో కులవ్యవస్థ ప్రభావము కొంత తగ్గినప్పటికీ విస్తారమైన గ్రామీణ ప్రాంతములో దీని పట్టు సడలలేదు. సిద్ధాంతపరంగా కుల వ్యత్యాసాలకు శత్రువులైన వీరు కూడా తమ స్వగ్రామాలలో తమ యిళ్ళలో ఆచరణలో వాటిని పూర్తిగా అధిగమించలేకుండా వున్నారు.

## నూతన ఉత్పత్తి శక్తులు

మహమ్మదీయ సైనిక, సాంస్కృతిక, పాలనా అవసరాలు యాత్రా స్థలాలూ, మసీదులూ పెరగటము వల్ల వస్తు మార్పిడి స్వయం పోషకత్వము మీద ఆధార పడ్డ సహజోత్పత్తిలో మార్పులు ప్రారంభమైనాయి. వస్తు మార్పిడి కేంద్రాలూ, సంతలూ, వుండీలు పెద్ద పెద్ద వ్యాపార కేంద్రాలుగా, మార్కెట్లుగానూ, గృహపరిశ్రమలు, పట్టణ కేంద్రాలలో విస్తృత పరిశ్రమలూ, ఖార్ఖానాలుగానూ అభివృద్ధిగావటము ప్రారంభ మయింది. పట్టణ కేంద్రాలు, నూతన వుత్పత్తి శక్తులు, వర్గాలూ అవతరించటము పట్టణాలు అభివృద్ధి గావటమేగాక వివిధ మతాల మధ్య ఐక్యత కొరకూ కుల వ్యత్యాసాలూ, అంటరానితనానికీ వ్యతిరేకంగా వుద్యమాలు, సాహిత్య ప్రబోధాలు ముందుకొచ్చాయి. ఇందులో 14వ శతాబ్దములో ప్రారంభమైన భక్తివుద్యమము ముఖ్యమైంది. ఇందులో వృత్తిదారులదే ప్రధానపాత్ర. కబీర్, నాయక్, రవిదాస్ మొదలైన వారంతా వృత్తిదారులుగా వుంటూనే యీ గొప్ప ప్రబోధాలు సాగించారు. ఆంధ్రలో సిద్దయ్య, పోతులూరి వీరబ్రహ్మం యీ కోవకు చెందినవారే. ఆంధ్రలో వేమన, కర్నాటకలో సర్వజ్ఞ సాంఘిక ఆర్థిక అసమానతలకు వ్యతి రేకంగా గొప్ప రచనలు సాగించారు. అప్పటికే గ్రామాలలో పెత్తందార్లు "దొడ్డవారమంచు దారి డొంకలు దున్ని" దురాక్రమణ చేస్తున్నట్లు వేమన చాటారు. వీరు సృష్టించిన ఫ్యూడల్ వ్యతిరేక సంస్కృతి చాలా గొప్పది.

## ఉద్యమాలు – సంస్థలు

బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రభుత్వం భారతదేశములో ప్రజాపోరాటాలనూ, అసంతృప్తిని ప్రక్కమార్గాన పట్టించుటకు ఇంగ్లీషు చదివిన మేధావులను సంస్కరణోద్యమాలూ, అభివృద్ధి నిరోధక వుద్యమాలూ, సంస్థలవైపు మళ్ళించుటకు తమ ప్రయత్నాలను తీవ్రతరం చేసింది. రాజారామ్ మనోహర్ రాయ్, వీరేశలింగం పంతులు మొదలగువారు సతీసహగ మనము, బాల్య వివాహాలకు వ్యతిరేకంగా ప్రచారాన్ని ప్రారంభించారు. డరోజియా మొదలగు అభివృద్ధి కాముకుల ప్రోత్సాహముతో బెంగాల్‌లో కుల మత వ్యత్యాసాలకు వ్యతిరేకంగా రైతాంగాన్ని సమీకరించి జమీందారీ వ్యతిరేక పోరాటాలు సాగించారు. ప్రభుత్వ అధికారుల ప్రోత్సాహముతో 1885న కాంగ్రెస్ సంస్థ ఏర్పడి భారతీయులకు ఉద్యోగాలు మొదలగు సంస్కరణలకు కృషి ప్రారంభించింది.

## సత్య శోధిత సంఘం

కమ్యూనిస్టు ప్రచారమువల్ల ప్రభావితులైన మేధావులూ, యువకులూ కార్మిక వర్గమును ఐక్యపరిచే కృషిని సాగిస్తూ 1924లో భారతీయ కమ్యూనిస్టుపార్టీకి రూపమిచ్చారు. ఇదే సమయములో మహారాష్ట్రలో తీవ్ర సాంఘిక అసమానతలకు గురవుతున్న దళిత కౌలుదార్లను స్వయం సంశోధిక సంఘము 30 గ్రామాలలో సమీకరించి భూస్వామ్య వ్యతిరేక పోరాటాన్ని బొంబాయిలో దళిత కార్మికుల సమీకరణను ప్రారంభించిన సమయములో కమ్యూనిస్టు నాయకులు దీన్ని కుల వుద్యమముగా యీసడించారు. దళిత కార్యకర్తలు, యితర కౌలుదార్లు, కార్మికులతో ఐక్యతను తిరస్కరించినప్పుడు యిది దోపిడీ వర్గాలను అంతం చేయుటకు దోహదకరము కాదని విమర్శించటము వేరు. దోపిడీ వర్గాలకు వ్యతిరేకంగా వారు పోరాటాన్ని సాగిస్తున్నప్పుడు శత్రుపూరిత విమర్శకు పూనుకోవటం పెద్ద పొరపాటనే చెప్పాలి. కాంగ్రెస్ తీవ్ర చర్చల అనంతరం 1930లో సంపూర్ణ స్వతంత్ర సాధనను ధ్యేయంగా ప్రకటించింది. గాంధీగారు ఉప్పు సత్యాగ్రహాన్ని ప్రారంభించారు.

## స్వతంత్ర పోరాటంలో చొరవ

సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా ఫాసిస్టులు యుద్ధానికి దిగటంతో 1941 నుండి కమ్యూనిస్టుపార్టీ యెక్కడో సాగుతున్న యుద్ధానికి మన దేశములో సామ్రాజ్య వాద వ్యతిరేక పోరాటము యెడ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వము తమ వైఖరిని మార్చింది.

అప్పటిదాకా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని ప్రారంభించుటలో వెనుకాడుతున్న కాంగ్రెస్ పార్టీ నాయకులు 1942 ఆగస్టులో క్విట్ ఇండియా ఉద్యమాన్ని ప్రారంభించారు. వీరిని ప్రభుత్వము జైళ్లకు పంపటంతో దేశ వ్యాపితంగా ప్రజానీకం ప్రభుత్వ వ్యతిరేక పోరాటానికి దిగింది. పార్టీలో క్విట్ ఇండియా ఉద్యమాన్ని వ్యతిరేకించటం సరిగాదనే వాదనను త్రోసిపుచ్చి పార్టీ నాయకత్వం యీ వైఖరిని తీసుకోవటంవల్ల పార్టీ స్వాతంత్ర్య ఉద్యమంలో చొరవను కోల్పోయింది. సామ్రాజ్యవాద వ్యతిరేక పంథాకై పార్టీలో సాగుతున్న పోరాట ఫలితంగా పార్టీ నాయకత్వం జాతీయ కాంగ్రెస్ విడుదలకై దేశ వ్యాపిత ప్రచారాన్ని 1946లో అజాద్ హింద్ ఫౌజ్ విడుదల, బొంబాయి నావికా తిరుగుబాటుకు అండగా పెద్ద ఎత్తున కార్మిక సమ్మెలు ప్రజా ప్రదర్శనలను సాగించటముతో కొంత పుంజుకున్నప్పటికీ వెనుకటి పరిస్థితి రాలేదు. హిందూ మహమ్మదీయ కలహాలు వికట రూపం తీసుకొంటూ వుండగా, కాంగ్రెస్, ముస్లిం లీగ్ నాయకులు బ్రిటిష్ సామ్రాజ్యవాదు రాజీపడి 1947 ఆగస్టు 15న అధికారాన్ని చేబట్టి దేశాన్ని విభజించారు. కాంగ్రెస్ పార్టీ సామ్రాజ్యవాద దోపిడీ కొనసాగించుటకు ఆమోదించటమేగాక సంస్థానాధిపతులూ, జమీందారులతో నేస్తం సాగిస్తూ రాజ్యాంగ నిర్మాణమంటూ గ్రామ ప్రాంతములో భూస్వాముల కండగా నిలవటం, అధికార, అనధికార అవినీతికీ, అధికార దుర్వినియోగానికీ అవకాశాన్నివ్వటంతో పీడిత ప్రజలలో అసంతృప్తి పెరిగింది.

## ఫ్యూడల్ వ్యతిరేక ఉద్యమం

ఇట్టి సమయములో కమ్యూనిస్టుపార్టీ కార్యకర్తలు తెలంగాణా నైజాం నవాబుకు వ్యతిరేకంగా "దున్నేవానికి భూమి";

గ్రామాల విముక్తికి పెద్ద ఎత్తున ఉద్యమాన్ని ప్రారంభించి రైతాంగాన్ని సాయుధం చేసి 3 వేల గ్రామాలలో పార్టీ నాయకత్వాన 10 లక్షల ఎకరాల భూమిని గ్రామీణ పేదలకు పంచారు. ఈ పోరాటము దేశములో పెద్దగా దేశవ్యాపితంగా గ్రామీణ ప్రాంతములో భూస్వామ్య వ్యతిరేక శక్తులను ఆకర్షించటమేకాక కాంగ్రెస్ ప్రభుత్వము ఢోంగచాటు కొన్ని సౌలభ్యాలు కలిగించి సంస్థానాలను, జమీందారులను రద్దు చేయకతప్పలేదు. భూసంస్కరణలను నామమాత్రంగా ఆమోదించకతప్పలేదు దేశంలో తెలంగాణా తరహా పోరాట విస్తృతిని తిరస్కరించిన కమ్యూనిస్టుపార్టీ నాయకత్వ తొలగింపు, ఆ తరువాత యీ ఉద్యమ క్రమములో తలెత్తిన వ్యక్తిగత హింసావాద ధోరణిని అధిగమించి అంతర్జాతీయ సహాయముతో మొట్టమొదటిసారి పార్టీ కార్యక్రమమునూ, విప్లవ పంథానూ రూపొందించుకొని పునర్నిర్మాణము కావటమువల్ల దేశంలో 1952 మొదటి సార్వత్రిక ఎన్నికలలో మరల ముఖ్యమైన శక్తిగా కాంగ్రెస్‌కు ప్రధాన ప్రతిపక్షంగా ముందుకొచ్చింది.

కమ్యూనిస్టుపార్టీ విధాన లోపాలేమైనా గ్రామీణ ప్రాంతములో భూస్వామ్య శక్తులకు వ్యతిరేకంగా నికరమైన వెఖరి తీసుకొని ఒక శక్తిగా నిలచినప్పుడు పేదలు భూస్వామ్య వ్యతిరేక పోరాటాలలో, ఎన్నికలలో పెద్ద ఎత్తున పార్టీకి అండగా నిలిచారు. భూస్వాముల పార్టీలతో ఐక్యత అనేది వర్గ చైతన్యముగల గ్రామీణ పేదలకు రుచించకపోవటమేగాక ఆయా గ్రామాలలో భూస్వాములూ, వాళ్ల కుల రాజకీయాలకు వ్యతిరేకంగా నిలవటమెట్లా అనేది వారికి సమస్య అయింది. స్వార్థ ప్రయోజనాల రీత్యా కాంగ్రెస్ పార్టీ దానికి ప్రతిగా దాని నుండి చీలిన భూస్వాముల పార్టీయే ప్రతిపక్షమైంది. ఈ నాయకత్వ చీలికలు కులానికి కూడా కొంత ముడిపడి వున్నాయి. అందువల్ల గ్రామంలో ప్రధానంగా భూస్వాములు ఒక పార్టీలో వుంటే దానికి ప్రత్యామ్నాయంగా వుండే మరియొక భూస్వామ్య పార్టీని బలపరుస్తున్నారు.

1955 ఎన్నికల తరువాత కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం భూస్వాముల పార్టీలతో నేస్తానికి దిగటంవల్ల బలహీనపడటమేగాక, స్టాలిన్ మరణానంతరం సోవియట్ పార్టీ నాయకత్వం చేబట్టిన శాంతి, సోషలిస్టేతర దేశాలలో శాంతియుత విప్లవం అనేదాన్ని సమర్థించటంవల్ల, ఆ తరువాత తలెత్తిన వ్యక్తిగత హింసావాదమువల్ల ఏర్పడ్డ చీలికల ఫలితంగా ప్రజాస్వామిక విప్లవ శక్తులు బలహీనపడ్డాయి. ఈ పరిస్థితి పీడిత ప్రజలను రాజకీయ ఆలోచనల నుండి ప్రక్కదోవ పట్టించి భూస్వామ్య శక్తులు, వాటి పార్టీలూ, కుల, మత అల్ప వివాదాలలోకి లాగి కాలక్షేపము చేస్తున్నాయి. కమ్యూనిస్టు ఉద్యమము బలహీనపడటం గ్రామీణ ప్రజలపై కుల వ్యవస్థ యొక్క భూస్వామ్య వర్గముయొక్క పట్టు పెరగటానికి మార్గమైంది.

## సాంఘిక అంశంపై సిద్ధాంత వివాదాలు

1955 ఎన్నికలకు ముందే కమ్యూనిస్టు పార్టీ నాయకత్వానికీ డాక్టరు అంబేద్కరుగారికీ మధ్య సమాజ పరిణామములో సాంఘిక అంశంపై వివాదాలు ప్రారంభమైనాయి.

మార్క్సిజం సృష్ట్యా చరిత్రలో నిర్ణయాత్మకమైనది ఆర్థిక అంశం మాత్రమేననే అపోహ భారత కమ్యూనిస్టు ఉద్యమాన్ని నేటికీ వెంటాడుతూంది. అంతర్జాతీయ వుద్యమంపై దీని ప్రభావాన్ని గుర్తించిన మార్క్సిస్టు మహోపాధ్యాయుడు ఫ్రెడరిక్ ఎంగెల్స్ 1890 సెప్టెంబరు క్యోనిగ్స్ బెర్గ్ పట్టణములోని జె. బ్లోహ అనే ప్రముఖునికి సవివరమైన లేఖను వ్రాశారు. దానిలో యిలా చెప్పారు.

"చారిత్రక భౌతికవాద దృక్పథము ప్రకారము, వాస్తవ జీవితానికి సంబంధించిన ఉత్పత్తి, పునరుత్పత్తులే చరిత్రలో అంతిమ నిర్ణయాత్మకమైన అంశం. ఇంతకు మించి మార్క్సుగానీ, నేనుగానీ ఏనాడూ చెప్పియుండలేదు. అందుచేత ఎవ్వరైనా ఆర్థిక అంశం మాత్రమే నిర్ణయాత్మకమైనదని చెప్పి దీన్ని వక్రీకరించినట్లయితే, అతను ఆ సూత్రీకరణను అర్థ రహితమైనదిగా, అనిర్దిష్టమైనదిగా, పసలేని సంబంధంగా మార్చివేస్తున్నాడన్న మాట".

ఈ లేఖను భారత కమ్యూనిస్టులు నేటికీ తీవ్రంగా అధ్యయనం చెయ్యటం అవసరం. ఆర్థిక అంశమొక్కటే చారిత్రక పరిణామాన్ని నిర్ధారిస్తుందనే వక్రీకరణ ఎంత అసంబద్ధమైందో ఎంగెల్స్ మహాశయుడు యీ లేఖలో సవివరంగా స్పష్టం చేసినప్పటికీ భారత కమ్యూనిస్టు ఉద్యమం దానికి లోనుగాకుండా వుండలేకపోయింది.

ఈ వక్రీకరణకు ప్రతిగా డాక్టరు అంబేద్కర్‌గారు మరియొక వాదనను లేవదీశారు. వారు న్యాయశాస్త్రంలో గొప్ప మేధావిగా బ్రిటిష్ ప్రభుత్వ హయాములో, నెహ్రూ ప్రభుత్వ హయాములో కేంద్ర మంత్రిగా వుంటూ దళితుల హక్కుల కొరకు పట్టుదలతో కృషి చేశారు. కుల వ్యత్యాసాలు పోవాలి, కుల వ్యవస్థ వుండాలనే గాంధీగారి అసంబద్ధ వాదనను తీవ్రంగా విమర్శించారు. వారే సాంఘిక విప్లవం జరగందే ఆర్థిక విప్లవం అసాధ్యమని, సాంఘిక ఆర్థిక ఉద్యమాల సమన్వయానికి బదులు వాటి మధ్య పోటీ పెట్టారు. అంతేగాక "కారల్ మార్క్సు గౌతమబుద్ధునికంటే చాలా వెనుకబడియున్నారు" అనే వరకు వెళ్లారు. (*ధర్మదీక్ష పేజీ 46*).

1955 ఎన్నికల వరకు పార్టీ శ్రేణులకు పీడిత ప్రజలతో వున్న సాన్నిహిత్య సంబంధమువల్ల యీ వివాదాల ప్రభావము నేడున్నంతగా కనిపించలేదు. కమ్యూనిస్టు ఉద్యమములో అంతర్గత సిద్ధాంత వివాదాలను అధిగమించటం అవసరం. కమ్యూనిస్టు ఉద్యమములో నాయకత్వ బాధ్యతను నిర్వహించిన కామ్రేడ్ సత్యమూర్తిగారు మరియొక వాదనను లేవదీశారు. కమ్యూనిస్టుపార్టీ కమిటీలలో దళితులు మాత్రమే వుండాలనేది యీ వాదన. ఇప్పుడు కొత్తగా యీ వాదనను ఎందుకు లేవదీస్తున్నారో వారే చెప్పాలి. కమ్యూనిస్టుపార్టీ కార్మిక వర్గ పార్టీ. ఈ పార్టీకి మేధావులు అవసరమే. ఈ అవసరాన్నిబట్టి కార్మికవర్గ పార్టీ తాము ప్రబోధించినట్లు నడవాలని కొందరు మేధావులు లేవనెత్తిన వాదనకు వ్యతిరేకంగా మార్క్సు ఎంగెల్స్

మహాశయులు 1878లో లేఖ రూపములో ఒక సర్క్యులర్‌ను విడుదల చేశారు. కార్మికవర్గ పార్టీకి మేధావుల అవసరమున్నమాట నిజమేననీ, వారు పార్టీలో చేరేటప్పుడు తమ వర్గ ఆలోచనలకు స్వస్తి చెప్పాలనీ యీ సర్క్యులర్‌లో స్పష్టం చేశారు. ఈ అన్యవర్గ ధోరణులను అధిగమించుటకే లెనిన్ మహాశయుడు ఆత్మ విమర్శను ప్రబోధించారు. దళితులైనా మరియొకరైనా కార్మిక వర్గేతరులు పార్టీలో చేరేటప్పుడు తమ బూర్జువా, పెట్టీ బూర్జువా స్వభావాన్ని వెంటతేవచ్చా? దళితుల యొక్క మార్క్సిస్టు సిద్ధాంత అవగాహనను పెంచకుండా వారిని మాత్రమే పార్టీ కమిటీలలో చేర్చినంత మాత్రాన పరిస్థితి సరవుతుందా? దళితుల కమిటీగా ముందుకొచ్చిన రిపబ్లికన్ పార్టీ పరిస్థితి ఏమైంది? ఈ విషయాలను వారు పరిశీలించాలి.

కమ్యూనిస్టు ఉద్యమములో తలెత్తిన సిద్ధాంత వివాదాలతో పాటు యీ వివాదాలకు మార్క్సిస్టు దృక్పథంలో సరైన పరిష్కారాన్ని కనుగొని సమైక్యతను సాధించామంటే దేశంలో కులం పట్టును అధిగమించి నూతన ప్రజాతంత్ర విప్లవాన్ని విజయవంతం చేయగల్గుతాం.

## రిఫరెన్స్ బుక్స్

1) మార్క్స్ చెప్పినవి - మార్క్స్ - ఎంగెల్స్ సంకలిత రచనలు ఇంగ్లీషు మూడు వాల్యూల ఎడిషన్‌లో నుండి.

2) ఋగ్వేదములోనివి- ఆంధ్ర వేదములు (ఋగ్వేదము) అనువాదకులు : బొంకుమల్లి మల్లయ్య శాస్త్రి వినయాశ్రమం వారిచే 1940లో ప్రచురించబడింది.

3) అంబేద్కర్ చెప్పినవి - అంబేద్కర్ ప్రసంగాలు. బుద్ధుడు - కారల్‌మార్క్స్. ధర్మదీక్ష డాక్టర్ అంబేద్కర్ మెమోరియల్ సొసైటీ వారిచే ప్రచురణ.

"స్థానిక గోత్ర-వర్గ సమాజాలకు చెందిన వారికి వ్యతిరేకంగా యుద్ధాలుచేసి, వారిపై ఆధిక్యత సాధించిన ఆర్యులు తమ పనులను సమర్థవంతంగా చేసుకోవడానికి, చిన్న పరిణామంలోనైనా ఒకరకమైన 'పని విభజన' ఆదిలోనే చేసుకోవలసివచ్చింది. ఆయుధాలను ఉపయోగించి యుద్ధాలు చేసేవారు, యుద్ధాలలో విజయానికి సహాయపడే విధంగా ఆరాధనలు, కర్మకాండలు చేసేవారు అనేదే యీ పని విభజన. వీరిలో మొదటివారు క్షత్రియులుగాను, రెండవవారు బ్రాహ్మణులుగాను, మారారు. వీరిద్దరూ కాని మరో శాఖకు చెందినవారు 'విశ్' అని పిలువబడ్డారు. వీరే పిదప 'వైశ్య' అయ్యారు. ఈ మూడు శాఖలకు చెందినవారి అక్రమాలకు గురై అణచబడినవారు దాసులు-శూద్రులైనారు. వీరిలో మొదటి మూడు వర్గాలవారు పాలకులు, నాల్గవవారు పాలితులు. ఇదే భారతదేశంలో వర్గ (వర్ణ) భేదంయొక్క ప్రథమ రూపం."

(నంబూద్రిపాద్ "వేదభూమి" నుండి)

# సదస్సులో జరిగిన చర్చ

"భారతదేశంలో కుల వ్యవస్థ" సదస్సు చివర జరిగిన చర్చలో దిగువవారు పాల్గొన్నారు. చర్చను శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావుగారు ముగించారు.

## కులవ్యవస్థ కోరలు పీకి వేయాలి!

కాలేజీ మాజీ అధ్యాపకులు శ్రీ అట్లూరి పురుషోత్తంగారు చర్చలో పాల్గొంటూ యిలా అన్నారు :

కులతత్వం ఇంకా బతికే వుంది. చచ్చిపోతుందని మా చిన్నప్పుడు అనుకున్నాం. 50 ఏళ్లనుండి చావలేదు. ఇది ఇప్పుడు మనిషిని మనిషిని విడదీసే రాక్షసిగా వుంది. విశ్వవిద్యాలయాల్లో కురుక్షేత్రాలను సృష్టించుతూ వుంది. ఉపాధ్యాయులను, ఆచార్యులను వైరి వర్గాలుగా విడదీసి వుంచింది. ప్రేమ వివాహాలకు అడ్డుపడుతుంది. రాజకీయ పక్షాలను సైతం కులం-కుల ప్రాతిపదికగా ముక్కలు చేస్తూ వుంది. గ్రామాల్లో, పేటల్లో, పట్టణాలలో ప్రజలను ప్రశాంతంగా జీవించనివ్వటంలేదు. ఇదొక దెయ్యంలాగ అందరినీ పీడిస్తోంది. దీని ఫలితంగా కొన్ని చోట్ల రౌడీలు రాజ్యం చేస్తుంటే వాళ్లను తట్టుకోలేని కుటుంబాలు, తమ తమ బంధువుల కుటుంబాలు ఎక్కడ వున్నవా? అని వెతుక్కుంటూ గ్రామాలకు, పేటలకు పోతున్నారు. ఆ విధంగా మన విజయవాడలోనే కొన్ని ప్రాంతాలలో కొన్ని కులాలవారు ఇళ్లు అమ్ముకొని మరోచోటకి వెళ్లిపోవలసిన దుస్థితి వచ్చింది. ప్రపంచంలో దేశాలకు దేశాలకు మధ్య యుద్ధాలు ఆపడానికి శాంతి ఉద్యమం అయితే వచ్చింది గాని విజయవాడలో కులతత్వం నుండి జనాన్ని రక్షించడానికి ఇంకా ఏ శాంతి ఉద్యమం గట్టిగా ప్రారంభం కాలేదు. అయితే ఈ కులం ఎందుకు బ్రతికి వుందంటే ఇది పాలకులను, ప్రజలను విడదీసి వుంచడానికి ఒక ఆయుధంగా వుంది.సాంఘిక సంస్కర్తలకు అడ్డుపడే శిఖండిలాగ వుంది. అసమర్థులను అందలం ఎక్కించడానికి పనికి వచ్చే నిచ్చెనలాగ వుంది. కట్న పిశాచానికి శక్తినిచ్చే టానిక్‌లాగ బ్రతికి వుంది. దుర్మార్గులకు రౌడీలకు కవచంలాగా వుంది.

అయితే దీన్ని నిర్మూలించడం ఈవేళ పూర్తిగా సాధ్యం కాకపోయినా, పాముకి కోరలు పీకి బుట్టలో పెట్టినట్టు, దీని కోరలు పీకి బుట్టలో పెట్టి ప్రమాదం లేకుండా వుంచడం సుసాధ్యం. మార్గాలు ఏమిటి? ఉపాధ్యాయుడిగా నాకు తోచిన మార్గం ఏమంటే అశాస్త్రీయ దృక్పథాన్ని పెంచి పోషించే పాఠశాలలను మనం నిరుత్సాహపరచాలి. ఎన్నోసదస్సులు జరిపి, అరవై యేళ్లు డెబ్బైయేళ్లు వచ్చిన వాళ్ళని ప్రోత్సహిస్తే ప్రయోజనం లేదు. ఇక్కడ వున్న సభికులలో నూటికి తొంభై మంది 40 యేళ్లు దాటినవారు. కాని కులాన్ని రక్షించేది వివాహ వ్యవస్థ, పెళ్లిళ్లు చేసుకొనేవారు. 18-25 యేళ్ల మధ్య వాళ్లు, పిల్లలు వాళ్ళను పాడుచేస్తున్నవి పాఠశాలలు. పాఠశాలల్లో సంగతి ఎవరూ పట్టించుకోవడంలేదు.

లౌకికమైన, శాస్త్రీయమైన దృక్పథంతో చదువు చెప్పే పాఠశాలలను ప్రోత్సహించాలి. మనది లౌకిక రాజ్యాంగమే కాని లౌకిక విద్యా విధానం వున్నట్టు నాకెక్కడా కనబడటం లేదు. శాస్త్రీయ దృక్పథంతో విద్యా విధానం కొనసాగడంలేదు.

పాఠ్య గ్రంథాలను భూతద్దాలతో పరిశీలించి వాటిల్లో వున్న అశాస్త్రీయమైన చెత్తను తొలగించాలి. లేకపోతే పిల్లలకు ఈ అశాస్త్రీయమైన ధోరణులనుండి విముక్తి రాదు.

ఒక చిన్న ఉదాహరణ చూడండి. ఈ మధ్య ప్రధాన మంత్రిగారి ప్రక్కన బాబాగారు అతి ఉన్నతమైన ఆసనంమీద కూచున్నారు. ప్రక్కన ప్రధానిగారు తక్కువ ఎత్తుగల ఆసనంమీద కూచుని వున్నారు. ఫొటోలు పత్రికలలో పడ్డాయి. ప్రజలకు, పిల్లలకు ఎటువంటి అభిప్రాయాలు కలుగుతాయి ?

మన రాష్ట్రపతి శర్మగారు, ఎన్నిక అవడంతో తిరుపతి వచ్చి గుండు చేయించుకొని సాష్టాంగపడ్డారు. ఫొటోలు పేపర్లో పడ్డాయి. పిల్లలకు ఎటువంటి అభిప్రాయాలు కల్గుతాయి. ఆ పిల్లలే పెద్దయి పెళ్ళిళ్ళు చేసుకొనేది. వాళ్ళకు ఎటువంటి చదువు వస్తుంది? ఈ వేళ పాఠశాల ఒక్కటే చదువు చెప్పే సంస్థకాదు. ప్రతీ పత్రిక, వార పత్రికలు, మాసపత్రికలు, దినపత్రికలు - ఒక్కొక్క పత్రిక ఒక పాఠశాల. ఈ పత్రికలను పిల్లలు, పెద్దలు అందరూ చదువుతున్నారు. అందువలన రాజకీయ పక్షాలు, రాజకీయ నాయకులు పాఠశాల నిర్వాహకులు అందరూ ఈ సంగతి గుర్తుంచుకోవాలి.

విద్యారంగం నుండి పూర్తిగా ఈ అలౌకిక, అశాస్త్రీయ విధానాలను, దృక్పథాలను తొలగించకపోతే ఈ కుల నిర్మూలనా ఉద్యమం అన్నది తేలికగా అయ్యేదికాదు.

మరొక అంశం చెప్పి ముగిస్తాను. ఇప్పుడు వివాహ వ్యవస్థ కులాన్ని నిలుపుతూ ఉంది. వివాహాలు చేసుకొనేది పిల్లలు. నిర్వహించేది ఏర్పాటు చేసేది పెద్దవారు. మీరు మేము మనమంతా పిల్లలతో పోల్చి చూసుకుంటే సంస్కరణవాదులం లేదా మితవాదులం. పిల్లలు ఎప్పుడూ ఎక్కువ విప్లవకారులుగా ఉంటారు. పెద్దవాళ్లు సనాతనవాదంలో ఉంటారు. యువతీ యువకులు ఈవేళ స్వేచ్ఛగా వివాహం చేసుకొనే అవకాశం లేదు. ఎందుకు లేదంటే వారికి ఈవేళ ఆర్థిక స్వాతంత్ర్యం లేదు. వాళ్లకు ఉద్యోగాలు లేవు. సొంత కాళ్ళమీద నిలబడి బ్రతకలేరు కాబట్టి మనను కాదని వారు పెళ్ళి చేసుకొని ఏమవుతారు? మన ఆర్థిక సహాయం కోసం, మన స్తోమత కోసం మనం చెప్పినట్లే వింటున్నారు. మనం కష్టపడి ఏదో సంపాదించాం. కులాంతర వివాహం చేస్తే వీళ్లు ఏమై పోతారు. ఈ సంఘం మారేనా చచ్చేనా? అనే భయంతో జాగ్రత్తగా కులం నాలుగు గోడల మధ్యే పెళ్లిల్లు చేస్తున్నాం. ఎందుకంటే మనమే చేయవలసిన కర్మ ఏర్పడింది. ఇప్పుడు సుమారు 40 ఏళ్ళ క్రితం సంప్రదాయసిద్ధంగా చేసే పౌరోహిత్యాలు లేకుండా వందలాది పెళ్లిళ్ళు చేసుకున్నారు. కులాంతర వివాహాలు చేసుకున్నారు. కాని ఈవేళ? వాళ్ల వాళ్ళ పిల్లలకి పౌరోహిత్యాలతో, మేళతాళాలతో వేలకు వేలు ఖర్చు పెట్టి పెళ్లిళ్ళు చేస్తున్నారు. కులాల నాలుగు గోడల మధ్యే పెళ్ళిళ్ళు చేస్తున్నారు. దీనికి బోలెడన్ని కారణాలు వచ్చాయి. అతివాద ఉద్యమాలు ముక్కలైపోవడం యిందుకు ఒక కారణం. అతివాద ఉద్యమం ముక్కలైపోయి సమాజానికి చేసిన మహా అపకారం ఏమిటంటే – కుల వ్యవస్థను నిలబెట్టడం! పెళ్లిళ్ల విషయంలో ఏ మాత్రం అభివృద్ధి రాకుండా అడ్డుపడటం. ఇప్పుడు యువతీ యువకులకు ఉద్యోగాలు రావాలి. వాళ్ళకి ఆర్థిక స్వాతంత్ర్యం రావాలి. ఆ విధంగా ఆర్థిక వ్యవస్థ మారితే మనం మార్చగలిగితే అప్పుడు వాళ్లు ముందడుగు వేస్తారు. సమాజాన్ని బాగుచేయవలసింది వాళ్లు, మనం కాదు. రేపటి పౌరులు వాళ్లు. వివాహాలతో ప్రారంభించాలి. వివాహాలను వదిలివేసి – ఏదో చేయాలంటే సాధ్యంకాదు. దీనికి వ్యతిరేకతలు చాలా ఉన్నాయి. మతాధిపతులున్నారు. చెత్త పుస్తకాలను ప్రచురించి డబ్బు చేసుకొనే వారున్నారు. కుటుంబ నియంత్రణ మతానికి వ్యతిరేకం. దేవుడిచ్చిన బిడ్డలను చంపడం అన్యాయం, అధర్మం అని చెప్పేవాళ్లున్నారు. బడా పెట్టుబడిదారు లున్నారు. వారి పత్రికలున్నాయి. ఇటువంటి మార్పులను ఏమీ రాకుండా, సంఘాన్ని యదాతథంగా ఉంచి, మామూలు కబుర్లుచెప్పి సొమ్ము చేసుకొనేవి ఉన్నాయి. ఎందుకంటే ప్రజలకు విజ్ఞానం వస్తే దోపిడీదారులకు ప్రమాదం కాబట్టి సంఘాన్ని బడా పెట్టుబడిదారులు, వారి పత్రికలు మారనివ్వవు. కాబట్టి మనం చేయవలసిన కృషి చాలా వుంది. విద్యారంగంతో ప్రారంభించాలని మనవి చేస్తున్నాను.

* * *

# "కుల ప్రాతిపదిక మీదనే దళిత ఉద్యమం నడుస్తుంది"

శ్రీ రాధాకృష్ణమూర్తి తన అభిప్రాయం చెపుతూ ఇలా అన్నారు :

రెండు ప్రధాన సిద్ధాంతాలు ఇప్పుడు ఉన్నాయి. ఒకటి దళిత ఉద్యమం, రెండవది కమ్యూనిస్టు ఉద్యమం.

దళిత 'ఉద్యమం – నేటి పరిస్థితి గురించి మార్క్సిస్టు మెథడాలజీలో రెండు పద్ధతులున్నాయి. Think in them Selves and think for other Selves – దీన్ని దళిత ఉద్యమానికి కూడా వర్తింప జేయవచ్చు. దీనిని మార్క్సిస్టులు కూడా ఆలోచించాలని కోరుతున్నాను. దళిత ఉద్యమం తన వ్యక్తిత్వాన్ని రూపుదిద్దుకుంటున్న క్రమంలో కొన్ని పొరపాట్లు, కొన్ని అతివాద ధోరణులు, కులతత్వంగా కనబడే ధోరణులు వ్యక్తం కావచ్చు. కార్మికవర్గం కూడా మొదట్లో ఇటువంటి తప్పులు చేయవచ్చునని మార్క్స్ కూడా అంటాడు. అందుచేత దళిత ఉద్యమం యొక్క నిర్మాణాత్మక పాత్ర Positive Contribution ఏమిటో కమ్యూనిస్టులు చూడాలని కోరుతున్నాను. ఇలా చేసినప్పుడు మాత్రమే అటువంటి పెడ ధోరణులు తన వ్యక్తిత్వాన్ని రూపుదిద్దుకొనే సమయంలో సంభవిస్తాయని అవగాహన చేసుకోవడానికి వీలవుతుంది.

దళిత ఉద్యమం ఈ వేళనే ఎందుకింత శక్తివంతంగా ముందుకు వస్తూంది? కొంత మంది దీనిని సాంస్కృతిక పోరాటం అంటున్నారు. మరి కొంత మంది ఆర్థిక, రాజకీయ పోరాటం అంటున్నారు. కులానికి, కులతత్వానికి మధ్య ఉన్న తేడాను చూడాలి. కులం అన్నది ఒక సాంస్కృతిక అంశం. దాంట్లో పెళ్లిళ్లు, అనేక ఆచార వ్యవహారాలు, కట్టుబాట్లు ఉన్నాయి. అయితే ఈవేళ కులతత్వం అనేది తలెత్తింది. అందులో ఆర్థిక, రాజకీయ అంశాలు యిమిడి ఉన్నాయి. డాక్టర్ అంబేద్కర్ అభిప్రాయం కూడా అదేనని నేను అనుకుంటున్నాను.

అంబేద్కర్ చాలా దూరదృష్టితో ఒక మాట అన్నారు. రాబోయే రాజకీయాలను నడిపేదంతా, వయోజన వోటింగు హక్కుకు, వ్యక్తిగత ఆస్తికి మధ్య ఉన్న పోరాటమే. ఇదే రాబోయే చరిత్రలో ప్రధానాంశమన్నాడు. నేడు జరుగుతున్నదదే. నేడు వయోజన ఓటింగు హక్కు అనేది లేకపోతే ఈ "బలగా జనం" దగ్గరకు ఈ అగ్రవర్ణాలవారు పోరు. అందుచే ఇది ఒక రకంగా ఆర్థిక పోరాటమే. ప్రొ. రజనీకొఠారీ – రాజకీయాలలో కులం యొక్క పాత్ర గురించి

బాగా పరిశీలిస్తున్నారు. కులతత్వం తానుగా రూపుదిద్దుకొనే క్రమం ప్రారంభమైనదంటే అది వర్గాలకు అనుకూలంగా మారుతున్నదనే విశాల అవగాహనలో చూడాలి అని ఆయన అంటాడు. కులం - వర్గం అనే ఈ రెండింటి మధ్య ఉమ్మడి అవగాహన ఏమంటే నేను ఇదివరకే చెప్పినట్లే Think in them Selves ఆ తరువాత చారిత్రక అనుభవాలు ఎదురైనప్పుడు Think for other Selves గా మారుతుంది. అలా మారకపోతే దాని అస్థిత్వమే ఉండదు. అలా మారుతూ కమ్యూనిస్టు ఉద్యమానికి మిత్ర స్వభావం కల్గిన ఉద్యమంగా మారుతుంది.

దళిత ఉద్యమానికి ఈవేళ ఉన్న పునాది ఏమిటి? కులం అన్నది ఒక సాంస్కృతిక అంశం అయినప్పటికీ - ఈవేళ జరుగుతున్న పోరాటం యొక్క లక్షణం ఏమిటి? మేము జనాభాలో ఇంత శాతం ఉన్నాం. అందుచేత మాకు ఇన్ని పోస్టులు (ఉద్యో లు) యివ్వాలి. మేము ఇంత శాతం ఉన్నాం - రాజకీయాధికారంలో మాకు యింత భాగస్వామ్యం ఉండాలి! అన్న డిమాండు ప్రధానంగా దళిత ఉద్యమం ముందుకు తెచ్చింది. అంటే సాంస్కృతిక అంశంకంటే - ఆర్థిక, రాజకీయ అంశాలే ప్రధానంగా ముందుకు వచ్చాయి. అందుచేత ఈ ప్రాథమిక లక్షణాన్ని మర్చిపోకూడదు. మా కులం జనాభాలో 4 శాతం ఉంది. అందుచేత శాసనసభ సభ్యులలో 4 శాతం మా కులస్తులుండాలి. అలాగే జనాభాలో శాతంబట్టి ఉద్యోగాలు యివ్వాలి అన్నదే నేడు దళిత ఉద్యమం యొక్క ప్రధాన డిమాండుగా ముందుకు వస్తూంది. పురాతన కాలం నుండి కులం అన్నది వృత్తిపరమైన రక్షణ యిస్తూ వచ్చింది. అందుచేత ఈవేళ కూడా అదేవిధంగా కుల ప్రాతిపదికపై ఉద్యోగాలు అడగడానికి దారితీస్తుంది. అందుచేత కుల ప్రాతిపదికమీదనే నేడు దళిత ఉద్యమం నడుస్తూంది. అంటే కులతత్వం విజృంభించడం తప్పనిసరి. దళిత ఉద్యమం తన వ్యక్తిత్వాన్ని రూపుదిద్దుకొనేటప్పుడు కులం, కులతత్వం అన్నవి అత్యవసరం అయితే ఆ తరువాత పరిణామం వేరు కావచ్చు.

ఈ రాష్ట్రంలో కమ్మవారు రెడ్డి కులస్తులు - "బ్రాహ్మణత్వాన్ని" చేపట్టారు. అయితే జాతీయోద్యమ కాలంలో కమ్మ, రెడ్డి జాతులవారు బ్రాహ్మణుల స్థానాన్ని ఎందుకు ఆక్రమించలేకపోయారు? బ్రాహ్మణ, వైశ్య కులాలవారే జాతీయోద్యమానికి ఎందుకు నాయకత్వం వహించారు? ఈవేళ దళిత ఉద్యమం యింత ముందుకు వచ్చింది. ఆనాడు (జాతీయోద్యమ కాలంలో) దళిత ఉద్యమం ఎందుకు విజృంభించలేదు?

ప్రతీ ఉద్యమానికి చారిత్రక నేపథ్యాలుంటాయి. ఆయా చారిత్రక నేపథ్యాలలో ఆయా ఉద్యమాలు ముందుకు వస్తుంటాయి. ఆ విధంగానే నేడు దళిత ఉద్యమం ముందుకు వచ్చింది."

# కమ్యూనిస్టు ఉద్యమం దళితులను ఎందుకు ఆకర్షించ లేకపోతూంది?

శ్రీ విజయకుమార్ చర్చలో పాల్గొంటూ ఇలా అన్నారు.

**ఇం**దాక సభాధ్యక్షులువారు వారి ప్రసంగంలో 1930లో కమ్యూనిస్టు పార్టీ చేసిన తీర్మానంలో కుల వ్యవస్థను వ్యతిరేకించి పోరాడాలన్న సంగతి చెప్పారు. ఇలా చెప్పి 60 సంవత్సరాలు గడిచిపోయింది. ఈ 60 యేళ్లలో కులవ్యవస్థను ఎంతవరకు నిర్మూలించాం? అందుకు ఎంతవరకు పాటుపడ్డాం? అనే విషయాన్ని కమ్యూనిస్టు కార్యకర్తలు చిత్తశుద్ధితో చెప్పాలి. కమ్యూనిస్టు ఉద్యమం దళితులను ఇప్పుడు ఎందుకు ఆకర్షించలేకపోతూంది? వారు కమ్యూనిస్టు ఉద్యమానికి ఎందుకు సన్నిహితంగా రావటంలేదు!

దళితులలో నేడు ఒక బలమైన అభిప్రాయం ఏర్పడింది. అగ్రవర్ణాలవారు ఏ పార్టీలో నాయకులుగా ఉన్నప్పటికీ వారు దళితుల సమస్యలను తీవ్రంగా పరిగణనలోకి తీసుకోరు, మా కోసం ఏదో నామమాత్రపు సానుభూతి చూపుతారు తప్ప త్రికరణ శుద్ధిగా మా కోసం పని చేయరు అనే భావం వారిలో ప్రజలిపోయి ఉంది. అందుచేత కమ్యూనిస్టు ఉద్యమానికి వారు దూరంగా ఉంటున్నారు. కమ్యూనిస్టు కార్యకర్తలు దళితులలో ఏర్పడిన ఈ నమ్మకాన్ని ఎంత త్వరగా తొలగిస్తే కమ్యూనిస్టు ఉద్యమం అంత త్వరగా బలపడుతుంది.

ఈ విషయం ఆత్మపరిశీలన చేసుకోవడం అవసరం.

# "కులం–వర్గం ఒక్కటే"

పత్రికా రచయిత శ్రీ చంద్రశేఖర్ చర్చలో పాల్గొంటూ సుదీర్ఘంగా మాట్లాడుతూ –

"కులవ్యవస్థ గురించి అంబేద్కర్ చెప్పిన అభిప్రాయాలను ఈ సదస్సు ప్రధానంగా చర్చించాల్సింది. ఇలా చర్చించకపోవడం సదస్సు పెద్ద వైఫల్యం అని ఆయన తన అభిప్రాయం వెలిబుచ్చారు.

అసలు కుల సమస్యను భారతదేశ ఎజెండాలోకి తీసుకువచ్చింది. దళిత ఉద్యమమూ దళిత ఉద్యమ నాయకుడు అంబేద్కరా అనీ, కులవ్యవస్థ భారతదేశంలో ఒక తీవ్ర సమస్యగా ఉన్నదనే విషయం ఎమ్. ఎన్. రాయ్, డాంగే మొదలు ఇప్పటి కమ్యూనిస్టు నాయకుల వరకు సరిగా గుర్తించలేదనీ అన్నారు.

కారల్‌మార్క్స తన "పెట్టుబడి" గ్రంథాన్ని వెలువరించిన సమయానికే మహాత్మా జ్యోతిబాపూలే మహారాష్ట్రంలో శూద్రులకు అంటరానివారికీ విద్య గరపడానికి విద్యాలయాలు తెరిచారనీ, అసలు మహాత్మా పూలే కృషి గురించి కమ్యూనిస్టు ఉద్యమం ఎందుకు పరిగణనలోకి తీసుకోలేదు ? అని ప్రశ్నించారు.

అంబేద్కర్ కులాన్ని– వర్గాన్ని ఒకటిగానే భావించారని అదే సరి అయిన అవగాహన అని శ్రీ చంద్రశేఖర్ అభిప్రాయం వెలిబుచ్చారు. అంబేద్కర్ ప్రధానమైన రచనలు: 1) The Untouchable, 2) Who were Sudras అన్న వాటిని అసలు కమ్యూనిస్టులు అధ్యయనం చేశారా? అని శ్రీ చంద్రశేఖర్ అడిగారు. బ్రాహ్మణులకు, శూద్రులకు మధ్య జరుగుతూ వచ్చిన పోరాటం యొక్క పర్యవసానమే (Off Shoot) అంటరాని తనమని అంబేద్కర్ అన్నారనీ, అందుచేత భారతీయ సమాజం గురించిన విశ్లేషణ అంబేద్కర్ రచనల దృష్ట్యా తిరిగి జరగాలని అన్నారు.

భారత జాతీయోద్యమ సారాంశమంతా అగ్ర కులాల మధ్య నాయకత్వం కోసం, రాజకీయ అధికారం కోసం జరిగిన పోరాటమేనంటూ అంబేద్కర్ వ్యాఖ్యానించారనీ, అప్పుడు (జాతీయోద్యమ కాలంలో) బ్రాహ్మణులకు– వైశ్యులకు మధ్య అధికారం కోసం పోరాటం జరిగితే, స్వాతంత్ర్యానంతరం శూద్రులలో బలమైన వర్గాల మధ్య (రెడ్డి, కమ్మ, కాపు, వెలమ) అధికారం కోసం పోరాటం జరుగుతూందనీ శ్రీ చంద్రశేఖర్అంటూ మొత్తం భారతదేశంలో జరిగిన జరుగుతున్న రాజకీయ ఉద్యమాలన్నింటిని కులాల కుమ్ములాట మాత్రమేనన్నారు. నేడు రాష్ట్రాలలో శూద్ర కులాల చేతికి అధికారం వచ్చిందనీ కేంద్ర ప్రభుత్వం బ్రాహ్మణుల చేతిలోకి పోయిందని అన్నారు. తాను ఒకప్పుడు మార్క్సిస్టుననీ, ఆనాడు నేను నా కులం ఏమిటో చెప్పుకోలేదనీ, ఈనాడు తాను దళిత ఉద్యమాన్ని బలపరుస్తున్నాననీ, బ్రాహ్మణ కులానికి చెందినవాణ్ణని, అందుచేత చెప్పుకుంటున్నాననీ అన్నారు. తాను కమ్మ యువతిని వివాహం చేసుకున్నప్పటికీ, కమ్మవారిని ద్వేషించకుండా వుండలేకపోతున్నాననీ, ఎందుకంటే వారిలో కులతత్వం, కుల విద్వేషం అటువంటి స్థాయికి చేరాయనీ, కమ్మవారు కాపు కులస్తులు పరస్పర ద్వేషంతో నరుక్కునే స్థితిలో నేడు వున్నారనీ అన్నారు. తెలంగాణా సాయుధ పోరాటానికి కమ్యూనిస్టులు నాయకత్వం వహించిన మాట నిజమే అయినప్పటికీ అది భూమి సమస్యపై శూద్రులు జరిపిన పోరాటం మాత్రమేననీ శ్రీ చంద్రశేఖర్ వ్యాఖ్యానించారు.

1932 పూనా ఒడంబడిక మీద అంబేద్కర్ సంతకం పెట్టి ఆ తరువాత అందుకు ఎంతో పశ్చాత్తాపం వెలిబుచ్చాడనీ, అది గాంధీజీకి "టాక్టికల్" విజయమనీ పూనా ఒడంబడికను నిర్వీర్యం చేయాలన్న దృష్టితోనే అంబేద్కర్ హిందూ మతాన్ని విడిచిపెట్టి బౌద్ధ మతంలోకి మారారనీ అన్నారు.

కారంచేడు, చుండూరు ఘటనలకు కారణం– దళిత వర్గాలలో ఒక బలమైన మధ్య తరగతి వర్గం తలెత్తి, తమపై అత్యాచారాలకు ప్రతిఘటించడానికి సన్నద్ధం కావడమేనని శ్రీ చంద్రశేఖర్ అన్నారు.

# చర్చకు శ్రీ ఈడ్పుగంటి సమాధానం

**చర్చలో పాల్గొన్న శ్రీ అట్లూరి పురుషోత్తం, శ్రీ రాధాకృష్ణమూర్తి, శ్రీ విజయకుమార్, శ్రీ చంద్రశేఖరులు లేవదీసిన కొన్ని ముఖ్య ప్రశ్నలకు, వ్యాఖ్యానాలకు శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావు సమర్థవంతంగా సమాధానం యిచ్చారు.**

"హరిజనులనుంచి కమ్యూనిస్టు ఉద్యమం ఎందుకు దూరమైంది? అన్న ప్రశ్నను శ్రీ విజయకుమార్ లేవదీశారు. ఆయన ఈ పరిణామాన్ని ఎంతో బాధతో వ్యక్తం చేశారు. అందుకు ఆ మిత్రునికి అభివందనాలు. ఈ విషయంలో కమ్యూనిస్టు ఉద్యమం ఆత్మ పరిశీలన చేసుకోవలసి వుంది.

కొంతకాలంగా హరిజనులకు కమ్యూనిస్టు ఉద్యమం దూరమైందనేది వాస్తవం.

ఆ తరువాత పత్రికా రచయిత శ్రీ చంద్రశేఖర్ లేవదీసిన ప్రశ్నలకు శ్రీ ఈడ్పుగంటి సమాధానం యిస్తూ అన్నారు.

"శ్రీ చంద్రశేఖర్ అనేక విషయాలను లేవనెత్తారు. అవన్నీ పరిశీలించదగినవే. "కమ్యూనిస్టు ఉద్యమం ఇంకా చాలా పరిశోధన చేయాలి. అధ్యయనం చేయాలి. అంబేద్కర్ రచనలను చదవాలి". అని సూచనలు చేశారు. ఆ సూచనలను సగౌరవంగానే స్వీకరిస్తున్నాం. కాని ఆ మిత్రునికి నేను తెలియజెప్పేదేమంటే- అంబేద్కర్ రచనలను ఈ దేశంలోని మార్క్సిస్టు మేధావులు అధ్యయనం చేశారు. జ్యోతి బాపూలే గ్రంథాలను అధ్యయనం చేశారు. ఈ దేశంలోని సంఘ సంస్కర్తల అభిప్రాయాలను చాలా అధ్యయనం చేశారు. ఆ ఉద్యమాలను కూడా సమీక్షించారు. అది చాలదు అంటే అది వేరే విషయం- ఇంకా జరగాలి అని. అసలు లేదు అంటే- అది చారిత్రక సత్యంకాదు. ఉదాహరణకు మహారాష్ట్రలో ఈవేళ జరుగుతున్న దళిత ఉద్యమాన్ని సమీక్షిస్తూ, అనేక గ్రంథాలను మార్క్సిస్టు మేధావులు, కార్యకర్తలు వ్రాశారు. అవి నా దగ్గర వున్నాయి. మార్క్సిస్టుపార్టీకి చెందినవారు, భారత కమ్యూనిస్టు పార్టీకి చెందినవారు 'స్వతంత్ర మేధావులు కూడా వ్రాశారు. ప్రతీ ఉద్యమాన్ని మొత్తంగా బేరీజు వేస్తున్నారు. వారు తమ శక్తిననుసరించి చేస్తున్నారు. ఏ ఉద్యమంలో సానుకూల అంశాలు వున్నాయి? ఏ ఉద్యమంలో ప్రతికూల అంశా లున్నాయి? ఏ ఉద్యమం ఎందుకు విఫలం చెందింది? ఏ ఉద్యమం ఏ దశలో ముందుకు వెళ్లింది? సందర్భం వచ్చింది గనుక ఒకటి రెండు ఉదాహరణలు.

జ్యోతిబా పూలే మహనీయుడు. గొప్ప సంస్కర్త. ఉద్యమ నాయకుడు జ్యోతిబా పూలే సత్యసంశోధక ఉద్యమం ముందుకు వెళ్లి చాలా ఫలితాలను సాధించింది. ఆయన చనిపోయిన తరువాత ఆ ఉద్యమం ఎవరి చేతుల్లోకి వెళ్లింది? అనేక రంగాల కోసం విప్లవాత్మక ఉద్యమాలను నడిపిన జ్యోతిబా పూలే అనంతరం- అది కొల్హాపూర్ రాజుగారి నాయకత్వంలోకి వెళ్లిందని- ఇటీవల అనేక మంది మార్క్సిస్టు మేధావులు జరిపిన పరిశోధనలలో వెల్లడైంది. ఆ తరువాత అది క్షత్రియ- బ్రాహ్మణ వర్గాలకు మధ్య జరిగిన పోరాటంగా కూడా పరిణమించింది. ఆ తరువాత క్షత్రియ వర్గాలు ఆ ఉద్యమంపై పెత్తనం సాధించాలని, దానికి పూజారిత్వం వహించాలని కొల్హాపూర్ రాజా వాదిస్తున్నట్లు ఈ పరిశోధకులు వెల్లడిస్తున్నారు. 1930నాటికి ఆ ఉద్యమం కాంగ్రెస్‌లో కలిసిపోయినట్లుగా చాలా మంది మార్క్సిస్టు మేధావులు తమ రచనలలో వెల్లడించారు. ఇది మహారాష్ట్ర ప్రాంతానికి సంబంధించిన విషయం. ఇంకా ఎవ్వరైనా వెళ్లదలచుకుంటే యింకా లోతుపాతులలోకి వెళ్లవచ్చు. కాని ఆ ఉద్యమానికి జ్యోతిబా పూలే అనంతరం ఎందుకు పరిమితులు ఏర్పడ్డాయి? అన్నది నేను వేసే ప్రశ్న. గొప్ప ఆశయాలతో నుంచి సదుద్దేశాలతో ప్రారంభించిన ఈ ఉద్యమం ఏమైంది?

తమిళనాడులోని రామస్వామి నాయకర్‌గారి నాయకత్వాన ప్రారంభమైన ఉద్యమం ఎక్కడ నుండి బయలుదేరింది? ఎక్కడకు వచ్చింది? దాని పరిమితులు ఏమిటి? గొప్ప నాయకుడు ఆయన. ఏ ఉద్దేశాలతో తన ఉద్యమం ప్రారంభించాడు? కాంగ్రెస్‌వాదిగా కాంగ్రెస్ వ్యతిరేకిగా, కమ్యూనిస్టు అభిమానిగా, ద్రవిడ మున్నేట్ర ఖజగం నాయకుడిగా, సంఘ సంస్కర్తగా ఆ తరువాత కాంగ్రెస్‌లో విభిన్న గ్రూపుల మధ్య విభిన్న వైఖరులు చూపేవాడుగా చివరకు ఆయన పాత్ర ముగింపు ఎలా జరిగింది? ఎన్నో పరిమితులకు ఆయన నాయకత్వం, ద్రవిడ మున్నేట్ర ఖజగం ఉద్యమం లోనైంది ?

చిట్టచివరి ప్రశ్న అంబేద్కర్‌గారి గురించి. అంబేద్కర్‌గారు గొప్ప మేధావి. చాలా గొప్ప సేవ చేశాడు. Outstanding leader, great leader that India has produced. సందేహంలేదు. అయితే ఆయన అవగాహనలో పరిమితులు లేవా? అంత గొప్ప మేధావిలో కూడా పరిమితులు లేవా? ఆయన చెప్పిందంతా అంగీకారయోగ్యమైతే కమ్యూనిస్టు ఉద్యమం ఆయనతోనే వుండేది. అందుచేత ప్రశ్న అదికాదు. ఆయన గొప్పను ప్రస్తుతిస్తూనే, దాని సానుకూల పాత్రను చూస్తూనే, మార్క్సిస్టు మేధావులు ఆయనలోని పరిమితులను కూడా వెలికి తీస్తున్నారు. ఆయనలోని ప్రతికూల అంశాలను మాత్రమే వారు చూడటంలేదు. ఆయనను నెగిటివ్‌గా మాత్రమే చూడదలిస్తే మహారాష్ట్ర సి.పి.ఐ. కార్యదర్శి ఆయనపై వ్రాసిన పుస్తకం 20,000 కాపీలు ఎలా అమ్ముడుపోతుంది? మహారాష్ట్ర, సి.పి.ఎం. కార్యదర్శి సంజగిరి ఆయనపై వ్రాసిన పుస్తకం కొన్ని వేలు అమ్ముడు పోయింది. బి.టి.రణదివే వ్రాసిన Caste - class-and property relations అనే పుస్తకం చాలా అమ్ముడు పోయింది. ఎ.బి.బర్ధన్ వ్రాసిన పుస్తకం చాలా అమ్ముడు పోయింది. అంబేద్కర్‌ను వీరందరూ ఎక్కడా అగౌరవపరచ లేదు. అంబేద్కర్ రచనలను చదవకుండానే యిదంతా జరిగిందా? అంబేద్కర్ రచనలను మేము చదివాము. బుద్ధిజం గురించి- బుద్ధిజం- మార్క్సిజం గురించి అంబేద్కర్ చేసిన తులనాత్మక పరిశీలనను అధ్యయనం చేశాం. అయితే అందులో మేము అంగీకరించేవి వున్నాయి. అంగీకరించలేనివి వున్నాయి- మార్క్స్ చెప్పినవన్నీ గౌతమ బుద్ధుడు గతంలోనే చెప్పివేసినట్లు అంబేద్కర్ అంటారు. దీనినంతా ఎలా అంగీకరించగలం? గౌతమ బుద్ధుడు సాంఘిక న్యాయం కోసం నిలబడ్డాడు. బ్రాహ్మణ ఆధిపత్యానికి వ్యతిరేకంగా నిలబడ్డాడు. కాని ఆధునిక ప్రపంచం ఆధునిక కార్మికవర్గం ఆలోచనల పరిధిలోనికి ఎలా వస్తాయి? క్రీస్తు పూర్వం 5వ శతాబ్ది కాలం నాటి గౌతమ బుద్ధునిలో ఆధునిక కాలంనాటి కొత్త వర్గాల గురించిన ప్రస్తావన ఎలా వస్తుంది? వాటిమీద కారల్ మార్క్స్ తన సిద్ధాంతాన్ని నిర్మించాడు.

అంబేద్కర్‌గారి నయా బౌద్ధమతం పరిమితులు ఏమిటి? వీటన్నిటిని ఇంకా చదవాలి. ఇంకా అధ్యయనం చేయాలి అనేది వాస్తవం. ఈ సదస్సు లక్ష్యంకూడాఅదే. అనేక కోణాల నుండి సమస్యలను పరిశీలించాలి. చిక్కు ఏమిటంటే కమ్యూనిస్టు ఉద్యమానికిగాని ఇంకే ఉద్యమానికిగాని వచ్చే సమస్య ఏమిటంటే ఒక వాస్తవం (Reality) చాలా మారుతూ వుంటుంది. ఒక సామాజిక వాస్తవికతను గ్రహించడానికి అనుభవం కావాలి. సిద్ధాంత పరిజ్ఞానం కావాలి. అనేక కోణాల నుండి చూడాలి. అలా చేయడంలో ఘర్షణ వస్తుంది. అభిప్రాయ భేదాలు వస్తాయి. సత్యాన్వేషణ చివరకు తేలుతుంది. చాలా సమస్యలు వచ్చాయి. భారతదేశం ఒక జాతి దేశమా? లేక బహుళ జాతుల దేశమా? జాతీయ సమగ్రత అన్న విషయాన్ని ఎలా చూడాలి? కులం ఏమిటి? వర్గం ఏమిటి? మతం ఏమిటి? మతానికి ఉన్న పాత్ర ఏమిటి సమాజంలో? అదే కారల్‌మార్క్స బౌద్ధ మతం తొలి దశలో సామాజిక విప్లవానికి ప్రతిబింబం అన్నాడు. అదే ఏంగిల్స్ ఇస్లాం మతం ఆవిర్భవించినప్పుడు అది సామాజిక విప్లవానికి చిహ్నం అన్నాడు. అదే ఏంగిల్స్ క్రైస్తవ మతం పుట్టినప్పుడు అది సామాజిక విప్లవం అన్నాడు. కాని ఆ బౌద్ధమతం తొలినాటి విధంగా ఆతరువాత లేదు. ఆ క్రైస్తవ మతం ఆ తరువాత అలా లేదు. ఆ ఇస్లాం మతం ఆ తరువాత అలా లేదు. మతాలలో అనేక మార్పులు వచ్చాయి. మతం వేరు మతఛాందసత్వం వేరు. Religions fundamenta-lism is different from Religion అందుచేత ఒక సంవత్సరంలోనో ఒక 30 సంవత్సరాలలోనో ఇవన్నీ పరిశీలిం చడం సాధ్యమా? ఒక్క కాపిటల్ గ్రంథాన్ని వ్రాయడానికి కారల్ మార్క్సకు 40 సంవత్సరాలు పట్టింది. లెనిన్ ఒక సందర్భంలో అంటాడు. అభివృద్ధి చెందుతున్న పెట్టుబడిదారీ ఆర్థిక విధానం తొలి దశ గురించి వ్రాయడానికి ఆనాడు ఒక్క కారల్‌మార్క్స సరిపోయాడు. కాని నేటి ప్రపంచ పెట్టుబడిదారీ ఆర్థిక విధానం గురించి వ్రాయడానికి పది మంది కారల్‌మార్క్సలు కావాలని లెనిన్ అన్నాడు. ఈ వేళ నేను అంటున్నాను. ఈ వేదిక మీద నుంచి సవినయంగానే-ఈనాటి ఆధునిక ప్రపంచాన్ని అర్థం చేసుకోడానికి పది మంది కారల్‌మార్క్సలు కాదు గదా 50 మంది కారల్‌మార్క్సలు కావాలి. చాలా క్లిష్ట సమస్యలున్నాయి. చాలా జటిలమైన సమస్యలున్నాయి. అంతుచిక్కని సమస్యలున్నాయి. కమ్యూనిస్టుల దగ్గరైనా ఇంకెవరి దగ్గరైనా కాని రెడీమెడ్ పరిష్కారాలు లేవు. అధ్యయనం చేయాలి. సత్యసంశోధన అనేది అందుకే వచ్చింది. సత్యాన్వేషణ అన్నది అందుకే వచ్చింది. ఆ సత్యాన్వేషణలో భాగంగానే ఈ సదస్సు జరుగుతూంది.

సమాజాన్నీ అర్థం చేసుకోవాలి. మార్చాలి' ఇప్పటివరకు పలువురు పలు విధాలుగా వ్యాఖ్యానాలు చేస్తున్నారు. ఆచరణలోకి వెళ్ళాలి. ఆయన సిద్ధాంతం అంతా విశ్లేషణ అంతా సమాజాన్ని అర్థం చేసుకొనేందుకు ఆ తరువాత విప్లవంద్వారా కార్యాచరణ ద్వారా వాస్తవాన్ని మార్చాలి. ఇది ఏక కాలంలో జరగాలి. Cognition of the world and change of reality. సమాజాన్ని అర్థం చేసుకోవాలి. అర్థం చేసుకోవడంతో మార్చాలి. నన్ను నేను విజ్ఞానవంతం చేసుకోవాలి. మొత్తం మనమంతా ఎడ్యుకేట్ చేసుకోవాలి. అదే విప్లవ కార్యాచరణ.

సమాజం మారాలనీ, వ్యక్తి గౌరవం, వ్యక్తి ఔన్నత్యం నిలపాలనీ, సామాజిక పీడన ఏ రూపంలో ఉన్నప్పటికీ దానిని ప్రతిఘటించాలనీ అదే విధంగా వర్గ దోపిడీని అంతం చేయాలనీ, ఆ విధంగా సామాజిక న్యాయం కొరకు స్వాతంత్ర్యం కొరకు ప్రజాస్వామ్యం కొరకు, మానవయత కొరకు కలిసివచ్చే సకల ప్రజా శక్తులు ఈ ఉద్యమానికి దోహదం చేయాలనేటటువంటి లక్ష్యంతో, అటువంటి భావాలను వ్యాప్తి చేయాలనే లక్ష్యంతో అటువంటి అవగాహనను పెంపొందించ డానికి, అందులో మన వంతు కర్తవ్యం నెరవేర్చడానికి ఏమి చేయగలుగుతాం? అన్న దృష్టితోనే ఈ సదస్సును నిర్వహించాం. ఈ సదస్సులో చాలా మంది ప్రముఖులు మాట్లాడారు. ఆ విధంగా సదస్సు లక్ష్యం పరిపూర్తి అయింది" అని చెప్పి శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావు తమ ప్రసంగం ముగించారు.

అనుబంధం – 1

# సామాజిక విప్లవానికి ఆటంకం కుల వ్యవస్థ

## ఎస్.జి.సర్దేశాయి

భారతదేశ చరిత్రలో ఒక సామాజిక విప్లవం కూడ రాకపోవటానికి కారణాలు ఏమిటి? ఇందుకు రెండు అంశాలను పరిశీలించాలి. మన దేశ చరిత్రలో ప్రతి శతాబ్దంలోనూ మార్పులు, సర్దుబాట్లు జరుగుతూనే వున్నాయి. కాని ఏనాడూ పెద్ద చీలిక రాలేదు. ఇందుకు ప్రకృతి కారణాలు సామాజిక కారణాలు వున్నాయి. కానీ సామాజిక కారణాలే ఫలితాలను నిర్ణయించాయి.

జనాభా పెరిగినపుడు అడవుల్ని నరికి మరింత భూమిని వ్యవసాయం కోసం చదును చేసుకొనే వీలుండటం ప్రకృతి కారణం. వ్యవసాయం చేసుకోవటానికి పొలం ఏనాడు తక్కువగా వుండేదికాదు.

రెండవ అంశాన్ని మరి కాస్త వివరించవలసిన అవసరం వుంది. కుల వ్యవస్థ సామాజిక, బౌద్ధిక, సాంస్కృతిక జీవితాన్ని స్థంభింపచేస్తుంది. అందులో అంతర్గతంగా వున్న సంప్రదాయ తత్వం కారణంగా అది అన్ని రకాల కార్మికులు ఉపయోగించే ఉత్పత్తి సాధనాలను కూడ స్తంభింపచేస్తుంది. కొత్త వస్తువులను కనిపెట్టాలన్న వాంఛ పూర్తిగా కుంటుపడిపోతుంది. "మీ తాత ముత్తాతలు చేసినట్టుగానే చేయి" అన్నది సామాజిక, మత రంగాలలో మాత్రమేకాక చేతి వృత్తుల వారికి కావాల్సిన పనిముట్లు విషయంలో కూడ సూత్రంగా మారిపోతుంది.

ఈ విషయాలు ఇక్కడ ఆగవు. అవసరం వచ్చినపుడు ఉత్పత్తి శక్తులు రాజకీయ విప్లవం ద్వారా ఉత్పత్తి సంబంధాలను ఛిన్నాభిన్నం చేయాలి. అమలులో వున్న ఉత్పత్తి సంబంధాలను నిలబెట్టుకోవాలనే స్వార్థ చింతన వున్న క్షీణవర్గాన్ని అధికారం నుంచి క్రిందికి లాగాలి. కొత్త సంబంధాలను, మరింత ఉత్పత్తిని ఎక్కువచేసే సంబంధాలను ప్రవేశపెట్టగల కొత్త వర్గానికి అధికారాన్ని యివ్వాలి. అందుకోసం అధికారంలో వున్న వర్గం మీద రాజకీయ పోరాటం చేయటం కోసం ప్రజల్ని పెద్ద సంఖ్యలో సమీకరించాలి.

కానీ కుల వ్యవస్థ ఈ సమీకరణను అసాధ్యం చేసింది. కుల వ్యవస్థకున్న అతి చెడ్డ గుణంగా దీన్ని నేను పరిగణిస్తాను. పెద్ద రాజకీయ పోరాటానికి పెద్ద ఐక్యత కావాలి. దాన్ని సాధించాలంటే శ్రామికవర్గం యొక్క పని విధానంలో సుమారైన ఏక రూప ప్రామాణీకరణ వుండాలి. గ్రీక్-రోమన్ బానిసల, మధ్య యుగాల యూరోపియన్ అర్ధ బానిసల పని విధానం (దోపిడీ విధానం) సంపూర్ణంగా ప్రామాణీకరింపబడిందని చెప్పటంలేదు. కాని భారతదేశంలో దోపిడీకి గురవుతున్న రకరకాల ప్రజల్లోకంటే యూరప్‌లో దోపిడీకి గురవుతున్న ప్రజల్లో ఎక్కువ ప్రామాణీకరణం కనిపించేది.

కుల వ్యవస్థలోని ప్రతి కులమూ పై కులాలకంటే తక్కువగా, అపవిత్రమైందిగా పరిగణించబడేది. అలాగే ప్రతి కులమూ క్రింది కులాలకంటే ఎక్కువదిగా, పవిత్రమైందిగా కూడా పరిగణించబడేది. మత, సామాజిక, ఆర్థిక విషయాలలో ఒక కులంవారి జీవిత పరిస్థితులకూ, మరొక కులంవారి పరిస్థితులకు సంబంధం వుండేదికాదు. ఇలాంటి పరిస్థితులలో పీడితులంతా ఎలా కలుస్తారు? తమను తొక్కి పెడుతున్న, పీడిస్తున్న వారిమీద ఎలా తిరుగుబాటు చేస్తారు? కుల వ్యవస్థ స్థంభించిపోయిన అసమానతల వ్యవస్థ. అది పీడిత వర్గం మరొక పీడిత వర్గానికి వ్యతిరేకంగా చీలిపోయిన వ్యవస్థ. ప్రాచీన, మధ్య యుగాల భారతదేశంలో పీడిత వర్గాలకు వ్యతిరేకంగా శ్రామికులు, కష్ట జీవులు ఒకటిగా కలవటానికి ఈ పరిస్థితులు అనుకూలించలేదు.

భారతదేశంలో సామాజిక-రాజకీయ తిరుగుబాట్లు రాకపోవటానికి కీలకమైన కారణం యిదే. తిరుగుబాట్లు కూడా లేనపుడు రాజకీయ విప్లవం ఎలా వస్తుంది. ఆకలి, దైన్యం, పీడన ఉన్నంత మాత్రాన తిరుగుబాట్లు రావు. తిరుగుబాటుచేసి వాటి నుంచి బయటపడవచ్చునన్న విశ్వాసం. ఆశావాదం కొద్దిగానైనా ప్రజలలో వుండాలి. అలాంటి ఆశాకిరణం లేన పుడు తిరుగుబాటు రావటం చాలా కష్టం. అలాంటి ఆశావాదం ఉండాలంటే ఐకమత్యం ఉండాలి. ఐకమత్యం రావాలంటే దోపిడీ పద్ధతులలో, పరిస్థితుల్లో సుమారైన ఏక రూప ప్రామాణీకరణ ఉండాలి.

ఆర్థిక రంగంలో పరిస్థితి ఇది భావజాలంలో, సామాజిక మనస్తత్వంలో కర్మ సిద్ధాంతం ఇలాంటి పాత్రనే నిర్వహించింది. అన్ని మతాలు కూడా భూలోకంలో తమకు లభించిన దాంతో, సంతృప్తి చెందమని, పరలోకంలో మోక్షం కోసం ప్రయత్నించమని బోధిస్తాయి. కాని సామాన్య ప్రజల్ని, బౌద్ధిక, మానసిక బానిసత్వంలో వుంచటానికి హిందూమతం లాగా కర్మ సిద్ధాంతం లాంటి అద్భుతమైన సిద్ధాంతాన్ని ఏ మతమూ సృష్టించలేదు.

తమ భౌతిక, ఆధ్యాత్మిక అధికారులైన పై కులాలవారు తమ భౌతిక శక్తితో తొక్కి పెట్టటంచేత శూద్రులు, వైశ్యులు

బండచాకిరీ చేయవలసి వచ్చిందా? కాదు కానేరదు. తమ పూర్వ జన్మల్లో గొప్ప పనులు చేయటంచేత బ్రాహ్మణులు, క్షత్రియులు ఇహ, పరలోకాలకు యజమానులు. వైశ్యులు, శూద్రులు గత జన్మల్లో పాపాలు చేయటంచేత ఈ జన్మలో బండ చాకిరీ చేయాలి. కాబట్టి వైశ్యులకు, శూద్రులకు ఈ జన్మలో మోక్షంలేదు. ఈ జన్మలో మంచి పనులు చేయటమే తమను తాము ఉద్ధరించుకోవటానికై ఉన్న ఏకైక మార్గం. వారు చేయవలసిన మంచి పని విసుక్కోకుండా పై కులాలవారికి సేవ చేయటమే. అలా చేస్తే వారు మరు జన్మలో కులాల నిచ్చెనలో ఒక మెట్టుపైకెక్కి, పై కులంలో పుడతారు. అందరికి అర్థమయ్యే భాషలో చెప్పాలంటే కర్మ, పునర్జన్మ సిద్ధాంతాలు సారం యిది.

దోపిడీకి, దౌర్జన్యానికి వ్యతిరేకంగా సామాన్య ప్రజలు ఎలా తిరుగుబాటు చేస్తారు? వారు చేసుకున్న పాపాల ఫలితంగా వచ్చిన కష్టాల్ని అనుభవించక తప్పదు కదా? ఎవరైనా తనమీద తానే ఎలా తిరుగుబాటు చేసుకుంటారు?

అంతమాత్రంచేత సామాన్య ప్రజానీకంలో అసంతృప్తి లేదనికానీ, తిరుగుబాటు కంటే తక్కువ రూపంలో అది బహిర్గతం కాలేదనీ కాని భావించకూడదు.

ఉదాహరణకు తొలిరోజుల బౌద్ధమతం, ఇతర తీవ్రవాదులు చరిత్రలో ఆనాడు సమాజంలో ఉన్న అసంతృప్తిని వ్యక్తం చేశాయి. గౌతమ బుద్ధుని బలపరచిన వారిలో ఎక్కువమంది వైశ్యులు, శూద్రులు, అంటరానివారు వున్నారు. అది సాంఘిక సంస్కరణోద్యమం.

11వ శతాబ్దంలో, బెంగాల్‌లో పాల వంశ రాజుల కాలంలో వచ్చిన కైవర్త రైతుల తిరుగుబాటు ముఖ్యమైంది. ఈ తిరుగుబాటు చాలా విశాల ప్రాంతంలో కొన్ని సంవత్సరాలపాటు జరిగింది.

("ప్రాచీన భారతదేశంలో ప్రగతి- సాంప్రదాయం" అనే గ్రంథం నుండి)

---

"నంబూద్రి బ్రాహ్మణులు నీచమైందిగా భావించి తిరస్కరించిన అథర్వణవేదంతో సహా నాలుగు వేదాలనూ, ప్రపంచం మొత్తానికి చెందిన విద్వాంసులు, మేధావులు లోతుగా పరిశోధించారు".

వేదభూమిలో శ్రీ నంబూద్రిపాద్

[ఆఖరు వేదమైన అథర్వణ వేదం ఆరావర్తంలో (ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్) క్రీ. పూ. 7-8 శతాబ్దాలలో రూపొందింది. బ్రహ్మవర్త బ్రాహ్మణులు నాలుగో వేదాన్ని గుర్తించరు. అట్టి సనాతన బ్రాహ్మణశ్రేణి బహుశా సింధు, గుజరాత్ ప్రాంతాల నుండి సరాసరి కేరళకు చేరి వుంటారు-కం. సం.]

"మౌర్య, గుప్త, హర్ష వంటి హిందూ చక్రవర్తుల కాలంలోను, మొగలాయీ చక్రవర్తులతో సహా ముస్లిం పాలకుల కాలంలోనూ ఆర్థిక సాంస్కృతిక రంగాలలో ఉన్నతస్థితి పొందిన భారతీయ సమాజం, ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ కాలంలో ఎందుకిలా పతనం చెందిందో దేశ ప్రేమికులందరూ ఆందోళనతో పరిశీలించాలి".

వేదభూమిలో శ్రీ ఇ. యం. యస్. నంబూద్రిపాద్

---

అనుబంధం - 2

# కులాలు వర్గాలపై అనగాహన-కర్తవ్యం

ఎ.బి.బర్దన్

ఇటీవల కాలంలో పట్టణ ప్రాంతాలలోను, గ్రామీణ ప్రాంతాలలోను తరచు ప్రజ్వరిల్లుతున్న కుల సంఘర్షణ, మనందరి దృష్టిని ఆకర్షించుతున్నది. "వెనుకబడిన", "అగ్ర" కులాల మధ్య ఘర్షణ వివిధ స్థాయిల్లో రాజుకుంటున్నది. వర్గ పోరాటాలు పదునెక్కుతున్న నేపథ్యంలో ఈ పరిణామాన్ని అర్థం చేసుకోవాలి.

హిందూ సమాజంలో పాతుకుపోయిన కుల విభజన స్వార్థపర శక్తుల చేతుల్లో ఒక పెద్ద ఆయుధంగా ఉపయోగ పడుతున్నది. వర్గ విభజన, వర్గ పోరాటాలు తీవ్రమవుతున్న కొద్ది, పోరాట శ్రేణులను విభజించేందుకు, ప్రజలను పోరాటాల నుండి మళ్లించేందుకు ఈ ఆయుధాన్ని ప్రయోగిస్తున్నారు. ఈ ఉద్దేశ్యంతోనే కుల సంస్థలకు ప్రాణం పోస్తున్నారు. గతంలోనూ కుల సంస్థలు వున్నాయి. అందులో కొన్ని సామాజిక సంస్కరణలకు దోహదం చేశాయి. వారి సొంత కులాల్లో విద్యా వ్యాప్తిని కలిగించాయి. కాని నేడు వాటి పునరుజ్జీవనం భిన్న పరిస్థితులలో సాగుతున్నది.

## కుల సైన్యాలు - కుల సంస్థలు

కొన్ని రాష్ట్రాలలో కుల ప్రాతిపదికపై సైన్యాలు ఏర్పడుతున్నాయి. క్రింది కులాల వారిని భయభ్రాంతులను చేసివారిని"తగు స్థానాలలో" వుంచేందుకు, నిరాఘాటంగా దౌర్జన్యాలు సాగించేందుకు కుల సైన్యాలను ఉపయోగించు తున్నారు. ఇది బీహారులో విస్తృతంగా సాగుతున్నది. ఫ్యూడల్ సంబంధాలు ఇంకా అక్కడ బలంగా కొనసాగుతున్నాయి. అయితే ఈ వ్యాధి కేరళ, మహారాష్ట్ర ప్రాంతాలకు కూడ విస్తరించటం విశేషం. కాకపోతే కుల సంస్థలు ఈ రాష్ట్రాలలో "నాగరికం"గా వ్యవహరిస్తున్నాయి.

కులాలు కొనసాగుతున్న మాట ఎంత నిజమో, ప్రతి కులంలోనూ ఆర్థిక, విద్యా వ్యత్యాసాలు పెరుగుతున్న మాట అంత నిజం. అయితే కులంలో సమిష్టి సామాజిక బంధనం, భావోద్రేకాలు ఉన్నందునే ఆ కులంలోని "స్థితిమంతులు", అధికారానికి దగ్గరగా వున్నవారు లేదా ఆర్థికంగా, విద్యాపరంగా అభివృద్ధి చెందినవారు తమ వెనుక కులంలోను "మెజారిటీ సహోదరు"లను సమీకరించగల్గుతున్నారు. ఆదివాసులు, గిరిజనులలో కూడా ఈ పరిణామం వ్యక్తమవుతున్నది. "స్థితిమంతులు" తమ కుంచి బలాన్ని వివిధ జీవన రంగాలలో తమ సంకుతం స్వార్థానికి ఉపయోగించుకుంటున్నారు.

## కులాలు -ఎన్నికలు

ముఖ్యంగా కాంగ్రెసుపార్టీ ఈ విషయాలలో గత నాలుగు శతాబ్దాల కాలంలో మంచి నైపుణ్యాన్ని సంపాదించింది. ఇతర బూర్జువా పార్టీలు ఆ బాటలోనే నడవటం నేర్చుకొన్నాయి.

ప్రజా ప్రతినిధుల సంస్థలకు జరిగే అన్ని ఎన్నికలలో కుల సంస్థలు, "సొంత కులం" లేదా "స్నేహ కులాలు" చురుకుగా పనిచేస్తున్నాయి. ఇది ఒక ఓటు బ్యాంకు; ఒక అధికార కేంద్రంగా మారిపోతున్నాయి. బూర్జువా, పెట్టీ బూర్జువా పార్టీలు ఇట్టి అవకాశాన్ని పెంచి పోషిస్తున్నాయి. ఇది అగ్ర కులాలలకు, మధ్య స్థాయి కులాలకు, క్రింది కులాలకు కూడ వర్తిస్తుంది. అగ్ర కులాల 'కులవాదం'కు వ్యతిరేకంగా క్రింది కులాలు ఒక తరహా 'కులవాదం'ఆచరిస్తున్నారు. అయితే ఇక్కడ ఒక వైరుధ్యం వుంది. ప్రజాస్వామ్య ఎన్నికల విజ్ఞప్తి ఒకటి, అదనపు ఓట్లు సంపాదించవలసిన తక్షణావసరం మరోటికారణంగా బహుళవర్గ వైఖరి అవశ్యమవుతున్నది. ఇది వైరుధ్యాల క్రమం:కుల వ్యవస్థ పాతుకుపోయిన సమాజంలో బూర్జువా ప్రజాస్వామిక వ్యవస్థలో, ఎన్నికల వ్యవస్థలో రెండు వైరుధ్యాల క్రమం- ఒకటి పై నుండి, రెండోది క్రింది నుండి కలసి సాగుతున్నాయి.

వామపక్ష పార్టీలు ఎక్కడైతే నిజమైన ప్రజాస్వామిక, లౌకిక పునాదిని నిర్మించామో, మెజారిటీ కష్టజీవులలో వర్గ చైతన్యాన్ని పెంపొందించామో, ఎక్కడైతే సామాజిక సంస్కరణోద్యమం పునాదులకంటా వ్యాప్తి చెంది, ప్రజల మనోగత భావాలను ప్రభావితం చేసిందో. అక్కడ ఎన్నికలను విషపూరితం చేసే జుగుప్సాకర, విచ్ఛిన్నకర కుల, మత వాతావరణం కన్పించదు. అంతేకాదు. అక్కడ రాజకీయాలు, పార్టీల కార్యక్రమాలు ముందు భాగాన వుంటాయి. లేదా జాతీయ రాజకీయాలు, ప్రజాస్వామ్యం, ఆర్థిక సమస్యలు ముందు ముందుకు వచ్చాయో కుల సమస్య, దాని ప్రభావం తాత్కాలికంగా వెనక్కుపోతుంది.

ఇక్కడ ఒక విషయం గమనించాలి. దోపిడీ వర్గాలు సాపేక్షంగా ఎక్కువ ఐక్యతా భావంతో వ్యవహరిస్తాయి. సాధారణంగా అవి అగ్రకులాలకు చెందినవి. పీడిత వర్గాలలో వాటి కుల సంబంధాలు రీత్యా అంత ఐక్యతా భావంలేదు. ఈ కారణంగా దోపిడీ వర్గాలు కుల ప్రాతిపదికపై కష్ట జీవులను చీల్చి తమ సొంత ప్రయోజనాలను కాపాడుకుంటున్నాయి.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02AJ04 |
| పుస్తకం పేరు | భారతదేశంలో కులవ్యవస్థ |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | YES |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 81 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |